# చతుర ప్రపంచం

## కప్పల వర్షం

**యా**సిడ్ వానలు, వడగళ్ళవర్షం గురించి మనకు తెలుసు. ఇవికాక రంగుల వర్షం గురించి కూడా మనం వినివున్నాం. మామూలుగా ఎండవేడికి నదులు, సముద్రాల్లోని నీరు ఆవిరై పైకి పోయి మేఘాలుగా ఏర్పడుతుంది. ఆ నీటిఆవిరి కొన్ని




రంగుల రసాయనాలు, దుమ్ము, ధూళి, ఇతర కాలుష్యపదార్థాలతో కలవడం వల్ల రంగుల వర్షాలు కురుస్తాయి. దక్షిణాఫ్రికాలో అప్పుడప్పుడు బ్లాక్‌రెయిన్ అంటే నల్లటి వర్షంకూడా కురుస్తుంటుంది. ఎలాగంటే అడవులు, మైదానాలలో గడ్డి కాలినప్పుడు ఆ పొగ అంతా వాతావరణంలో కలిసిపోయి నల్లటి వర్షం రూపంలో కురుస్తుందన్నమాట.

మరి కప్పల వర్షం ఏమిటి?

అదే చెప్పబోతున్నాం... కొన్ని సంవత్సరాల క్రితం ఫ్రాన్స్‌లోని టౌకాస్ పట్టణంలో ఈ కప్పల వర్షం కురిసి జనాన్ని భయభ్రాంతుల్ని చేసింది. రాత్రంతా కుండపోతగా వర్షం కురుస్తుండేసరికి తలుపులు బిడాయించి ఇంట్లో ఉండిపోయిన జనానికి ఈ సంగతి తెలీలేదు గానీ తెల్లవారి తలుపులు తీసుకుని బయటకి వచ్చి చూసేసరికి వారికి మూర్ఛ వచ్చినంత పనయిందిట. కాలు పెట్టడానికి లేకుండా వీధులన్నీ కప్పలతో కప్పబడి పోయాయట. దాదాపు రెండు అడుగుల లోతు వరకూ కప్పలు కనిపించేసరికి టౌకాస్ పట్టణ వాసులెవరికీ నోట మాట రాలేదు. కప్పల వర్షం ఎలా కురిసింది? ఇదేమైనా అరిష్టమా? అంటూ చర్చల్లో మునిగిపోయారు. నిజానికి కప్పలేకాదు, చేప పిల్లల వర్షం కూడా కురు



స్తుందిట.

నీరు ఆవిరి అయ్యేపుడు నీటితోపాటు చెరువులోని కప్పలు, చేప పిల్లలు కూడా నీటితోపాటు పైకి వెడతాయి. అవి పైకి వెళ్లి వర్షంతో పాటు కింద, పడతాయి. ఒక్కోసారి ఎక్కువ శక్తివంతంగా వచ్చే గాలులు కూడా ఎక్కడో ఉండే వస్తువులను పైకి లేవతీసుకుపోతాయి. దూర ప్రదేశాలకి వెళ్లగానే గాలి శక్తి తగ్గడంతో వాటిని కిందకు వదిలేస్తుంది. ఆ విధంగా కూడా కప్పల వర్షం కురిసే అవకాశం ఉంది. అయితే ఇదంతా అర్థంకాక కొందరు కప్పల వర్షాన్ని చూసి భీతి చెందారట.

కప్పల వర్షం కాకుండా రక్తవర్షం కూడా ఒక్కొక్కసారి జనాన్ని భయపెట్టిన దాఖలాలు ఉన్నాయి. దీనికి కూడా సైంటిఫిక్‌గా రీజన్ చెప్పవచ్చు ఎర్ర కంకర రోడ్డుమీద దుమ్ము, పూలలోని పుప్పొడి మొదలైన రంగు పదార్థాలను సుడిగాలి ఎత్తుకుపోతుంది. ఇవి మేఘంలో ఉన్న వర్షపు నీటితో కలిసి రక్తవర్ణంలో వర్షం కురుస్తుంది. దీనినే మనవాళ్లు రక్తవర్షం (బ్లడ్‌రెయిన్) అని భ్రమిస్తూంటారు.

---

## చేపలోడు

మనుషుల మనస్తత్వం ఒక్కోసారి చాలా విచిత్రంగా అన్పిస్తుంటుంది. నిజానికి ఒక




వ్యక్తి మిగతావారికన్నా భిన్నంగా ఎందుకు ప్రవర్తిస్తారన్నది ఆలోచించాల్సిన విషయమే అయినా చాలాసార్లు ఆ వింత ప్రవర్తనకు ఇతమిద్ధంగా కారణం ఇది అని చెప్పడం సాధ్యంకాదు. అందుకు ఉదాహరణగా 'చేపలోడు' గురించి చెప్పాలి.

'చేపలోడు' అని పేరు విని ఇదేం పేరా? అని ఆశ్చర్యపోతున్నారుకదూ! ఇప్పుడు అతనికి ఆ పేరు ఎందుకు వచ్చిందనే దానిగురించి చెప్పబోతున్నాం.

చేపలోడు అసలుపేరు 'సత్యేన్‌బోరాల్' వృత్తిరీత్యా అతను ఓ స్టాక్ బ్రోకర్. మరి ఈ చేపలోడు అనే పేరేంటి? కొంపదీసి




ఇది కాని అతని ప్రవృత్తి కాదుకదా! అంటే మీరు కొంతవరకూ సరిగానే గెస్ చేశారు. సత్యేన్‌బోరాల్ 'చేపలోడు'గా ఎందుకు మారాడో తెలుసుకోవాలనుకుంటున్నాం కాబట్టి మనం ఓ ఇరవై ఏళ్ళు వెనక్కి వెళ్ళాలి.

సత్యేన్‌బోరాల్ కలకత్తా నివాసి. ప్రతి ఆదివారం విధిగా ఆయన స్థానిక మార్కెట్‌కు వెడుతుంటారు. మార్కెట్ అంతా గాలించి ఎక్కడైనా సజీవంగా ఉన్న చేపలు కనిపిస్తే మాత్రం ఆయన వదిలిపెట్టరు. ఎంత రేటైనా వాటిని కొనేస్తారు. వాటిని కొని వండుకుని తింటారని అనుకుంటే పొరబడినట్లే. మార్కెట్లో కొన్న సజీవమైన చేపలను తీసుకెళ్ళి దగ్గరలో ఉన్న నదిలో విడిచిపెట్టేస్తుంటారు సత్యేన్ బోరాల్.

గత ఇరవై రెండు ఏళ్ళుగా ప్రతి ఆదివారం సత్యేన్‌బోరాల్‌కి ఇదే పని. ఇందుకోసం ఎంత డబ్బు ఖర్చుపెట్టాల్సివచ్చినా ఆయన ఏమాత్రం వెనకాడరు.

పాపం సత్యేన్‌బోరాల్ కొన్ని చేపలకైనా ప్రాణభిక్ష పెట్టాలని ఆదివారం పొద్దున్నే లేచి మార్కెట్‌కి వెళ్ళి బతికున్న చేపల్ని వెతికి పట్టుకుని వాటిని ఎంతో డబ్బు వెచ్చించి కొని నదిలో వదిలిపెడుతుంటే ఆయన కష్టాన్ని ఎవ్వరూ అర్థంచేసుకోవడం లేదు. ఆయన అలా చేపల్ని వదిలారోలేదో అక్కడ చేరిన పిల్లలు ఇలా గాలం వేసేస్తున్నారట. సత్యేన్ ఎంత అదిలించినా పిల్లలు వింటేనా? దాంతో పాపం పెద్దాయన విధిలేక పోలీసులకు తన బాధ మొరపెట్టుకున్నారట. వాళ్ళు ఆయన సదుద్దేశ్యాన్ని అర్థం చేసుకుని వారివంతు సహాయాన్ని అందిస్తున్నారు. ముఖ్యంగా డిప్యూటీ పోలీస్ ఛీఫ్‌కు సత్యేన్ అంటే వల్లమాలిన అభిమానం.

ఇప్పుడు పేరు గురించి చెప్పుకోవాలి కదూ! సత్యేన్‌బోరాల్ మీన సంరక్షణ కార్యక్రమాన్ని చూసినవారు, విన్నవారు అందరూ కలిసి ఆయనకి చేపలోడు అని పేరు పెట్టేశారు. పెళ్ళి పెటాకులు లేకుండా డబ్బంతా చేపలపాలు చేస్తున్నాడని మరి కొంతమంది ఆయనని పిచ్చోడుకింద జమకట్టేసి అసలుపేరు వదిలేసి పిచ్చోడు అని, చేపలోడు అని పిలుస్తున్నారు.

సత్యేన్‌గారికి పెళ్ళి చేసుకోవాలనే ఉంది గానీ ఆయన మీన సంరక్షణ కార్యక్రమంలో పాల్గొనే బెంగాలీ భామ ఆయనకు ఇంతవరకూ తారసపడలేదు.

---

## దయ్యాలున్నాయంటున్న హాలీవుడ్ స్టార్స్

మంత్రాలు, మంత్రగత్తెలు, దయ్యాలు, భూతాలు వీటన్నింటినీ మనకన్నా హాలీవుడ్ స్టార్స్ బాగా నమ్ముతారు. ఒకప్పటి విఠలాచార్య సినిమాలకు గ్రాఫిక్స్ జోడించి వీరి బాణీలో తీసి ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టిస్తూ సొమ్ము చేసుకుంటున్న ఘనత హాలీవుడ్‌దే.

ప్రముఖ హాలీవుడ్ హీరోయిన్‌ని అడిగితే దయ్యాలున్నాయని ఖచ్చితంగా చెప్తోంది. ఓ దయ్యం ఆమెని ఎంతో ఆదరంగా చూస్తోందిట. కెరీర్‌కి సంబంధించిన సలహాలు ఇస్తుందట. ఆ దయ్యం మరెవరోకాదు స్వయాన హీరోయిన్ తండ్రే. ఆ హీరోయిన్ పేరు జూలియా రాబర్ట్స్. ఆమెకి పదేళ్ళ వయసప్పుడు జూలియా తండ్రి క్యాన్సర్‌తో మరణించాడు. అందరి దృష్టిలో ఆయన చనిపోయినట్టే లెక్క. కానీ జూలియా మాత్రం ఈ విషయాన్ని ఎంతమాత్రం అంగీకరించదు. ఆమె ఈనాటికీ తన తండ్రి బతికే ఉన్నారని చెప్తుంది. చెప్పడం ఏమిటి ప్రతి రోజూ ఆమెకి తన తండ్రి కనిపిస్తూ ఉంటారట. ఒక్క కన్పించడమేకాదు జూలియాతో ఎన్నో విషయాల గురించి చర్చి



స్తారట. ముఖ్యంగా జూలియా రాబర్ట్స్ కెరీర్‌కి సంబంధించి ఎన్నో సూచనలు చేస్తారట. ఆమె చెప్తున్నదంతా బానేవుంది కానీ జనం మాత్రం ఆమె మాటలు విశ్వసించడంలేదు. జూలియా మంచి నటి కాబట్టి వీర యాక్టింగ్ చేసేస్తోందని అంతా అంటున్నారు. అయితే ఈ మాటలు చెవిన పడ్డా సరే జూలియా ధోరణిలో ఏమాత్రం మార్పులేదు. ఎందుకంటే ఈ విషయంలో ఆమెకి తన నమ్మకమే ముఖ్యం. ఎవరు నమ్మినా, నమ్మకపోయినా ప్రతిరోజు నాకు మా డాడీ కన్పిస్తారు. నాతో మాట్లాడతారు అన్నదే వాస్తవం అని ఘంటాపథంగా చెప్తోంది.

క్యాంప్‌బెల్ అనే మరో హాలీవుడ్ హీరోయిన్‌కి కూడా ఓ దయ్యం అనుభవం ఎదురైంది. ఇంకా చెప్పాలంటే దయ్యమూ క్యాంప్‌బెల్ మంచి ఫ్రెండ్స్. ఒకే ఇంట్లో ఉంటారు, ఎవరి పనిలో వాళ్ళుంటారు. ఒకరిని చూసి మరొకరు భయపడరు. స్నేహపూర్వకంగా మసులుకుంటారు. అసలు సంగతేంటంటే క్యాంప్‌బెల్ హాలీవుడ్ హిల్స్‌లో ఓ ఇల్లు కొనుక్కుంది. ఆ ఇంట్లో ఒక దయ్యం తిరుగుతోందని క్యాంప్‌బెల్ చెప్తోంది. అంతక్రితం ఆ ఇంట్లో హత్యకు గురైన ఓ అమ్మాయి అలా దయ్యంగా మారి తిరుగుతోందిట. క్యాంప్‌బెల్‌కి ఆ అమ్మాయి చాలాసార్లు కన్పించి నీకేం హాని చేయనని ధైర్యం కూడా చెప్పిందట. అందుకే ఆ దయ్యం ఇంట్లో తిరుగుతున్నా తనకి భయం కలగడంలేదని చెప్తోంది క్యాంప్‌బెల్.




లూసీ అనే మరో హాలీవుడ్ హీరోయిన్ ఏకంగా తన అనుభవంతో మనకి మతిపోగొట్టేస్తోంది. ఓ మగ దయ్యంతో తాను సెక్స్‌లో పాల్గొన్నానని, అంతటి మహత్తరమైన అనుభవం తనకింతవరకూ ఎదురుకాలేదని చెప్తోంది. అంతేకాదు మరోసారి అవకాశం రావాలని కోరుకుంటోందట.

ఏది ఏమైనా హాలీవుడ్‌లో దయ్యాలున్నాయని నమ్మేవారి సంఖ్య నానాటికీ పెరుగుతోంది.



# చతుర కథలు

## కాటుకు తగ్గ దెబ్బ

ఆ వూళ్లో పేరుపొందిన ఓ మందుల షాపు యజమాని పేరు మంగరాజు.

ఆ షాపులో దొరకని మందు లేక పోవడంతో ఎప్పుడూ జనంతో కిటకిటలాడుతూ ఉంటుంది.



మంగరాజుకు పూర్వులు ఆర్జించిన ఆస్తే మస్తుగా ఉంది. దానికితోడు మందుల వర్తకంలో లాభాలు వచ్చి డబ్బు పెరుగుతోంది.

పెరుగుతోంది కాని ఆ లోభి ఏ బిచ్చగానికీ పిడికెడు బియ్యంవేసి ఎరుగడు. ఏ ధర్మ కార్యానికీ రూపాయి చందా ఇచ్చి ఎరుగడు.

మందులు తయారుచేసే ఒక కంపెనీకి ఉమాపతి అనే ఒక రిప్రజెంటేటివ్ ఉన్నాడు. ఆ యువకుడు ఒకనాటి ఉదయం మంగరాజు షాపుకు వచ్చాడు.

మందుల కంపెనీల రిప్రజెంటేటివ్‌లు మంచి సూట్లు ధరించి, కంఠాలకు విలువైన 'టై'ని ముడివేసుకుని, ఏరోజుకారోజు మెరుగుపెట్టిన బూట్లు తొడుక్కొని, చూడ ముచ్చట గొలిపే లెదర్ బ్యాగ్‌ను పట్టుకొని డాక్టర్లనూ ,మందుల షాపుల యజమానులను దర్శించి తమ కంపెనీలలో తయారయే మందుల ప్రాశస్త్యాన్ని గురించి ప్రచారం చేస్తారు.

వాళ్ళు అలాగ నీట్‌టైన డ్రెస్ లో రాకపోతే ఎవడో సాదాసీదా మనిషి అనుకుని డాక్టర్లు, షాపుల ప్రొప్రయిటర్లు వాళ్ళని సరిగా గమనించక పోవడమూ అందువల్ల వాళ్ళు వచ్చిన పని కాకపోవడమూ జరుగుతుంది.



ఉమాపతి మంగరాజుతో "గుడ్‌మార్నింగ్ " అన్నాడు, మంగరాజు తిరిగి గుడ్‌మార్నింగ్ చెప్పకుండానే కుర్చీని చూపించి 'కూర్చోండి' అని సౌజ్ఞ చేశాడు. చేసి అతగాడి డ్రస్‌ను ఆపాదమస్తకం పరిశీలించాడు.

ఉమాపతి అంత చక్కగా ముస్తాబై రావడం మంగరాజుకి కిట్టలేదు. 'వీడి నెల జీతం నా దినసరి ఆదాయమంతయినావుండదు. వీడికింత వేషం ఎందుకో? ' అనుకున్నాడు.

ఉమాపతి ముస్తాబంటే మంగరాజు సహించలేకపోవడానిక్కారణం ఆ భాగ్యవంతునకు రెండుపంచలూ, రెండు జుబ్బాలూ, రెండులుంగీలూ రెండుబనీన్లూ మాత్రమే ఉన్నాయి. ఒకపంచా, జుబ్బా లాండ్రీకి పంపినప్పుడు రెండవ సెట్టును ధరించి షాపునకు వస్తాడు. రాత్రులు ఇంట్లో లుంగీబనీనుతో సరిపెట్టుకుంటాడు.

ఉమాపతి ముస్తాబుతో తన డ్రస్సును పోల్చుకునేసరికి మంగరాజుకు సిగ్గుకు బదులు చిరాకు పుట్టుకొచ్చింది. 'ఈ ఏజెంటుగాడు తన తాహతుకు మించిన వేషం వేసుకొచ్చినందుకు మొహం వాచేటట్లు చివాట్లు పెట్టి పంపాలి' అనుకున్నాడు మంగరాజు.

ఆ సమయానికి ఎక్కడనుండి వచ్చారో కానీ అరడజనుమంది షాపులో ప్రవేశించి ఎదురుగా నిలబడి ఉన్న మంగరాజుతో, "అయ్యా, గుజరాత్ భూకంప బాధితుల సహాయార్థం చందాకు వచ్చాం. తమరు విరివిగా విరాళాన్ని దయచెయ్యాలి" అన్నారు.

వచ్చినవారిలో ఒకాయన ఖద్దరు కట్టిన కాంగ్రెసు నాయకుడు. మరొకాయన కాషాయ వస్త్రాలలో ఉండి ఏదో మతానికి సంబంధించిన స్వామి అని వెల్లడౌతోంది. మూడవ వ్యక్తి కనకలత అనే సినిమా తార. నాలుగవ అతను కూడా ఒక ప్రఖ్యాత నటుడు అని గుర్తుపట్టవచ్చు మిగతా ఇద్దరూ కాలేజీ విద్యార్థులు.

మంగరాజు వాళ్ళకు మామూలు ప్రకారం మొండిచెయ్యిని చూపించి పంపించేసుండేవాడు. కానీ కొంచెం వెనుకగా కుర్చీలో కూర్చుని ఉన్న ఉమాపతి కనపడడంతో ఒక్క దెబ్బతో రెండు పిట్టల్ని కొట్టాలనిపించింది.

ఆ వచ్చినవారిలో ముందున్న కనకలతాదేవితో మంగరాజు, "అమ్మా, అరుగో మా యజమాని! వారిని అడగండి" అని ఉమాపతిని చూపించాడు.

ఐ.ఎ.ఎస్. ఆఫీసరులాగా టిప్‌టాప్‌గా ఉన్న ఉమాపతిని చూసేసరికి మంగరాజు అబద్ధం చెపుతున్నాడన్న సంశయం చందాలకోసం పై ఊరునుండి వచ్చిన ఆ బృందానికి తట్టలేదు. కనకలత, "నమస్కారమండీ" అంటూ ఉమాపతిని సమీపించింది.

"నన్ను అనవసరంగా అల్లరిపెట్ట తలపెట్టేడే మంగరాజు! ఇప్పుడు నేనేం చెయ్యాలి? 'నేనే షాపు యజమానిన'ని నటించి విరాళం ఇచ్చుకోడమా? ఇచ్చుకుందామంటే నా జేబులో చిల్లర తప్ప ఒక్క పదిరూపాయిల నోటయినా లేదే! 'ఆయనే నండి ప్రొప్రయిటరుగారు తమాషాకి నన్ను చూపించారు. విరాళం ఇచ్చేటంత నా వద్దలేదు' అంటూ ఈ వచ్చినవాళ్ళతో వెళ్ళబోసుకోవడమా? ఎంత చిక్కు తెచ్చి పెట్టాడు రాస్కెల్!' అని తికమకపడుతున్న ఉమాపతికి తటాలున ఒక ఉపాయం తట్టింది.

కనకలత ఆతనితో, "గుజరాత్‌లో లక్షలాది భూకంప బాధితులు తినడానికి తిండీ, కట్టడానికి బట్టా, తల దాచుకోడానికి కొంపా లేక అల్లాడిపోతున్నారు సార్. తమరు విరివిగా విరాళం దయచేసి ఆదు





కోవాలి" అంది.

ఉమాపతి, "ఔనమ్మా, భూకంప పీడి తుల అవస్థలను గురించి పేపర్లలో చదువుతున్నాను. చదివినప్పుడల్లా నా గుండె తరుక్కుపోతూనేవుంది. విరాళాన్ని పంపుదామనుకుంటుండగా సమయానికి మీరు వచ్చారు" అని మంగరాజువైపు తిరిగి, "గుమస్తాగారూ, ఇనప్పెట్టెలోంచి ఒక నూరు రూపాయిలు తీసి వీరికివ్వండి" అని పురమాయించాడు.

ఆ మాటలు వినేసరికి మంగరాజుకి నడుం విరిగినట్లైంది. "ఏమిటి చెయ్యడం? వందా సమర్పించుకోవలసిందేనా? లేక 'నేనే యజమానినండీ! వీడు అత్త సొమ్మును అల్లుడు ధారపోసినట్లు ఆజ్ఞాపిస్తున్నాడు' అని చెప్పెయ్యడమా? ఛస్... నేను తవ్విన గోతిలో నేనే పడ్డాను. ఈ ఏజంటుగాడు ఇంత తెలివైనవాడనుకోలేదు" అని లోలోపలే ఏడ్చుకుంటూ నిలబడిపోయాడు.

ఆ వచ్చిన వాళ్లలో ఒకడు మంగరాజుతో, "గుమస్తాగారు తాళం చెవులకోసం కాబోలు చూస్తున్నారు. అవిగో, మీ పక్క టేబుల్ మీదనే ఉన్నాయి" అన్నాడు.

"గుమస్తాగారూ!" అన్న సంబోధన మంగరాజుకు మళ్ళీ శూలంలా గుచ్చుకుంది. గత్యంతరం లేక ఐరన్ సేఫ్ తెరిచి నూరు రూపాయిలూ తీసి వాళ్ళకర్పించాడు.

కనకలత ఉమాపతివైపు తిరిగి, "మెనీ మెనీ థ్యాంక్స్ సార్" అని చెప్పి తక్కినవాళ్ళతో వెళ్ళిపోయింది.

"సొమ్మునాది, థ్యాంక్సేమో వీడికి' అని లోలోన మంగరాజు కుమిలిపోయాడు మళ్ళీ.

ఉమాపతి చిరునవ్వుతో "మంగరాజుగారూ, ఈ నాటకంలో మీరు నాకు ప్రసాదించిన పాత్రను నేను సమర్థతతో నిర్వహించగలిగానాండీ? " అని ప్రశ్నించాడు. మంగరాజు పళ్ళు కొరుకుతూ, "రాస్కెల్!" అనబోయాడు కానీ ధైర్యం చాలక తగ్గిపోయాడు.

**– పాలంకి వెంకట రామచంద్రమూర్తి**

---

## చిట్టిపండూ... చిట్‌ఫండూ

"ఒరే చిట్టిపండూ... ముప్పై ఏళ్ళొచ్చాయి..., ఇంక పెళ్ళి చేసుకోరా నాయనా. అసలు నీకు పెళ్ళయ్యే యోగం... నాకు అది చూసే యోగం ఉందో లేదో" అంటూ ముక్కు చీదింది చిట్టిపండు బామ్మ వర్ధనమ్మ.

"బామ్మా... ఊరికే నస పెట్టకే. నేను పెళ్ళి చేసుకుంటాను. నువ్వు నా పెళ్ళి చూసేపోతావ్ కానీ... అస్తమానం కాల్చుకు తినకు" అంటూ విసుక్కున్నాడు చిట్టిపండు. చిట్టిపండు అసలు పేరేమిటో చాలామందికి తెలీదు. లేకలేక కలిగిన పిల్లాడని ముక్కోటి దేవతలపేర్లు కలిపి కొల్లేటి చాంతాడంత పేరు పెట్టారు. కానీ ఇంటాబయటా అంతా... చిట్టిపండూ అనే పిలుస్తారు. అలా పిలిస్తే పలకనని చాలా సార్లు వార్నింగిచ్చి, తీరాచేసి పేరుతో పిలిస్తే ఉలకక, పలకక... మళ్ళీ చిట్టిపండూ అంటేనే 'ఓయ్' అని పలికే చిట్టిపండుకు అదే పర్మనెంట్ పేరయిపోయింది.

చిట్టిపండుకు అమ్మా, నాన్న, బామ్మ... అందరూ వున్నారు. అందరి ఆశ, జీవితాశయాలు చిట్టిపండుని పెళ్ళికొడుకుగా చూడడమే.

అందమైన, చదువుకున్న, సంపాదనపరుడైన మధ్యతరగతి వరుడు చిట్టిపండు. మోస్ట్ ఎలిజిబుల్ బ్యాచిలర్. మరి ఇంక ఆలస్యమేమిటంటారా? చిట్టిపండుకి ఈ మధ్యతరగతి జీవితం అంటే ఓ విధమైన

చిన్నచూపు. ఇప్పుడు తనున్న పొజిషన్‌కు అందకుతగ్గ బొంత అన్నట్లు ఇంకో మధ్య తరగతి సంబంధమే వస్తుంది. సో ముందు తను బాగా సంపాదించి అప్పుడు పెళ్ళి చేసుకోవాలని అతని అభిప్రాయం.

పెళ్ళీ పెటాకులూలేవు. బాదరబందీలు లేవు. బాగానే సంపాదిస్తున్నాడు అయినా సైకిల్ మీదే తిరుగుతాడు. రెండు జతల బట్టలే స్వయంగా ఉతికి ఆరేసి కట్టుకుంటాడు. సినిమాలు, షికార్లు, సరదాలు ఏమీలేవు. వ్యసనాలు, చెడు అలవాట్లు



ఏమీలేవు. అలాగని ఇంట్లో కూడా పెద్దగా ఏమీ డబ్బులియ్యడు. మరి ఈ జీతం అంతా ఏం చేస్తున్నట్లో ఎవరికీ అర్థంకాని పజిల్. అన్నట్లు సాయంత్రంనుంచి రాత్రి దాకా పార్ట్ టైం జాబ్ కూడా చేస్తున్నాడండోయ్.

ఒరే చిట్టిపండూ... నీ జీతం వగైరా వగైరా డబ్బంతా నువ్వు ఏం చేస్తున్నావురా. అని ఎవరైనా అడిగితే, 'ఆ ఒక్కటీ అడక్కు' అంటాడు. మరీ గట్టిగా ఏ తండ్రో, బామ్మో అడిగితే నేనేం పాడుచెయ్యట్లేదు. చెబుతాగా అంటాడు.

ఉద్యోగంలో చేరి కూడా ఐదారేళ్ళు గడిచిపోయాయి. ముప్పై కూడా నిండిపోయాయి. ఇంకా పెళ్ళిమాట ఎత్తకుండా నిశ్చింతగా గడిపేస్తున్న చిట్టిపండుని చూసి ఇంటా బయటా కూడా విసిగిపోయి పెళ్ళిమాట ఎత్తడం మానేశారు.

సడెన్‌గా చిట్టిపండులో స్పష్టమయిన మార్పు కొట్టొచ్చినట్టు కనబడడం మొదలుపెట్టింది. ఎవరైనా పెళ్ళికాని అమ్మాయిలు కనిపిస్తే చాలు వాళ్ళని గుచ్చిగుచ్చి చూడడం... వివరాలు, ఆరా తియ్యడం మొదలుపెట్టాడు. మొదట అంతా భయపడ్డారు ఏ గాలి అయినా సోకిందేమోనని. అదేంకాదు... నాకు పెళ్ళి చేసుకునే ఉద్దేశ్యం కలిగిందోచ్... అని స్వయంగా చిట్టిపండు చెప్పాకా కానీ అందరి మనసులూ కుదుటపడలేదు. ఇంకేముందీ...





అంతా ఎగిరి గంతులు వేసి సంబంధాలు చూడడం మొదలుపెట్టారు. ఎంత చూసినా నాసిరకం సంబంధాలూ... అనాకారి అమ్మాయిల సంబంధాలూ తప్ప మంచి సంబంధాలు రావడంలేదు, అబ్బాయికి ఏదో లోపం లేకపోతే ఇన్నాళ్ళూ ఎందుకు పెళ్ళి చేసుకోలేదు అంటూ...

ఇక వీడికి కల్యాణయోగం లేదేమో అని దిగులు పడేవేళ చక్కని చుక్కలాంటి అమ్మాయి... అన్నివిధాలా బాగున్న సంబంధం రావడం... ఓకే అంటే ఓకే... అనుకోవడం జరిగింది. అయితే పెళ్ళికి మాత్రం రెండునెలల గడువుపెట్టాడు చిట్టిపండు.

సరే... ఇన్నేళ్ళు ఆగగాలేంది... రెండు నెల్లంటే ఎంతలే అని ఇంట్లో వాళ్ళు ఊరుకున్నారు.

ఓ మంచిరోజు చూడమని... మంచి సెంటర్‌లో వున్న ఆరేడు లక్షల విలువ చేసే ఫ్లాట్ చూద్దాం రమ్మని ఇంటిల్లిపాదినీ తీసుకెళ్ళాడు. అంతా చూశారు. బాగా నచ్చింది. కానీ ఇప్పుడంత సొమ్మేది అనేది అందరి సందేహం. అది మీకనవసరం. నెల్లాళ్ళలో మంచి గృహప్రవేశ ముహూర్తం చూడమన్నాడు. సరేకానీలే... వాడేం చిన్నవాడా చితకవాడా... ఏదో దాచేవుంటాడు అని హుషారుగా గృహప్రవేశానికి ముహూర్తం పెట్టేశారు.

ఆ ఇంటికి తగ్గట్టు మంచి... మంచి ఫర్నిచరూ... టీవీ, ఫ్రిజ్... సమస్తం చూడడం... సెలక్ట్ చేసి ఆర్డర్లివ్వడం జరిగిపోయాయి. ఎవరో తెలిసున్నవాళ్ళ ద్వారా మంచి కండిషన్‌లో వున్న సెకండ్ హేండు కారు బేరమాడి పెట్టాడు.

మంచి హుషారుగా... దర్జాగా తిరుగుతున్న చిట్టిపండును చూసి ఆనందించిన వాళ్ళూ ఉన్నారు, అసూయపడ్డవాళ్లూ ఉన్నారు.

ఇక వారంరోజుల్లో కొత్త ఇంట్లోకి వెళ్ళిపోతాం... సామాన్లు అవీ (ఆర్డర్లిచ్చినవి) సర్దేసుకుంటాం. రెండు మూడురోజుల్లో రిజిస్ట్రేషన్... అంటూ హడావిడి పడడం మొదలుపెట్టాడు చిట్టిపండు.

ఇప్పుడైనా చెప్పరా బాబూ! చచ్చేంత టెన్షన్‌గా వుంది. అంత డబ్బేదీ? ఎక్కడైనా అప్పుగానీ, ఏదైనా లోన్‌కానీ చేశావా? అడిగాడు తండ్రి బతిమాలుతూ. ఆరోజు ఉదయాన్నే కాఫీ తాగుతూ, పేపరు చదువుతున్న చిట్టిపండు పెద్దగా అరిచి విరుచుకుపడిపోయాడు. స్పృహ లేదు. డాక్టర్లు చూసి ఇంజక్షన్ అదీ ఇచ్చాక స్పృహలోకి వచ్చిన చిట్టిపండు అస్పష్టంగా ఆవేదనగా, 'గోవిందా గోవిందా' అని కలవరిస్తున్నాడు.

నిక్షేపంలాంటి పిల్లాడు ఇదేమిటీ సంధి ప్రేలాపనా... అని భయపడ్డారు అయిన వాళ్ళు.

రెండురోజులు గడిచిపోయాయి. గోవిందా... నా డబ్బు గోవిందా... నా డబ్బు అనడం మినహా మరోమాటలేదు. వైద్యం చేస్తున్న డాక్టరుకు రోగమేమిటో అంతపట్టలేదు.

మాటల సందర్భంలో డాక్టర్‌గారి మిత్రుడొకడు... ఛ...ఛ... ఎంత దగా, మోసం ఉన్నాయో చూశావా లోకంలో. అనేకమంది దాచుకున్న సొమ్మంతా తీసుకుని ఆ రామానుజం... అదేనయ్యా 'గోవిందా గోవిందా' చిట్‌ఫండు కంపెనీ ఓనరు పరారయ్యాడు. నాకు తెలిసినవాళ్ళే బోలెడుమంది... పాపం ఎంతో కష్టపడి దాచుకున్న సొమ్ము పోవడంతో లబోదిబోమని గోలెడుతున్నారు. పాపం... మా చుట్టాలతను ఒకరు స్పాట్‌లో ఎటాక్ వచ్చి పోయాడు. అయినా చిన్నా... చితకా కూడబెట్టి పిల్లల పెళ్ళిళ్ళకో... చదువులకో దాచిపెట్టుకున్న సొమ్ము



అర్థాంతరంగా అలా దోచుకోబడితే పాపం ఎవరికైనా ఎంత కష్టంలే... అంటూ నిట్టూర్చాడాయన.

అంతే... అది విన్న మన డాక్టర్ యురేకా... యురేకా అంటూ గంతులేసి ఆ మిత్రుడిని అఫళంగా వదిలేసి శరవే గంతో హాస్పిటల్‌కొచ్చాడు. పుట్టెడు దిగులుతో కొడుకు మంచంపక్కన కూర్చున్న చిట్టిపండు తల్లితండ్రులను పిలిచి మీ వాడేమయినా 'గోవిందా గోవింద' చిట్ ఫండ్‌లో కష్టమరా... అనడిగాడు. అది విన్నవెంటనే వాళ్ళకూ విషయం అర్థం అయింది. వీడు ఇన్నేళ్ళూ కూడబెట్టి ఇందులో దాచాడా?! అందుకేనా ఆ సొమ్ము డ్యూడేట్ అయిందనే కాబోలు... ఇల్లు... సామాను, కారు, అన్నీ అమర్చుకుని పెళ్ళి చేసుకుందామనుకున్నాడు కాబోలు. అంటూ ఇంటికి పరుగెట్టి చిట్టిపండు అల్మరా తెరిచి చూస్తే... దానిలో గోవిందా... గోవిందా చిట్ ఫండ్ తాలూకు పాస్‌బుక్‌లూ, నెలనెలా చిట్టిపండు జమ చేసిన రసీదులు... ఒకటా రెండా పాపం... పది లక్షలకు కట్టాడు. అది చూస్తూనే చిట్టిపండు తండ్రి కూడా గుండె పట్టుకు కూలబడిపోయాడు.

చివరికి ఆశలన్నీ అడియాశలవగా, ఇంకా పెళ్ళి వాయిదా వేస్తే ఇంట్లోవారు తన్నినా తంతారని వధువు మెళ్ళో మూడు ముళ్ళూ వేశాడు చిట్టిపండు.

– మీనాక్షిశ్రీనివాస్

---

## గాలింపు

పోలీస్ ఉన్నతాధికారుల సమావేశం జరుగుతోంది. వాడిగా, వేడిగా యమ సీరియస్‌గా వుంది వాతావరణం.

కొందరు అధికారుల ముఖాల్లో నెత్తురు చుక్కలేదు. వాడిపోయి, వడలిపోయి, దీనంగా దయనీయంగా వున్నాయి.

వేదికమీద వున్న డిజీపీ ఫైరయిపోతున్నాడు. ఆగ్రహంతో ఊగిపోతున్నాడు.

ఏసీ హాల్ కూల్‌గా వుంది. అయినా అధికారుల నుదుటిమీద స్వేదబిందువులు తారట్లాడుతున్నాయి. ఎదురుగా వున్న మినరల్ వాటర్ బాటిల్స్ ఖాళీ చేస్తున్నారు.

డీజీపీ ఎవరిమీద విరుచుకుపడతాడో అని ఎవరికివారే బెంబేలు పడుతున్నారు.

మూడు హత్యలు, ఆరు రేపులు, పన్నెండు కిడ్నాపులు, ఇరవై నాలుగు దొమ్మీకేసులు, నలభై ఎనిమిది వివిధ వర్గాల్ని బెదిరించి డబ్బు వసూలుచేసిన కేసులు రికార్డుల్లో రిజిస్టరై వున్న మాఫియాడాన్, నెంబర్‌వన్ రౌడీషీటర్ షంషేర్ తాజాగా నగరంలో ఓ ప్రముఖుడ్ని హత్యచేశాడు. ఆ ప్రముఖునికి చెందిన వర్గమంతా (కులం) నిరసన వ్యక్తంచేయడంతోపాటు ప్రభుత్వంమీద అసంతృప్తితో, ఆగ్రహంగా వుంది.

ఆ మాఫియా డాన్‌ని అరెస్ట్ చేయడం కోసమే అధికారుల సమావేశం జరుగుతోంది.

"ఏది ఏమైనా చాలా తొందరగా షంషేర్‌ని అరెస్ట్ చేయకపోతే మన పరువు గంగలో కలిసిపోతుంది. ఇప్పటికే మన డిపార్ట్‌మెంట్‌ని ప్రజలు విశ్వసించడం లేదు. పెద్దపెద్ద జీతాలు తీసుకుంటూ నేరస్థుల్ని కాపాడుతున్నామని కొన్ని డర్టీ పేపర్స్ రాస్తున్నాయి. షంషేర్‌ని త్వరలో అరెస్ట్ చేసి మన శక్తిసామర్థ్యాల్నీ, ప్రతిభనీ నిరూపించుకోవాలి" అంటూ డీజీపీ అతనిని అరెస్ట్ చేయడానికి అనుసరించాల్సిన వ్యూహాన్నీ, గాలింపుని ఉధృతం

చేయాల్సిన ఆవశ్యకతనీ గూర్చి నొక్కి వక్కాణించి కదిలాడు.

ముందు మూడుజీపులూ, వెనుక ఆరు కారులూ ఎస్కార్ట్‌తో కదిలిన కాన్వాయ్ ప్రయివేట్ గెస్ట్‌హౌస్‌కి దారితీసింది.

బూట్స్ టకటకలాడించుకుంటూ డీజీపీ గెస్ట్‌హౌస్‌లోనికి దారితీశాడు. లోపల షంషేర్!

ఎత్తుగా వున్న వత్తయిన సోఫామీద



కూర్చునీ టీవీలో వస్తున్న అసెంబ్లీ కార్యక్రమాలు వీక్షిస్తున్నాడు.

షంషేర్‌ని ప్రభుత్వమే కాపాడుతున్నదనీ, అసమర్థ, అవినీతి ప్రభుత్వం తక్షణం రాజీనామా చేయాలని ప్రతిపక్ష నాయకుడు గొంతు చించుకుని బిగ్గరగా అరుస్తున్నాడు.

టీవీలో దృశ్యాన్ని చూసి నవ్వుకుంటున్న షంషేర్ డీజీపీ రావడంతో వినయంగా లేచి నుంచున్నాడు.

"ఏం సార్... ఎంతవరకూ వచ్చింది విషయం? " అడిగాడు.

"ఉదయం సి.ఎం. హోం మినిస్టర్ పిలిచి కోప్పడ్డారు. ఇంకా ఇక్కడే ఎందుకు వుంచావని నిలదీశారు. ప్రతిపక్షాలు అవకాశం దొరికిందికదాని గొడవ చేస్తున్నాయి. వీసా, పాస్‌పోర్ట్ సాయంత్రానికి రెడీ అవుతాయి. నైట్‌కి చలో..." అన్నాడు డీజీపీ.

అదేరోజు మిడ్‌నైట్ షంషేర్ కుటుంబ సమేతంగా విమానం ఎక్కాడు.

పదిరోజుల అనంతరం కరడుగట్టిన నేరస్థుడు షంషేర్ దేశం విడిచి పారిపోయాడనీ, అతని అరెస్ట్‌కోసం ఇంటర్‌పోల్ సాయం కోరుతున్నామని డీజీపీ సమక్షంలో హోం మినిస్టర్ ఆర్భాటంగా ప్రకటించాడు.

– మొలకలపల్లి కోటేశ్వరరావు

☆

# చతుర

సంపుటి : 25 సంచిక : 5 జూన్ 2002
293వ సంచిక

అతనికి ఆమె తోటిదే జీవితం.

ఆమెకి అతనితో వుంటేనే సంతోషం.

దానికితోడు వారి ప్రేమకి ఎటునుండీ ఎలాంటి ఆటంకాలు ఎదురవలేదు. మరికొన్నాళ్లల్లో వారి పెళ్ళి జరగనుండగా... అతను అమ్మమ్మగారి ఊరికి రమ్మన్నాడామెను. ఆమె రానంటే బతిమాలీ, బామాలీ ఒప్పించాడు.

తీరా ఆ ఊరెళ్ళాక ఆశ్చర్యాల మీద ఆశ్చర్యాలు ఎదురయ్యాయి ఆమెకు. ఏమిటవి? ఆడపిల్ల చీకటిపడ్డాక ఒంటరిగా వీధిలోకి వస్తేనే విచిత్రంగా చూసే ఆ ఊళ్ళో... పెళ్ళి కాకుండానే ప్రేమికునితో వచ్చిన ఆ అమ్మాయికి ఎలాంటి స్వాగతం లభించింది? ఆ ట్రిప్ ఆమెకిచ్చిన అనుభవం ఏమిటి? అది ఆమెలో అనుకోని ఆలోచనకు బీజం వేసిన కథాకమామిషు ఎలాంటిది?

నవ్వులు పండిస్తూనే మెదడుకు పదునుపెట్టే వి. నాగరత్న రచన 'మజిలీ' ఈ నెల చతుర సమగ్ర నవల.

# మజిలీ

- వి. నాగరత్న

హ్యాండ్‌బ్యాగ్‌లోంచి సెల్‌ఫోన్ మోగుతోంటే స్కూటీని రోడ్డు పక్కకి మళ్ళించింది బిందు. బ్యాగ్‌లోంచి సెల్ తీసి చెవి దగ్గర పెట్టుకుని "ఏమైపోయావు? సీట్లో వుండి పని చేసుకోకుండా చెక్కర్లు కొట్టడం పద్ధతేనా? నీకు జీతం ఇస్తోంది అందుకేనా?" అంది.

"చాల్లే ఆపు. టీకి, టాయ్‌లెట్‌కీ కూడా వెళ్ళొద్దంటావా?" అన్నాడు అవతల్నుండి శ్రీహరి.

"సర్లే విషయమేంటో చెప్పు".

"నువ్వే చెప్పు, ఇందాక రెండుసార్లు చేశావట"

"అంటే నీకు చెప్పేందుకు ఏమీ లేవా?"

"ఎందుకు లేవూ, చాలా వున్నాయి. ఇప్పుడెక్కడున్నావో చెప్పు"

"బషీర్‌బాగ్ దగ్గర"

"అయితే ట్యాంక్‌బండ్‌కి వచ్చెయ్. పావు గంటలో నేనక్కడుంటాను"

"ఓకే"

"త్వరగా రా"

"రాక రోడ్డుమీద గోలీలాడుకుంటానా?"

"గోలీలో, గచ్చకాయలో ఇక్కణ్ణించి వెళ్ళేటప్పుడు ఆడుకుందువుగాని. ఇప్పుడు మాత్రం డైరెక్ట్‌గా రా. బై" బిందు నవ్వుకుంటూ ఫోన్ బ్యాగ్‌లో పెట్టేసి స్కూటీ స్టార్ట్ చేసింది.

కొద్దిదూరం పోయాక ఒక షాపుముందు బండి ఆపి లిటిల్ హార్ట్స్, అంకుల్ చిప్స్ లాంటి తినుబండారాలు తీసుకుని, తర్వాత ట్యాంక్‌బండ్ చేరింది.

అప్పటికే శ్రీహరి లాన్‌లో కూర్చుని గడ్డి పీకుతున్నాడు.

బిందు బండి పార్క్ చేసొచ్చి అతని ఎదురుగా కూర్చుంది.

"ఇంతసేపు పట్టిందా, బషీర్‌బాగ్‌నుండి వచ్చేందుకు? నేనయితే బహదూర్‌పురా నుండి కూడా ఇంతకంటే ముందొచ్చేవాణ్ణి"

"ఇక్కడికేం ఖర్మ నాయినా? కొన్ని లక్షల మైళ్ళ దూరం" అంటూ ఆకాశం వంక చూపి "...చేరేవాడివి" అంది.

"అప్పుడే పోతానని అలాంటి ఆశలు పెట్టుకోకు. నిన్ను చేసుకుని, ఇద్దరు పిల్లల్ని కని..."

"...ఆ పిల్లల మనవళ్ళ పెళ్ళిళ్లు చేసి మరీ పోదుగాన్లే" వెక్కిరిస్తున్నట్లుగా అంది.

"అవును. నిండు నూరేళ్ళేం ఖర్మ, నూట రవైఏళ్లు బతికి గిన్నీస్ బుక్‌లోకి ఎక్కుతాను".

"గిన్నిస్‌బుక్ కాకపోతే ఈఫిల్ టవర్ ఎక్కు బాబూ"

"అద్సరేగానీ ఇందాక ఎందుకు ఫోన్ చేశావు?"

"ఆ... ఐ లవ్యూ చెబ్దామని"

"చెప్పు చెప్పు, ఇప్పుడు చెప్పు"

"ఛట్ ఇప్పుడు చెప్పే మూడ్ లేదు. అయినా నువ్వో సెల్ మెయింటైన్ చేయలేవూ?"

"నాకు అవసరంలేదు"

"బుద్ధిలేదూ, ఆడపిల్లని నా దగ్గరే వుంది"

"ఆ మాట నేనంటే గయ్‌మని లేస్తావు. ఆడ-మగ వివక్షేంటి అంటూ లెక్చర్లు దంచుతావు?"

"నేనేదో సరదాగా అన్నాన్లేగానీ నాకు అందుబాటులో వుండటం కోసమైనా నువ్వు సెల్‌ఫోన్ తీసుకో"

"చూద్దాంలేగానీ..."

"ఏంటంత నీరసంగా వున్నావు? ఏమైనా మింగుతావా?" అంటూ అంతకుముందు కొన్న పాకెట్లు బయటికి తీసింది.

ఇద్దరూ మెల్లగా తింటున్నారు.

"బిందూ" మెల్లగా పిలిచాడు హరి.

ఆ గొంతులో ధ్వనించిన ప్రేమ బిందూని పరవశంలో ముంచింది.

ఆమె మాట్లాడకపోయేసరికి మళ్ళీ పిలిచాడు.

"చెప్పు ఇక్కడే వున్నాగా"

"మా అమ్మమ్మ గురించి చెప్తుంటాను





చూడు"

"అవును. ఆవిడకేమయింది? " ఆత్రుతగా అడిగింది బిందు.

"ఆవిడకేం కాలేదుగానీ, తనకో కోరికుంది."

"ఏమిటా కోరిక? నువ్వు ఈఫిల్ టవరెక్కితే చూడాలనా? "

"కాదు, నిన్నెత్తుకుని టీవీ టవరెక్కితే చూడాలని."

బిందు సిగ్గుతెరల్ని దాచుకుని "షటప్, విషయమేంటో చెప్పు" అంది.

"ఆవిడ తనకి నచ్చిన పిల్లనే నేను చేసుకోవాలంటుంది."

"ఇక మెక్కింది చాలుగానీ, దయచెయ్. త్వరగా వెళ్ళి ఆవిడ కోరిక తీర్చు"

"ఎంత కోపం? ఈ లెక్కన రేపు మన పెళ్ళయ్యాక నేను చిన్నిల్లు పెడ్తే ఇంకెంత రౌద్రంగా వుంటావో? "

"నువ్వు చిన్నిల్లు పెడ్తే నేను పెద్దిల్లే పెడ్తాను."

"సెకండ్ సెటప్‌ని పెద్దిల్లు అనరు"

"నోర్ముయ్యి. ఇలాంటి చీప్ జోక్స్ వేయొద్దసలు."

"అసలు నేను చెప్పేది పూర్తిగా విను."

"వినక ఛస్తానా, చెప్పి అఘోరించు."

"మా అమ్మమ్మ కోరిక కొంచెం తారుమారవుతుంది."

"అర్థం కాలేదు."

"ఆవిడకి నచ్చిన పిల్లని నేను చేసుకోవాలందికదా! నాకు నచ్చిన పిల్లని తను ఓకే చేస్తుంది, అంతే."

"ఒకవేళ చేయకపోతే" పీకల్దాకా కోపంతో అంది.

"బిందు అంటే ఏమయినా ఆషామాషీ ఆడపిల్లా నచ్చకపోవడానికి? నచ్చి తీర్తావు"

"నీకేంటో అంత నమ్మకం."

"ఎందుకంటే నువ్వు RUM వి గనుక"

"ఏంటీ, రమ్‌బాటిల్‌తో పోలుస్తున్నావా, చంపేస్తా జాగ్రత్త."

"ఓయ్ ముక్కోపీ! RUM అంటే లిక్కర్ కాదు, శాంతించు."

"మరేంటి? "

"R స్టాండ్స్ ఫర్ రంభ, U– ఫర్ ఊర్వశి, M– ఫర్ మేనక. టోటల్‌గా ఆ ముగ్గురూ కలిస్తే ఎంత స్కోర్ చేస్తారో నువ్వొక్కదానివే అన్ని మార్కులు కొట్టేస్తావన్నమాట"

"కాకా పడ్తున్నావా, ఫీలై చెప్తున్నావా? "

"ఈ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది. పొగడకపోతే దుఃఖం. పొగిడినా ఒక పట్టాన తృప్తిపడరు. ఎలాగోలా మళ్ళీ అడిగి ఇంకో పదిసార్లు చెప్పించుకుంటారు. అంతేనా? ఎదురుగా బాగున్నానా? ప్రొఫైల్‌లో బాగున్నానా, హెయిర్ స్టయిల్ బాగుందా, లిప్‌స్టిక్ బాగుందా అంటూ వంద ప్రశ్నలు"

"తెగ వాయిస్తున్నావుగానీ, ఎందరు ఆడపిల్లల్ని చూశావేంటి? "

"ఇద్దరు అక్కలు, ఇద్దరు అత్తకూతుళ్ళు వున్నారు"

"మీ మగపిల్లలేం తక్కువ. అద్దం కనిపించడం పాపం, దానిముందునుండి కదలరు. ఆఖరికి రోడ్డుపక్కన పార్క్ చేసిన కారులో వుండే మిర్రర్ వ్యూలో కూడా తలదూర్చి షోకు చేసుకుంటారు. ఊ అంటే ఆ అంటే జేబులోంచి దువ్వెన తీసి క్రాపు దువ్వుతారు"

"తల దువ్వుకోవడం ఒక్కటీ వీక్‌నెస్సే గానీ, అందానికి మీరిచ్చేంత ఇంపార్టెన్స్ అయితే ఇవ్వం"

"సర్లేగానీ, రెండు థంసప్‌లు తీసుకురా" అంది.

హరి కొద్దిదూరంలో కూల్‌డ్రింక్స్ అమ్ముతోన్న కుర్రాడ్ని చప్పట్లు కొట్టి పిలిచాడు.

కూల్‌డ్రింక్ సిప్ చేస్తున్నప్పుడు "బిందూ..." అని పిల్చాడు.

"ఏంటో చెప్పు"

"నువ్వు మా అమ్మమ్మ దగ్గరికి వస్తావు కదూ" బిందూకి పొలమారింది

"తలమీద కొట్టుకుని "ఏంటీ? " అంది.

"అంత ఆశ్చర్యం ఎందుకు? అక్కడికి నీ

గుండెకాయ కోసివ్వమన్నట్లు? "

"నువ్వడిగింది కూడా అలాగే వుంది"

"వార్నీ, మా అమ్మమ్మ దగ్గరికి రమ్మంటే నీ గుండె కోసివ్వమనడంతో సమానంగా వుందా? "

"లేదా మరి? "

"నా కోసం టాంక్‌బండ్‌కో, గండిపేటకో, మరేదో రెస్టారెంట్‌కో వస్తే లేని తప్పు మా అమ్మమ్మ దగ్గరికి అంటే ఒక ప్రేమమూర్తి అయిన వృద్ధురాలి దగ్గరికి వస్తే తప్పవు తుందా? "

"ఆవిడ ఈ ఊళ్ళోనే వుంటే అలాగే వచ్చే దాన్ని"

"వేరే ఊళ్ళో ఉంటే రాకూడదా? "

"ఇది ఇండియా బాబూ, ఆ సంగతి మర్చి పోకు"

"గాగుల్స్ దగ్గర్నించి జీన్‌పాంటు వరకూ, రిస్ట్‌వాచ్ దగ్గర్నుంచి హ్యాండ్‌బ్యాగ్ వరకూ అన్నీ ఇంపోర్టెడ్‌వే వాడ్తావు. ఆలోచన్ల దగ్గ రికొచ్చేసరికి ఇండియా గుర్తొస్తుందా? "

"అడ్డగోలుగా మాట్లాడకు, నీకసలు బుద్ధీ బుర్రా లేవా? "

"లేకపోతే నువ్వు నన్ను ఏక్సెప్ట్ చేసేదా నివా? "

"ఏమో భ్రమపడ్డానేమో అన్పిస్తోంది. లేక పోతే ఏంటి, పెళ్ళి కాకుండా నీతో కల్సి మరో ఊరు రావడమే? ! ఇంకేమైనా వుందా? "

"చాల్లేవోయ్, శీలం నీకే కాదు నాకూ ముఖ్యమే. నీతో ప్రయాణమంటే నేను భయపడాలిగానీ... నాకే లేని భయం నీకెందుకు? "

"కుళ్ళు జోకులేశావంటే హుసేన్‌సాగర్లోకి తోసేస్తా జాగ్రత్త"

"ఒద్దొద్దు. మా అమ్మానాన్నలకి ఒక్కడే కొడుకుని"

"నాక్కూడా కాబోయే ఏకైక మొగుడివి"

"కనుక నన్ను జాగ్రత్తగా చూసుకో"

"నాకే గనుక మాయలో మంత్రాలో తెలిస్తే నిన్నో చిన్ని కోడిపిల్లగా మార్చేసి జాగ్రత్తగా చూసుకునేదాన్ని"

"క్కో...క్కో... కోడిపిల్లా? "

"అవును. చిన్ని... బుల్లి కోడిపిల్ల ఎంత ముద్దుగా వుంటుందనీ"

"మా తల్లే. నీకు మంత్రాలు రానందుకు సంతోషం. ఇంతకీ మా అమ్మమ్మా వాళ్ళ ఊరికి ఎపుడెళ్దాం? "

"పెళ్ళయ్యాక"

"పెళ్ళయ్యాక ఎటూ వెళ్తాం. అపుడింత బుజ్జగించి అడగాల్సిన పనేలేదు"

"అంటే పెళ్ళయ్యాక జులుం చేద్దామను కుంటున్నావా? రమ్మంటే వస్తుంది, వద్దంటే ఇంట్లో పడివుంటుంది అనుకుంటున్నావా? "

"అంత ఉగ్రరూపం వద్దు తల్లీ. . నా ఉద్దేశం అది కాదు"

"మరేంటి? "

"పెళ్లయ్యాక అర్ధాంగివి అవుతావుగా. అంటే సగం శరీరం. నేనెక్కడికైనా వెళ్తే హాఫ్ బాడీతో ఎలా వెళ్తానోయ్, విఠలాచార్య సినిమాల్లో మాదిరి? జనాలు జడుసుకు చావరూ, సగం శరీరం కదుల్తోంటే? "

బిందు ఆ సీన్ ఊహిస్తూ నవ్వింది.

"కనుక అప్పటిమాట కాదు, ఇప్పుడు నాతో నువ్వు రావాలి. ప్లీజ్ వస్తావుకదూ"

"ఊహూ ఆ ఒక్కటీ అడక్కు"

"ప్లీజ్ టుది పవరాఫ్ ఇన్‌ఫినిటీ"

"అయినా లాభంలేదు"

"బిందూ నువ్వేం అడిగినా నో చెప్పను. మా అమ్మమ్మ నన్నెంతో ఇష్టంగా పెంచింది. ఆవిడకి నిన్ను చూపిద్దామనే చిన్న కోరిక తీర్చలేవా? "

"నువ్వింత ఇడియట్‌వేంటి హరీ? నీతో వేరే ఊరు రావడం ఎలా కుదుర్తుంది? "

"ప్రామిస్. నేనేం మిస్ బిహేవ్ చేయను. కావాలంటే వేరే వేరే కంపార్ట్‌మెంట్స్‌లో ట్రావెల్ చేద్దాం. ఇక ఆ ఊరెళ్ళాక ఎటూ మనిద్దరం ఆమడదూరంలో నడవాల్సిందే"

"అదేంటి? "



"అదో రిమోట్ విలేజ్'

"ఏ ఊరు? "

"చింతపల్లి అని"

"చింతచెట్లు ఎక్కువగా వుంటాయా? "

"చింతచెట్లు వుంటాయి. చింతలూ వుంటాయి"

"ఆc? "

"అవును. చింత అంటే బాధ"

"ఏంటీ? "

"నిజమే. మా అమ్మమ్మ ఎన్నో కష్టాలు పడింది. అందుకే అలా అన్నాను. ఆవిడంటే నాకు పిచ్చి ఇష్టం"

బిందు మౌనంగా చూసింది.

"బిందూ నీకే అలాంటి అమ్మమ్మో, నాయనమ్మో వుంటే వాళ్ళకి నన్ను చూపిస్తానంటే నేనింత బతిమాలించుకునేవాడినా? నువ్వే చెప్పు"

"నేనేం అడిగేదాన్ని కాను. చూడు హరీ నాతో నువ్వు వచ్చినా, నీతో నేనొచ్చినా భయం నాకేగానీ నీక్కాదు"

"అంటే ఇంకా అరిటాకు సామెతల్నే వల్లె వేస్తావన్నమాట. బుద్ధి లేదూ? నాకంటే ఎక్కువ సంపాదిస్తున్నావు. మగవాళ్ళకంటే ఎందులోనూ తక్కువ కాదని వాదిస్తావు. నీ సమానత్వం మాటలకే పరిమితమా? "

"పెళ్ళయ్యాక నువ్వెక్కడికి రమ్మన్నా వస్తాను"

"అక్కర్లేదు. అప్పుడెలాగూ నీ చేతిలో కీలుబొమ్మనే. నువ్వు రమ్మన్న చోటికల్లా నేనే వస్తాను. ఈ ఒక్కసారికీ నా మాట కాదనకు. నేనేం నిన్ను కొరుక్కుతినను. ఇప్పుడింత ఫస్ చేస్తున్నావుగానీ తీరా వచ్చాక మా అమ్మమ్మని చూశాక నాకంటే ఎక్కువ సంతోషిస్తావు"

"అరే, నువ్వెందుకు అర్థం చేసుకోవు హరీ, అమ్మావాళ్ళు నన్ను నీతో ఎలా పంపుతారనుకుంటున్నావు? "

"ఏం పంపిస్తే? రేపు పెళ్ళి చేసుకునేవాళ్ళమేగదా"

"దేరీజ్ మెనీ ఎ స్లిప్ బిట్వీన్ ఎ కప్ అండ్ లిప్ అన్నారు తెలుసా? "

"సామెతలకేమొచ్చెలే? ! అజాగ్రత్తగా, అశ్రద్ధగా వుంటే ఆ సామెత నిజం అవ్వచ్చు కప్పులో వున్న కాఫీ తాగకముందే ఒలికిపోవచ్చు కానీ బిందూ! మాట వరసక్కూడా మన పెళ్ళిని శంకించకు. అనుకోకుండా నేను చచ్చిపోతే తప్ప మన పెళ్ళికి ఎలాంటి ఆటంకమూ వుండదు"

బిందు కళ్లలో నీళ్ళు చిప్పిల్లాయి.

అది చూసిన హరి నవ్వేస్తూ "ఏయ్ స్టుపిడ్, ఈమాత్రానికే ఏడుస్తున్నావా? ఏదేమైనా నీ ధైర్యం, సమానత్వపు ఫోజు అన్నీ మేకపోతు గాంభీర్యం లాంటివే. సహజంగా, స్థిరంగా వుండేవి కాదు" అన్నాడు.

"నేనసలు నీతో మాట్లాడను"

"సారీ సారీ సారీ అంటున్నాడు శ్రీహరీ..." అంటూ పేరడీ కట్టాడు.

బిందు లెక్కచేయనట్లు లేవబోయింది.

"ఓ చెలీ... క్షమించమన్నానుగా..." మళ్ళీ రాగం తీశాడు, ఆమెని లేవద్దన్నట్లు చేయిపట్టుకుని ఆపి.

బిందు విసుగ్గా చూసేసరికి "ఆ సినిమాలో ఊర్మిళయినా క్షమించింది గానీ నువ్వు క్షమించేట్లు లేవే"

"ఇంకెప్పుడైనా చావు గురించి మాట్లాడ్తే చంపేస్తా జాగ్రత్త" అని నాలుక కొరుక్కుంది.

"పర్లేదులే. నీ చేతిలో చావడం కంటే కావల్సిందేం వుంది? "

"మళ్ళీ అదేమాట" అని చేతిమీద తోలూడొచ్చేట్లు గిల్లింది.

"చచ్చాన్రా దేవుడా"

అటుగా వెళ్తోన్న రెండు మూడు జంటలు గబుక్కున వెనక్కి తిరిగి వీళ్ళవంక చూశారు.

అది చూసిన బిందూకి తలకొట్టేసినట్లనిపించింది.

పెదాలు కదలకుండా బిగపట్టి





"నోర్మూయ్ ఇడియట్, అందరూ ఇటే చూస్తున్నారు" అంది.

చెక్కమొహంతో ఆమె అలా బిగపట్టి మాట్లాడ్తోంటే హరికి భలే ఫన్నీగా అన్పించి పడీపడీ నవ్వాడు.

బిందూకి తిక్కరేగి హరి తలమీద వంద కొబ్బరికాయలు పగలగొట్టాలన్నంత ఆవేశం వచ్చింది.

అప్పటికి వాళ్ళని గమనించినవాళ్ళు వెళ్ళిపోయారు.

"నీకసలు బద్ధిదగలేదా? అంతా మననే చూస్తోంటే ఆ పిచ్చి నవ్వులేంటి?"

"నావి పిచ్చి నవ్వులా? నా నవ్వు చూస్తే ఐశ్వర్యారాయ్ సల్మాన్ని క్షణంలో వదిలేసి నా కోసం పరిగెట్టుకురాదూ? నా నవ్వు చూస్తే కాజోల్ అజయ్‌దేవగన్‌ని ఆమడదూరానికి విసిరిపారేసి లగెత్తుకు రాదూ?"

"అంతేనా బాబూ? షర్మిలాటాగోర్ పటౌడీ నొదిలేసీ, హేమమాలిని ధర్మేంద్ర నొదిలేసీ వచ్చేస్తారు నీ కోసం"

"వాళ్ళా, నాకొద్దు బాబోయ్" ఆముదం తాగిన ముఖం పెట్టాడు హరి.

"ఇక వెళ్దాం లే"

"విషయం తేల్చలేదు. ఎప్పుడెళ్దామో చెప్పు"

"ఇంట్లో ఒప్పుకోరు"

"మనసుంటే మార్గాలుంటాయి. నన్ను నమ్ము, నావల్ల నీకు ఎలాంటి ఇబ్బందీ కలగదు. ఆంటీని నేను కన్విన్స్ చేస్తాను"

"వద్దులే. నేనే అడుగుతాను. ఇంతకీ ఎప్పుడు?"

"నీ ఇష్టం. నీకెప్పుడు వీలో చెప్తే దాన్ని బట్టి ప్లాన్ చేద్దాం"

"ఎన్నిరోజులు?"

"ఒక నెల వీలవుతుందా?"

"ఆటగా వుందా?"

"పోనీ అరనెల?"

"మళ్ళీ ఒక పించ్ ఆర్ పంచ్ కావాలా?"

"ఒద్దొద్దు, నువ్వే చెప్పు"

"వెళ్ళడం, రావడం కాకుండా ఒక్కరోజు వుందాం అక్కడ"

"అంతదూరం వెళ్ళి, వుండేది ఒక్క రోజా?"

"మరెన్నాళ్ళు?"

"కనీసం నాలుగయిదు రోజులు"

"అమ్మో కుదర్దు"

"సర్లే తల్లీ, నీ ఇష్టం. సరే అన్పించడానికి పది రీళ్ళు తిన్నావు. ఇక ఎన్నిరోజులు. అని డిసైడ్ చేయడానికి నాలుగురీళ్లు తింటావా?"

"పోన్లే ఏడుస్తున్నావు కదాని ఒప్పుకుంటే కాస్తయినా కృతజ్ఞత లేదా నీకు"

"నీకేం జైలు శిక్ష వేశానా? రెండు లక్షలకి చెక్ అడిగానా దయతలచి ఒప్పుకోడానికి. నా కంపెనీ నీకు ఇష్టంలేదా? మనిద్దరం కలిసి వెళ్ళడం నీకు మాత్రం సంతోషం కాదా?"

ఆ మాటకి జవాబు చెప్పలేక "ఇక నడువు మహానుభావా, మనం ఖాళీచేస్తే మరెవరైనా కూర్చుంటారిక్కడ" అంది.

ఇద్దరూలేచి మెల్లగా నడుచుకుంటూ పార్క్‌చేసిన వెహికల్స్ దగ్గరికి వచ్చారు.

వీడ్కోలు తీసుకుని ఎవరి దారినవాళ్ళు వెళ్ళారు.

★ ★ ★

బిందు ఇల్లు చేరేసరికి ఆమె తల్లి వసుమతి టీవీ చూస్తోంది.

"అమ్మా కొంచెం కాఫీ ఇవ్వవూ" అంది బిందు చెప్పులు ఒకపక్కన విప్పి, సోఫాలో కూర్చుంటూ.

"ఆగవే, కాసేపు మాట్లాడకు. ఈ అత్తకి ఇప్పటికైనా బుద్ధొస్తుందో రాదో..." అంది వసుమతి, రెప్ప ఆర్పితే ఎక్కడ ఏ సీన్ మిస్సయిపోతానో అన్నంత దీక్షగా చూస్తూ.

"హూ..." అని సుదీర్ఘంగా నిట్టూర్చి "ఇప్పటికి ఆరొందల తొంభై ఎపిసోడ్స్ అయ్యుండొచ్చు. ఇంతవరకూ రాని బుద్ధి ఈ ఎపిసోడ్‌లో వచ్చేస్తుందా?" అంది.

"ష్... ఊరుకో" అసహనంగా అంది వసుమతి.

"అంత అర్థంపర్థంలేని పరమ జిడ్డు సీరియల్స్ తీసేవాళ్ళకి బుద్ధిలేదు సరే, వాటిని నీకెలా చూడబుద్ధేస్తోందమ్మా" అంది బిందు ముఖం వికారంగా పెట్టి.

కూతురి మాటలవల్ల ఆ డైలాగులు ఏమైనా విన్పించవేమోనని టీవీ సౌండ్ పెంచేసింది వసుమతి.

"ఆ వీర ముష్టి సీరియల్‌కి అంత సౌండ్ కూడానా? నేను లోపలికెళ్తున్నాలేగానీ, వాల్యూమ్ తగ్గించి జాగ్రత్తగా చూసుకోమ్మా" అని లేచింది బిందు.

స్నానంచేసి, ఫ్రెష్‌చేసుకుని, లోసౌండ్‌లో సీడీ ప్లేయర్ ఆన్‌చేసి, ఉమెన్స్ ఎరా చదువుకుంటూ పడుకుంది బిందు.

"ఇదిగో కాఫీ తీసుకో బిందూ" అంది వసుమతి కొద్దిసేపటి తర్వాత గదిలోకొచ్చి.

కాఫీ అందించి తల్లి వెళ్ళబోతుంటే "ఏంటమ్మా అంత కంగారు? కమర్షియల్ బ్రేక్‌లో వచ్చావా? మళ్ళీ సీరియల్ మొదలవుతుందా? " అంది బిందు.

"ఆ సీరియల్ అయిపోయింది. ఆ అత్తకి బుద్ధిరానేలేదు. కొన్ని జీవితాలంతేలే. ఇంకో సీరియల్ మొదలవుతుంది. రా, వచ్చి నువ్వు కూడా చూడు"

"ఆ చెత్త చూసి భరించేంత ఓపిక నాకు లేదులేగానీ, నీతో కొంచెం మాట్లాడాలమ్మా" అంది బిందు.

"ఇప్పుడే వస్తానుండు"

"ఈ సీరియల్ తర్వాత ఇంకోటి ఏదో వస్తుందిగా"

"అది చూడన్లే. మళ్ళీ మీ నాన్నొచ్చేలోపు చేమదుంపల ఫ్రై చేయాలి"

"నాన్నొచ్చేలోపు నీతో మాట్లాడాలమ్మా"

"అలాగలాగే" పరిగెడుతున్నట్లు వెళ్ళింది వసుమతి.

"తెలుగు ఛానల్స్‌ని బ్యాన్‌చేస్తే బాగుండును" అని బిందు అన్నమాట వసుమతికి విన్పించలేదు.

ఒక అరగంట తర్వాత బిందు బయటికొచ్చింది.

టీవీలో మరేదో సీరియల్ వస్తూనే వుంది.

వసుమతి వంటింట్లో చేమదుంపల ముక్కల్ని వేయిస్తూనే టీవీ ఫాలో అవుతోంది.

బిందు నాలుగైదు ఛానల్స్ మార్చి చూసింది.

ఎక్కడా సంతృప్తి కలగక ఆఫ్ చేసింది.

"అయ్యో, టీవీ ఎందుక్కట్టేశావు? ఆవిడకి పాపం అన్నీ కష్టాలే. మొగుడు కర్కోటకుడు, అత్తమామలు రాక్షసులు, పిల్లలు పిశాచాలు..."

బిందు నీరసంగా చూసింది.

"టీవీ పెట్టు బిందూ. ఇదొక్కటీ అయ్యేసరికి ఈ వేపుడు కూడా పూర్తవుతుంది. నువ్వేదో చెప్తానన్నావుగా. అన్నం తింటూ చెబ్దువుగాని"

బిందు టీవీ ఆన్‌చేసి గదిలోకి వెళ్ళిపోయింది.

ఇంతలో ఫోన్ మోగితే వెళ్ళి అందుకుంది.

అవతల్నుండి హరి "ఆంటీని అడిగావా? " అన్నాడు.

"లేడికి లేచిందే ప్రయాణం అన్నట్లుంది. నీకు అంత తొందరెందుకు హరీ? అడిగాక నేనే చెప్తాగా"

"ఏయ్ ముక్కోపీ, ఆ కోపాగ్నిలోపడి నీ ముక్కు ఎప్పుడో కాలిపోతుంది. జాగ్రత్త. ముక్కులేని మొహాన్ని చూడలేం. అంతా నిన్ను నోస్‌లెస్‌ఫెలో" అంటారు.

"అప్పుడు నీ నోస్ ఇద్దుగాన్లే"

"కిడ్నీస్ అయితే రెండుంటాయి గనుక ఒకటిచ్చినా పర్లేదు. వున్న ఒక్క ముక్కునీ ఎక్కడిచ్చేది? "

"నీప్రేమ తగలెయ్య. నాకోసం అవసరమైతే నీ ముక్కుని డొనేట్ చేయలేవా? "





"తుమ్మినా ఊడిరాని ముక్కుని ఎలా ఇచ్చి చచ్చేది? ఇంతకీ ఆంటీ ఇంట్లో వుందా? "

"టీవీ చూస్తూ వంట చేస్తోంది"

"నీ చిర్రుబుర్రులకి కారణం అదా? "

"అమ్మతో మాట్లాడాక నేనే ఫోన్ చేస్తాను గానీ ఇక నువ్వు పెట్టెయ్"

బిందు ఫోన్ కట్‌చేసి పెట్టేసి మళ్ళీ తల్లి దగ్గరికొచ్చింది.

అంతలో కాలింగ్‌బెల్ మోగింది.

"మీ నాన్న వచ్చినట్లున్నాడు, చూడు"

"నాన్నొచ్చేలోపు నాతో మాట్లాడే తీరిక నీకు లేకపోయింది" కొంచెం నిష్ఠూరంగా అని తలుపు తీసేందుకు వెళ్ళింది బిందు.

తండ్రితోబాటు ఆయన స్నేహితుడు మూర్తి కూడా వున్నాడు.

"హలో అంకుల్, బాగున్నారా? " పలకరించింది బిందు.

"బాగున్నానమ్మా" అంటూ లోనికొచ్చాడు.

బిందు లోపలికెళ్ళి మరుసటిరోజు ఆఫీసుకు వేసుకోవాల్సిన డ్రెస్ తీసి ఇస్త్రీ చేసుకుంది.

స్నేహితురాలు అనిత ఫోన్‌చేస్తే మాట్లాడింది.

పాటలు వింటూ కళ్ళు మూసుకు పడుకుంది.

కొద్దిసేపటికి వసుమతి వచ్చి, "బిందూ, ఇదేంటి, ఈ టైంలో పడుకున్నావు? " అంది.

"నేనేం నిద్ర పోవడంలేదు" కళ్ళు తెరవకుండానే చెప్పింది.

"సరే, అన్నం తిందుగానిరా" అంది వసుమతి.

టేప్ ఆఫ్‌చేసి తల్లి వెనక నడిచొచ్చి ముభావంగా భోజనం చేసింది.

ఆ సమయంలో కూడా టీవీలో సీరియల్స్ వస్తూనే వున్నాయి. ఎడతెరిపి లేకుండా అలా ఒకదాని తర్వాత ఒకటి వస్తూనే వుంటాయి. అందుకే బిందూకి అవంటే తగని చిరాకు.

వసుమతి కూతురికి అన్నం వడ్డిస్తోన్నా, బాల్కనీలో కూర్చున్న భర్త, అతని స్నేహితుణ్ణి మధ్యలో వెళ్ళి పలకరిస్తోన్నా ఆవిడ ధ్యాస మాత్రం టీవీ మీదే వుంది.

కూతురితో మాట్లాడబోతే సమాధానం చెప్పకుండా విననట్లు వూరుకుంది.

"నీకు మరీ చిన్న చిన్న విషయాలకే కోపం వస్తుంది. రేపు హరి ఎలా భరిస్తాడో ఏమో"

బిందు ముఖం చిట్లించి చూసింది.

"నువ్వేదో మాట్లాడాలన్నావు, నాకు గుర్తుందిలేవే తల్లీ. నేనెక్కడికి పోతానని? అంకుల్ వెళ్ళిపోయాక నాన్నకి అన్నం పెట్టేస్తే నాపనైపోతుంది. నాన్న పడుకోగానే వస్తాగా, తీరిగ్గా మాట్లాడుకుందాం, సరేనా" అంటూ బుజ్జగింపుగా చెప్పింది.

బిందూ ఆందోళన బిందూది. హరితో ఊరికెళ్ళడం అనేది పెద్ద విషయం. దానికి తల్లి సమ్మతిస్తుందో లేదో. హరి అంతగా అడిగాక తనకీ వెళ్ళాలనే వుంది. అందుకే అదేదో త్వరగా మాట్లాడేయాలని చూస్తోంటే ఈ టీవీ పిచ్చితో అమ్మ డిలే చేస్తోందేమిటి అనుకుంది బిందు.



రాత్రి పదకొండు గంటలు దాటింతర్వాత

మెల్లగా అడుగుల శబ్దం రాకుండా వసుమతి బిందు పడుకున్న గదిలోకొచ్చి, తలుపు చేరవేసింది.

"ఇప్పుడు చెప్పు, ఏమిటి సంగతి? " అంది వసుమతి.

రెండు నిముషాలు బిందూ మాట్లాడ లేదు.

"తాత్సారం చేయక త్వరగా చెప్పు, ఇప్పటికే లేటైంది. రేపసలే గురువారం. పూజ వుంటుంది, పెందలాడే లేవాలి. చిన్నపిల్లలా అలకలుమాని త్వరగా చెప్పమ్మా"

"అమ్మా! నీకు నా మీద పూర్తి నమ్మకం ఉందా? "

"అదేం ప్రశ్న? "

"ముందు నేనడిగిందానికి చెప్పు"

"ఎందుకిలా అడుగుతున్నావు? ఏ విషయంలో? "

"ఎందులోనైనా సరే. నేనేం తప్పు చేయనని నీకు నమ్మకం ఉందా? లేదా? చెప్పు"

"ఉంది"

"ఉందికదా! అయితే నిన్నొకటి అడుగుతాను, కాదనవుకదూ? "

వసుమతి అయోమయంగా చూసి "ఏమిటది? " అంది.

శ్రీహరి వాళ్ల అమ్మమ్మ గురించి, ఆ ఊరికి తనని రమ్మని పిలవడం గురించి అన్నీ క్లుప్తంగా చెప్పి "నాకూ ఆ ఊరు వెళ్ళాలని, వాళ్లిద్దర్నీ చూడాలనీ ఉందమ్మా" అంది బిందు.

"పెళ్లయ్యాక వెళ్లండి" అంది వసుమతి.

"అది కాదమ్మా! నామీద నమ్మకం ఉందన్నావు కదా! నేను హరితో చాలా జాగ్రత్తగా ఉంటానమ్మా, వద్దనకుండా వెళ్లనీయవా, ప్లీజ్"

"బాగుండదు బిందూ!"

"ఎటూ పెళ్లిచేసుకోబోయే వాళ్లమే కదమ్మా. అయినా హరితో వీలయినంత దూరంగా ఉంటానమ్మా. జస్ట్ కో-పాసింజర్‌లా వెళ్లొస్తాను"

"నువ్వెంత జాగ్రత్తగా ఉన్నా అతను మగవాడు. ఏమైనా తొందరపడితే తర్వాత నెత్తీ నోరూ బాదుకున్నా లాభం ఉండదు"

"నేనంత చీప్‌గా కనిపిస్తున్నానా, అతనికి అలాంటి అవకాశం ఇవ్వడానికి? అదీకాక హరి చాలా డీసెంట్‌గా ఉంటాడమ్మా. నాతో ఎప్పుడూ మిస్‌బిహేవ్ చేయలేదు"

"కాదనను, కానీ..."

"ఇంకా కానీ ఏమిటమ్మా? "

"ఎంత మంచి వాడైనా మగవాడే కదా! ఒక ఆడపిల్లతో, అందునా చేసుకోబోయే పిల్లతో ఏకాంతం దొరికితే ఏమైనా తప్పుగా ప్రవర్తించడానికి అవకాశం ఉంది. ఇలాంటి విషయాలు నాతో చెప్పించడం బాగాలేదు"

"అలాంటి భయాలన్నీ నాకూ ఉన్నాయమ్మా. రానంటే ఎంతమాత్రం తప్పుగా ప్రవర్తించనని నాకు ప్రామిస్ చేశాడు. పైగా రాత్రి ప్రయాణాన్ని ప్రిఫర్ చేయలేదు. తెల్లవారు ఝామున బయలుదేరి వెళ్తే దాదాపు సాయంత్రానికి అక్కడికి చేరచ్చుట. ఇక అక్కడికి వెళ్లాక పల్లెటూరు కనుక ఎటూ దూరంగానే నడవాల్సి ఉంటుందన్నాడు"

వసుమతి అయిష్టంగానే చూసింది.

"అమ్మా, నేను నీ పెంపకంలో పెరిగిన దాన్ని. నన్ను నేను ఎలా సేఫ్‌గా ఉంచుకోవాలో నాకు తెలియదా? "

"ఒకవేళ నీకేమైనా ఇబ్బంది కలిగినా నిన్ను నువ్వు రక్షించుకోగలవనే నమ్మకం నీకుంటే అలాగే వెళ్లిరా" అంది వసుమతి కూతురు ఎటూ వెళ్లడానికి నిశ్చయించుకుందని అర్ధమయ్యాక.

"అమ్మా నామీద నిష్ఠూరం ఏమీ లేదు కదా? "

"నిష్ఠూరం ఎందుకు? తల్లిగా నీ మేలు కోరతాను. హరి మంచివాడని నాకూ నమ్మకమే. కానీ ఎంత మంచి వాళ్లకయినా ఒక ఛాన్స్ కల్పించడం ఎందుకని నాకనిపించింది. సరే నీక్కూడా వెళ్లాలని బలంగా ఉన్నపుడు ఆపడం నాకూ భావ్యం కాదు.




నువ్వన్నమాట నిజమే. యు కెన్ టేక్ కేర్ ఆఫ్ యువర్‌సెల్ఫ్."

"థాంక్యూ అమ్మా. అయితే వెళ్లమంటావా?"

"ఎంత తెలివే నీకు? ముందే నిర్ణయించుకుని అక్కడికేదో నామాట ప్రకారమే నడుచుకుంటున్నట్లు వెళ్లిరానా అని అడుగుతున్నావా?" అంటూ బిందు తలమీద చెయ్యేసి ఊపింది.

"నీ తెలివే వచ్చినట్టుందమ్మా"

"నాకు ఇంత తెలివెక్కడిదీ? అంతా మీ నాన్నదే వచ్చినట్టుంది. ఆయనా అంతే తను చేయదలుచుకున్నదేదో చడీ చప్పుడూ లేకుండా చేసేసి నా కోసమే అలా చేశానంటాడు. లేదా తను చేయాలనుకున్నదానికి తొంభై ఎనిమిది మార్కులు వేసి చూపుతూ ఇలా చేయమంటావా అనడుగుతాడు. నేను కాదనడానికి అవకాశమే ఇవ్వకుండా." అంటూ నవ్వింది.

అప్పటి వరకూ అమ్మ ఎక్కడ కాదంటుందో అనే టెన్షన్ మాయమై బిందూ కూడా హాయిగా నవ్వింది.

"ఇక నేవెళ్లి పడుకోనా?" అంది వసుమతి.

"ఒక్కమాట. అదొక రిమోట్ విలేజ్ అట"

"ఇంతకీ ఏ ఊరు?"

"చింతపల్లి అని కృష్ణా జిల్లాలో ఉందట. అక్కడ ఈ జీన్సులూ, మిడీలూ వేస్తే బావుండదనీ, చీర కట్టుకోమనీ చెప్పాడమ్మా"

"మరి నీకు చీర అలవాటు లేదుగా."

"అదే చెప్తే వినలేదు. ఆ నాలుగు రోజులూ ఎలాగో అవస్థ పడమన్నాడు. ఆ ఊళ్లో చదువుకున్నవాళ్లెవరూ లేరట. మోడ్రన్ గా ఉంటే విచిత్రంగా చూస్తారని మరీమరీ చెప్పాడు"

"ఎక్కువమంది చదువుకోకపోవచ్చు గానీ అసలు చదువుకున్న వారే ఉండరా?"

"అదే నాకూ అర్థంకాలేదు. అన్నట్లు నాకు చీరలు లేవుగా. నీవి కట్టుకోనా?"

"మరి బ్లౌజులు? నావి బాగా లూజవుతాయి నీకు"

"బ్లౌజులు రెడీమేడ్‌వి కొనుక్కుంటాను."

"తర్వాత అవన్నీ ఏంచేస్తావు?"

"అచలకి ఇచ్చేస్తాను"

"అన్నట్లు మీ నాన్నకి హరితో వెళుతున్నానని చెప్పేవు, నిన్నూ నన్నూ కూడా బాల్కనీలోంచి విసిరేస్తాడు."

"మరేం చెప్పను?"

"ఏదో ఒకటి చెప్పు, అసలు సంగతి తప్ప"

"నాకేం తోచడంలేదే. అబద్ధాలు చెప్పడం అలవాటు లేనిదాన్ని"

"తన్నానంటే వెళ్ళి తాటిచెట్టుమీద పడ్తావు జాగ్రత్త. నీకేమో అబద్ధాలు చెప్పే అలవాటు లేదు, నాకు వుందా?"

"నేనలా అన్లేదుగా"

"రాజుగారి పెద్ద భార్య పతివ్రత అంటే దానర్థం ఏమిటి రెండో భార్య కాదనేగా"

"సామెతలు తర్వాత చెబ్దువుగాని, ముందు నాన్నకి ఏం చెప్పాలో చెప్పమ్మా"

"అచలా వాళ్ళ అన్నయ్య పెళ్ళికి వెళ్తున్నానని చెప్పు"

"ఎక్సలెంట్ ఐడియా. దానికసలే అన్నలెక్కువ"

"అన్నలనకే తల్లీ. అన్నలంటే నక్సలైట్లని ప్రచారంలో వుంది"

"అమ్మో, నక్సలైట్ల పేరు చెప్తేనే నక్షత్రాలు కన్పిస్తాయి నాకు. అచలకి సొంత బ్రదర్లు ఇద్దరు, కజిన్ బ్రదర్లు ముగ్గురు వున్నారు. కనుక అలా చెప్తే భలే నమ్మబుల్‌గా వుంటుంది"

"ఇక వెళ్ళి పడుకోనా?"

"వెళ్ళొళ్లు. మొత్తానికి తల్లి అంటే కూతురికి అబద్ధాలు చెప్పకూడదు లాంటి నీతులు నేర్పించాలి. కానీ నువ్వేమో ఎంత చక్కటి అబద్ధాలు చెప్పొచ్చో నేర్పిస్తున్నావు. హు... ఏం అమ్మవమ్మా?" అంటూ అక్కినేని నాగే

శ్వరరావుని ఇమిటేట్ చేస్తూ మాట్లాడింది బిందూ.

"అహా... ఆ రూట్లో వస్తున్నావా? సారీ అమ్మా, నేనేదో బుద్ధిలేక అలా చెప్పమన్నాను కానీ అదేం వద్దు. రేపు ఉదయం మీ నాన్నతో నిజమే చెప్పు. అమాంతం నిన్ను విసిరికొట్టాడంటే ఏ బస్సూ ఎక్కకుండానే ఏకంగా వెళ్ళి ఆ చింతపల్లిలో పడ్తావు" అంది వసుమతి లేచి, ఆమె గదివేపు వెళ్తూ.

బిందూ తేలిగ్గా నవ్వేసింది.

★ ★ ★

శ్రీహరినుండి ఫోనొస్తుందని తెగ ఎదు చూసిన బిందు విసిగిపోయి అతని ఇంట ఫోన్‌చేసింది.

శ్రీహరి తల్లి ఫోన్ లిఫ్ట్ చేయగా "ఆంటీ... నేను బిందూని" అంది కొంచె నసుగుతూ.

"చెప్పమ్మా, ఏమిటి? "

"హరి లంచ్‌కి రాలేదా? "

"వచ్చి భోంచేసి వెళ్ళాడుగా"

"వచ్చాడా? నిన్న మీకు ఇచ్చిన కవ ఇవ్వలేదా? "



"ఇచ్చానుగా"

"రాత్రే ఇచ్చేశారా?"

"లేదు బిందూ, నువ్వు చెప్పినట్లుగా దాన్ని ఇవాళ భోజనానికి వచ్చినపుడే ఇచ్చాను. ఇంతకీ ఏం రాశావేంటి?"

"తర్వాత చెప్తాను ఆంటీ. ఇంతకీ ఓపెన్ చేశాడా?"

"నేను చూడలేదుగానీ అయినా చదవ కుండా ఎలా వుంటాడు?"

"సరే ఆంటీ, నేను తర్వాత మాట్లాడ్తాను. వుంటాను బై" అని ఫోన్ కట్‌చేసి పెట్టేసి 'ఇడియట్! ఒక ఫోన్ చేయొచ్చుగా, ఏం రోగమొచ్చింది?' అంటూ పళ్లు కొరుక్కుంది.

సాయంత్రం అయిదైె డెస్క్ లాక్ చేసే సమయానికి శ్రీహరి స్నేహితుడు వెంకట్ ఫోన్ చేశాడు.

"హలో బిందూ, అయామ్ వెరీ సారీ టు సే దిస్... హరికి ఏక్సిడెంటైంది. మెడ్విన్ హాస్పిటల్‌లో వున్నాడు..." అని అవత ల్నుండి వెంకట్ చెప్తుంటే బిందూకి గుండె ఆగినంత పనైంది.

"ఆ... ఎప్పుడైంది? ఎలా వున్నాడు?" ఒణుకుతున్న గొంతుతో అడిగింది.

"బాగానే వున్నాడు, ముందు నువ్వు బయ ల్దేరి రా"

"ఐ విల్ బి దేర్ విదిన్ టెన్ మినిట్స్. వెంకట్, నువ్వు గేట్ దగ్గరే వుండవా ప్లీజ్" అంటోంటే బిందుకి ఏడ్పొచ్చేసింది.

"నువ్వేం గాబరాపడకు బిందూ, నౌ హీ ఈజ్ ఆల్‌రైట్ అన్నానుగా"

"సరే, వచ్చేస్తున్నా" అంటూ ఫోన్ పెట్టేసి పరుగులాంటి నడకతో పార్కింగ్ ప్లేస్‌కి వెళ్ళి స్కూటీ స్టార్ట్ చేసింది.

రోడ్డని తమాయించుకున్నా కళ్ళలో నీళ్ళొచ్చేస్తున్నాయి.

'హరిని ఏ స్థితిలో చూడాల్సివస్తుందో, కాలు విరిగిందో, చెయ్యి విరిగిందో... బుద్ధి లేని గాడిద... అంత ర్యాష్‌గా డ్రైవ్ చే యొద్దంటే వినడు. ఎప్పుడూ చెప్తూనే వుంటాను ఇలాంటిదేదో జరుగుతుందని. విని తగలడ్తేకదా. దేవుడా, దేవుడా. నా హరికేం కాకుండా చూడు. ప్లీజ్... ప్చ్... ఎలాంటి కండిషన్లో చూడాల్సివస్తుందో, నాకు చాలా భయంగా వుంది.

మరీ చిన్నదెబ్బ అయితే హాస్పిటల్లో ఎడ్మిట్ చేసుకోరుగా, బ్యాండ్ ఎయిడ్ కట్టు కట్టి పంపించేస్తారు. అంటే ఏ ఫ్రాక్చరో అయ్యే వుంటుంది.

ఏదేమైనా హరికి త్వరగా తగ్గిపోవాలి. నా పేరు హిమబిందు కాదు, హరిబిందూనే. హరి లేకపోతే నాకు జీవితమేలేదు. హరికి ఏం కాకుండా చూడు స్వామీ, ప్లీజ్!, అని దారి పొడుగునా టెన్షన్ పడుతూ మెడ్విన్ హాస్పిటల్ చేరుకుంది బిందూ.

గేటు దగ్గరున్న వెంకట్‌ని చూస్తూ ఏడ్చే సింది బిందూ.

"అయామ్ వెరీ సారీ బింధూ" అంటూ కడుపు పట్టుకుని నవ్వసాగాడు వెంకట్.

కొంచెం అవతలగా అటుతిరిగి నిలబడిన శ్రీహరి బిందూ ఎదురుగా వచ్చి 'ఏప్రిల్ ఫూల్' అన్నాడు నవ్వుతూ.

బిందూకి పిచ్చి ఆవేశం వచ్చింది.

"మిమ్మల్నిద్దర్నీ మిసిసిపి నదిలోకి విసిరే యాలి" అంది.

"ఆ పనేదో త్వరగా చెయ్యి. వీసా లేకుండా అమెరికా చూసి రావచ్చు" అన్నాడు హరి.

"వెంకట్, నువ్వు కూడా ఇంత డ్రామా ఆడ్తావా?"

"పాపం, వాణ్ణేం అనకు బిందూ. నేనే బలవంతాన ఒప్పించాను"

"ఘనకార్యం చేశావులే"

"లేకుంటే నన్నంత ఘోరంగా ఫూల్‌ని చేస్తావా?"

"హమ్మయ్య, అయ్యావా?" అంది బిందూ నవ్వుతూ.

"ఇక్కడెంతసేపు నిలబడ్తాం? ఏదైనా రెస్టారెంట్‌కెళ్దాం" అన్నాడు వెంకట్.





"మినర్వా కెళ్దాం" అంది బిందూ.
శ్రీహరి హోండా వెనుక వెంకట్ కూర్చు న్నాడు.
బిందూ కూడా స్కూటీ స్టార్ట్ చేసింది.
కొద్దిసేపట్లో ముగ్గురూ మినర్వాలో కూర్చున్నారు.
"వెంకట్ నీకో గుడ్ న్యూస్ చెప్తాను"
"చెప్పు చెప్పు... ఏమిటి? "
"బట్ వన్ కండిషన్. బిల్ నువ్వే పే చేయాలి"
"చేస్తాను చెప్పు"
"అతి సంతోషంతో హార్ట్ ఎటాక్ తెచ్చుకో వుగా? "
"అబ్బ చెప్పు బిందూ"
"అచలని తెగ లవ్ చేస్తున్నావుగా, తన క్కూడా నువ్వంటే..."
"ఆ...!" ఆ క్షణంలో వెంకట్ ముఖం ఎల్బీ స్టేడియంలో హై పవర్ లైట్లలా వెలి గింది.
రెండు క్షణాలు ఆగి, "ఏప్రిల్ ఫూల్" అంది బిందూ.
అంతే వున్నట్లుండి పవర్‌కట్ అయినట్లు వెంకట్ ముఖం గాఢాంధకారంగా మారింది.
మరేరకంగా ఫూల్ని చేసినా వెంకట్ సర దాగా నవ్వేవాడే. కానీ అచలపరంగా చేస్తే నవ్వు రాకపోగా దుఃఖం ముంచుకొచ్చింది. ఆ బాధ కన్పించకుండా ముభావంగా వుండి పోయాడు."
"నీకస్సలు బుద్ధిలేదు బిందూ" అన్నాడు శ్రీహరి.
"వెంకట్‌కే బుద్ధిలేదు. అచలంటే అంత ఆరాధన వుందే, దాన్ని ఆమెతో చెప్పడా నికేం? "
"ఒకవేళ ఆ అమ్మాయి కాదంటే ఆ అవ మానాన్ని తట్టుకోలేనంటాడు వాడు"
"బుల్‌షిట్. అది కాదంటే అవమా నమా? హాయిగా హమ్మయ్య అనుకోవచ్చు. అచలకున్న డ్రెస్సుల పిచ్చి గురించి వెంక ట్‌కి తెలిసినట్లులేదు. రేపు పెళ్ళయితే డబ్బంతా బట్టలకే తగలేస్తుంది"
అప్పటికీ వెంకట్ మాట్లాడలేదు.
"చూడు వెంకట్, నీలాంటివాడు ప్రపో జల్ పెడ్తే ఏ ఆడపిల్లా కాదనదు. అయినా అచలేమైనా ఐశ్వర్యారాయా? బిల్‌గేట్స్ కూతురా? అసలింత పిరికివాడికి ప్రేమెందు కోయ్? తనని నువ్వంటే ఇష్టమా కాదా అని అడిగిచూడు. కాదంటే మాత్రం కొంప మునుగుతుందా? "
"అది కాదు..."
"నువ్వింకా డ్రాగ్ చేయకు. నేనిప్పుడే అచ లని ఇక్కడికి రప్పిస్తాను. ఇంగ్లీష్, హిందీ, తెలుగుల్లో ఏ భాషలో ఎలా ఎక్స్‌ప్రెస్ చేస్తావో నీ ఇష్టం. త్వరగా మనసులో రిహా ర్సల్ వేసుకో" అని బ్యాగ్‌లోంచి సెల్‌ఫోన్ తీసి అచల ఇంటికి డయల్ చేసింది.
అచలతో మాట్లాడ్డం అయిపోయాక, "తనొచ్చేలోపు మనం కాఫీ తాగుదాం. వచ్చాక తిందాం" అంది బిందు.
వెంకట్ సంతోషానికి అంతులేదు.
"అన్నట్లు ఇవాళే 'ఐ లవ్ యూ' చెప్పేవు" అంది బిందు వెంకట్‌ని చూస్తూ.
"ఈరోజు చెప్పడమే మేలు బిందూ. త నకీ ఇష్టమైతే పేచీలేదు. ఒకవేళ తిట్లకి లంకించుకుంటే ఏప్రిల్ ఫస్ట్‌ని అలా అన్నా నని వెనక్కి చూడకుండా వెళ్ళిపోవచ్చు"
"హూ..." అంటూ బిందూ నిట్టూర్చింది.
"ఇంతకీ నువ్వెలా ఫూల్‌ని చేశావు హరిని"
"చెప్పనేలేదా? "
"తర్వాత చెప్తానన్నాడు"
"ఏం లేదు. వెంకట్. హరిని కొత్తతర హాలో ఎలా ఆటపట్టించాలా అని ఆలోచి స్తోంటే కేరమ్ బోర్డ్‌మీద వేసే బోరిక్‌పౌ డర్ కన్పించింది. దాంతో నాకు ఫ్లాష్ వెలి గింది. ఒక చక్కటి లెటర్ హెడ్ తీసుకుని, "నేను నిన్ను పిచ్చిపిచ్చిగా ప్రేమిస్తోంటే



నువ్వేమో ఆ బిందూ వెంటపడ్డావా?" అంటూ తోచిందల్లా రాసిపడేశాను"

"నీ హ్యాండ్‌రైటింగ్ హరికి తెల్సుగా"

"నా రైటింగ్‌లా రాయలేదు. అక్షరాలని పూర్తిగా పడుకోబెట్టి ఎవరో గొట్టాం రాసినట్లు రాశాను"

"అంతేనా?"

"అంతే అయితే అందులో విశేషం ఏముంది? నాకు దక్కని ప్రేమ బిందూకి ఎందుకు దక్కాలి? అందుకే ఇందులో ఆంత్రాక్స్ పౌడర్ వేశాను అని రాశాను"

"బోరిక్ పౌడర్ ఆంత్రాక్స్ పౌడరా?" అన్నాడు వెంకట్.

"అవును. దానికోసం ఎంత కష్టపడ్డానని? లెటర్‌ముందే పోస్ట్ చేస్తే ఈ వేళ్టికి అందుతుందని గ్యారంటీలేదు. అందుకని ముందు రోజు పోస్టాఫీసుకి వెళ్ళి పోస్ట్‌మాన్ని బతిమాలి కవర్‌మీద స్టాంప్ వేయించి, ఆంటీ దగ్గరికెళ్ళి దాన్ని ఈరోజు భోజనానికి వచ్చినపుడు పోస్ట్‌లో వచ్చిన కవర్ ఇచ్చినట్లు ఇమ్మన్నాను" అంది బిందూ.

"అడ్రసు టైపు చేసి వుంటే ఏదో అఫీషియల్ లెటర్ అనుకుని భోంచేసి గదిలోకెళ్ళి కవర్ తెరుద్దునుకదా చేతులనిండా తెల్లటి పొడి. పూర్తిగా కాయితం తీస్తే పౌడరంతా మీదపడింది. ఒక్కక్షణం గుండె ఆగినంత పనైంది. పేపర్లలో చదువుతోన్న వార్త నా విషయంలో నిజమైంది ఏమిట్రా బాబూ అని అదిరిచచ్చాను" అన్నాడు హరి.

"తర్వాతెలా తెలిసింది హరీ?"

"ఏముంది, ఆ లెటర్ చదివాక ఎంత దస్తూరి మార్చినా అది ఈ డెవిల్‌పనే అని అర్థమైంది" అంటూ నవ్వాడు హరి.

వాళ్ళు అలా మాట్లాడుకుంటూ అచల కోసం ఎదురుచూడసాగారు.

'అచలతో తన ప్రేమ గురించి ఎలా చెప్పాలా? హరి, బిందుల్లా తామిద్దరూ కలిసి తిరిగే రోజులు ఎప్పుడొస్తాయా?' అని వెంకట్ ఆలోచించసాగాడు.

★ ★ ★

"చింతపల్లి గేటు దిగేవాళ్ళెవరో ముందుకి రండి" అని గట్టిగా అరిచాడు కండక్టర్.

శ్రీహరి తన ఎయిర్ బ్యాగ్ భుజానికి తగిలించుకుని, బిందు సూట్‌కేస్‌ని కుడి చేత్తో పట్టుకుని "బిందూ, మనం దిగాల్సింది ఇక్కడే" అన్నాడు.

ఒళ్లో వున్న హ్యాండ్‌బ్యాగ్‌ని భుజానికి తగిలించుకుని లేచింది బిందు.

అప్పటివరకూ కూర్చుని వుండటాన బస్సు కుదుపులకి కొంచెం అటూ ఇటూ తూలబోవడమే తప్ప పెద్దగా ఎఫెక్ట్‌లేదు. కానీ లేచి నిలబడే సరికి పైనున్న కడ్డీని ఎంత గట్టిగా పట్టుకున్నా నిలదొక్కుకోవడం కష్టంగా వుంది.

"అమ్మో, పడిపోయేట్లున్నా హరీ" అంది బిందు.

"పడవులే, రాడ్‌ని గట్టిగా పట్టుకో. కంగారేం లేదు, ఆగింతర్వాతే దిగొచ్చు" అన్నాడు హరి.

బస్సు ఆగాక మరోసారి "చింతపల్లి గేటు" అంటూ ఓ గావుకేక పెట్టాడు కండక్టర్.

శ్రీహరి ముందు, అతని వెనుక బిందు బస్సు దిగగానే అది ఎర్రటి దుమ్ముని పొగలా రేపుకుంటూ ముందుకి సాగిపోయింది.

బిందు చుట్టూ చూసింది.

"ఇదేంటి, ఇక్కడ ఇళ్లేం లేవు?" అంది ఆశ్చర్యంగా.

ఒక్క క్షణంలో శ్రీహరి అమ్రిష్‌పురిలా ముఖాన్ని భయంకరంగా పెట్టి "హ్హాహ్హాహ్హా" అంటూ పెద్దపెట్టున నవ్వాడు.

"ఏయ్ ఏంటా నవ్వు? అచ్చం విలన్‌లా వున్నావు"

"అంతా నమ్మేశావా?" అదోలాగా అడిగాడు.

"ఏం నమ్మడం?"

"మా అమ్మమ్మకోసం నిన్ను తీసుకొచ్చా





నని..."

బిందుకి గుండె ఆగినంత పనయ్యింది. కళ్ళు శ్రావణమేఘాలయ్యాయి. స్థంభించి నట్లు చూసింది.

"హ్హాహ్హాహ్హా" అని మరోసారి వికృతంగా నవ్వి "మా అమ్మమ్మది అసలీ ఊరు కానే కాదు" అన్నాడు.

"మరి నన్నెందుకు తీసుకొచ్చావు? "

"రేప్ చేద్దామని"

"చంపేస్తా జాగ్రత్త" అంది ఒణుకుతోన్న గొంతుతో.

"ఏంటి చంపేది చింతాకు పచ్చడి? ఈ చుట్టుపక్కల నరమానవులుండరు తెల్సా? మళ్ళీ బస్సయినా రేపు రావాల్సిందే. నువ్వెంత అరిచి గీపెట్టినా నిన్ను కాపాడేందుకు ఎవరూ రారు"

బిందూకి కన్నీళ్ళొచ్చేశాయి.

"నన్నెంత బతిమాలి ఒప్పించి తీసుకొచ్చి ఇలా చేస్తావా? మా అమ్మ వద్దని మొత్తుకున్నా వినకుండా వచ్చినందుకు ఇంత మోసం చేస్తావా? " అంది ఏడుస్తూనే.

శ్రీహరి అంతకంటే నటించలేకపోయాడు.

"ఏయ్ ఫూల్, నేన్నిజంగా విలన్‌లా కన్పిస్తున్నానా? " అన్నాడు.

బిందు సందేహంగా చూసింది.

"బుద్ధిలేదూ, రాజాలా పెళ్ళి చేసుకోబోతూ నిన్ను రేప్‌చేయాల్సిన ఖర్మ నాకేం పట్టింది"

"ఇంత భయపెడ్తావా, హడలిచచ్చాను. వీక్‌హార్ట్ అయితే ఈపాటికి ఫెయిలయ్యేది" అని అతని వీపుమీద బలంగా గుద్దింది.

"ఏయ్ నీ గిల్లుళ్ళు, బాదుళ్లు ఈ నాలుగు రోజులూ ఆపు. ఇదసలే కుగ్రామం. అపార్థం చేసుకుంటారు"

"అపార్థం చేసుకునేందుకేముంది? "

"ఇంకాసేపట్లో చూస్తావు గదా, ఆడపిల్లలు మగవాళ్ళవంక చూట్టానికే సిగ్గుపడ్తారు. అలాంటిది నువ్వు నన్ను తన్నేవనుకో ఇది ఆడపిల్లకాదు ఆడపిశాచం అనుకుంటారు"

"ఈ వంకతో నన్ను పిశాచం గిశాచం అని తిడ్తున్నావా? "

"నిన్ను తిట్టేంత ధైర్యమా? "

"అందుకేనా అంత భయపెట్టావు? "

"ఫర్లేదు నాకూ కాస్త ఏక్టింగ్ వచ్చన్న మాట. నేను గానీ ఏ పూణే ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లోనో చేరానంటే రాజేంద్రప్రసాదూ, రాజశేఖరూ కూడా పనికిరారు అన్పిస్తాను"

"అంతొద్దు నాయినా. మరీ అలా గాల్లో తేలేవంటే ఢామ్మని పడ్తావు. నడ్డి విరగ్గొట్టు కుంటావు"

"నాకంటే ముందు నువ్వే పడ్తావు, జాగ్రత్తగా నడువు"

"ఎంత దూరం నడవాలి? ఎటు చూసినా పొలాలే తప్ప ఇళ్ళజాడ కన్పించడంలేదే"

"ఊరు లోపలికుంది, సుమారు నాలుగు మైళ్ళు నడవాలి"

"మైగాడ్, అంతదూరమా? నావల్లకాదు ఆటో పిలువు"

"అదే మరి ఎక్స్ట్రా అంటే... ఇక్కడ ఆటోలు, రిక్షాలు, టాంగాలు ఏవీ వుండవు. కాళ్ళబండినే నమ్ముకోవాలి"

"అదేంటి? అసలా ఊళ్లోకి బస్సెందుకు వెళ్ళదు? "

"ఈ ప్రశ్న నన్ను కాదు, ఇక్కడి ఎమ్మెల్యేని అడగాలి"

"అసలా ఊళ్ళో వున్నవాళ్ళు ఎలా ఊరుకున్నారు? బస్సెక్కాలంటే ఇంతదూరం నడిచి రావాలా? ఎలా నడుస్తారు? "

"వాళ్ళకది అలవాటైపోయింది"

"కానీ నాకు అలవాటు లేదే? నేనెలా నడవను? "

"అలా అంటే ఎలా? నేను మాత్రం నిన్నెత్తుకోగలనా? "

"ఛీ పో, నిన్నెవడు ఎత్తుకోమన్నాడు? నాకు ముందే ఎందుకు చెప్పలేదు ఇలాని? "

"చెప్తే స్కూటీ తెచ్చేదానివా? "

"తప్పేం వుంది? అసలు మనం నీ





# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర' ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జూన్ చతుర నవల మజిలీ**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

హోండామీద రావాల్సింది"

"వచ్చినా ఇక్కడివరకే. ఆ తర్వాత నువ్వు నా బండి వెనుక పరిగెట్టాలి లేదా నేను దాన్ని సైకిల్లా చేత్తోపట్టుకు నడిపిస్తోంటే నువ్వు పక్కన నడవాలి"

"ఇద్దరూ కల్సి బండి ఎక్కకూడదా? "

"ఇంకా పెళ్ళవ్వలేదుగా, ఊళ్లో వాళ్ళు అపార్థంచేసుకుంటారు"

బిందుకి కోపమొచ్చినా రెట్టించలేదు.

ఆమె నాలుగడుగులు వేసేసరికి "దిసీజ్ టూమచ్" అన్నాడు.

"ఏమిటి? "

"నా ఎయిర్ బ్యాగ్, నీ సూట్‌కేస్ రెండూ నేనే పట్టుకోవాలా? "

"నేను పట్టుకోమన్నానా? నువ్వేగా స్టైల్‌గా అందుకున్నావు. మీ ఊరొచ్చాను గనుక మర్యాద పాటిస్తున్నావేమో అనుకు న్నాను" అని సూట్‌కేస్ లాక్కోబోయింది.

"వద్దులే, నీ గదినంతా ఇందులో ఇరికించి తెచ్చినట్లున్నావు బరువుగా వుంది. ఈ ఎయిర్‌బ్యాగ్ పట్టుకో" అన్నాడు.

బిందు దాన్ని తగిలించుకుంది.

"అటు కాదు, ఇటురా. షార్ట్‌కట్‌లో వెళ్దాం. కాస్తయినా నడక తగ్గుతుంది" అన్నాడు.

అప్పుడు సమయం సాయంత్రం నాలుగ వుతోంది.

అయినా ఎండ మండిపోతోంది.

ఎక్కడో దూరంగా ఇద్దరు ముగ్గురు మనుషులు కన్పించారు. పొలాల్లో పడి ఇద్దరూ నడుస్తున్నారు.

"అమ్మో ఇంత ఎండగా వుంటుందను కుంటే ఓ గొడుగయినా తెచ్చుకునేదాన్ని"

"ఇంతకంటే మండిపోయే ఎండలో పొలాల్లో పనిచేసేవాళ్లు, కొండల్లో రాళ్లు కొట్టేవాళ్లూ వున్నారు. మనం కేవలం కాసేపు నడవడమేగా"

"ఎంత తేలిగ్గా చెప్తున్నావు? నా కాళ్ళకేం చక్రాల్లేవు"

"ఒకవేళ స్కేటింగ్ షూస్ వేసుకున్నా ఈ పొలాల్లో కుదర్దులే"

"అమ్మో నా కాళ్ళు వాచిపోయేట్లున్నాయి"

"ఏం కాదులే, మరీ ఇంత సుకుమారమైతే ఎలా? "

"ఇంకెంత దూరం? "

"నాలుగడుగులు వేశావో లేదో ఎంత దూరం అంటావే? నాలుగు మైళ్ళు మైనస్ నాలుగడుగులు"

"ఇల్లు చేరడానికి ఎంతసేపు పడ్తుంది? "

"తల్లీ, దూరం ఒక్కటీ తెలిస్తే కాలం చెప్పలేం. వేగంగా నడిస్తే ఒక గంటలో వెళ్ళొచ్చు"

"మెల్లగా నడిస్తే? "

"వచ్చేవారానికి చేర్తామేమో"

"ఏం ఆటగా వుందా? "

"నాక్కాదు నీకే ఆటగా వుంది. ఒక్కో అడుగేసి అరగంట ఆగితే అయినట్లే. ఇకపై నో క్వశ్చన్స్ అండ్ ఆన్సర్స్. నేను ముందు నడుస్తుంటాను, జస్ట్ ఫాలో మీ" అని వేగంగా నడవసాగాడు.

"ఏయ్, ఏంటా ఉరకడం? "

"మాటలొద్దు, త్వరగా నడువు"

"నే చెప్పేది విను"

"వినను ముందు నడువు"

"ప్లీజ్, ఒక్కసారి వెనక్కి తిరుగు"

"ఏంటి? "

"వెనకనుండి చూస్తోంటే ఎలా వున్నావో తెల్సా? "

"హృతిక్ రోషన్లా వున్నానా? "

"లేదు. అచ్చం కొంగ గెంతుతున్నట్లు న్నావు"

"పోన్లే, ఆడకొంగలా అనుసరించు"

మామూలుగానే నడక అలవాటులేని బిందుకి పొలాల్లో నడవడం మరీ కష్టంగా వుంది. ఆ ఎత్తుపల్లాల్లో చెప్పులు స్లిప్పవుతు న్నాయి.

"హరీ ఒక పని చేయరాదూ? "

"చెప్పు"



"నేనిక్కడే వుంటాను. నువ్వు తొందర తొందరగా నడ్చుకుంటూ ...ఉహూ పరిగెట్టుకుంటూ వెళ్ళి మీ ఊళ్ళో ఎవరిదయినా వెహికిల్ తీసుకొచ్చి నన్ను ఎక్కించుకెళ్లవా"

"అలాంటి ఆశలు పెట్టుకోకు. అక్కడెవ్వరికీ బండి లేదు"

"ఒక్కరికయినా వెహికిల్ లేదా? ఇంత నాటు మనుషులేంట్రా బాబూ? రాతియుగంనాటివాళ్ళా? "

"ష్... అలా అనకు. ఇలాంటివాళ్ళు కష్టపడి పండిస్తోంటేనే మనం దర్జాగా కూర్చుని తినగల్గుతున్నాం"

"పండిస్తున్నారు నిజమేగానీ ఇంత వెనకబడి వుండాలా? "

"మళ్ళీ మాటలేనా; నడిచేదుందా? "

"నడుస్తూనే వున్నాగా"

"ఇలా పెళ్ళినడకలు నడిస్తే అయినట్లే"

"ఏయ్, నువ్వు మనిషివా, దున్నపోతువా? అంత ఫాస్ట్‌గా పోతోంటే నేను వెనకబడ్తున్నాను"

"ఇది మరీ బాగుంది. ఇప్పుడేగా వాళ్ళు వెనకబడ్డారని తిట్టావు. నువ్వు వెనకబడ్తే నాదా తప్పు, వచ్చి కలువు"

"పెద్ద ఫోజు కొడ్తున్నావుగానీ, హైదరాబాదు వెళ్ళాక చెప్తా నీ పని"

"ఏం చెప్తావేం? "

"ఎక్కడికైనా రమ్మంటావు చూడు, గంటలు గంటలు వెయిట్ చేయించి అప్పుడొస్తాను"

"ఆ సంగతి చెప్పావుగా, నిన్ను రమ్మన్న సమయానికి రెండు గంటల తర్వాత నేనొస్తాను"

"ఛీ పో... ఇంకేదో రకంగా ఏడ్పించలేనా? "

"అలాగేలే" అని హరి ఆగకుండా నడుస్తున్నాడు.

"అయ్యో, మెల్లగా నడువు. ఇక్కడే పామో కరిచినా గతి లేదు"

"ఆ మాటా నిజమే బిందూ. పొలాల్లో రకరకాల పాములుంటాయ్"

"బాబోయ్, నాకు పాములంటే భయం"

"నేనేం శివుణ్ణి కాను మెడలో ఎక్కించుకోడానికి, నాకూ భయమే. ఇక మాట్లాడకు"

"నాకు భయమేస్తోంది హరీ" అంటూ అనుమానంగా చూడసాగింది. ఎండుపుల్లలు, రెల్లు గడ్డి కూడా పామేమో అన్నట్లు.

"వై ఫియర్? అయామ్ హియర్"

"వ్వెవ్వెవ్వె"

"వెక్కిరిస్తూ ఇక్కడే కూర్చో"

మరి కాసేపు మాట్లాడకుండా నడిచింది.

"ఇంకెంతదూరం హరీ? "

"నువ్విలా నిమిషానికోసారి అడిగావనుకో చుట్టూ తిప్పి పదిమైళ్ళు నడిపిస్తానమ్మాయ్"

"పోవోయ్. అసలు ఊళ్ళోకి రాగల్గుతానో లేక మీ అమ్మమ్మే ఎదురొచ్చి నన్ను చూడాల్సొస్తుందో"

"ఏంటీ? "

"అవును. ఈ ఎండకిపోయేట్లున్నాను"

"పిచ్చి మాటలు కట్టిపెట్టు"

"ఈ బ్యాగ్ మోయడం నావల్లకాదు, నువ్వే తీసుకో"

"మరి నీ సూట్‌కేస్? "

"రెండూ పట్టుకో. మగవాణ్ణని విర్రవీగుతావు ఆ మాత్రం పట్టుకోలేవూ? "

హరి మారుమాట్లాడకుండా ఎయిర్‌బ్యాగ్ అందుకుని, తగిలించుకున్నాడు.

"ఇకనైనా ఫాస్ట్‌గా నడుస్తావా? "

"యస్... ఇప్పుడు చూడు" అంటూ అతన్ని ఓవర్‌టేక్ చేసి ముందుకెళ్ళి వెక్కిరించింది.

"సంతోషం తల్లీ. ఇలానైనా నడువు. ఈ మాట ముందే చేప్తే ఎలాగోలా అక్కణ్ణించీ నేనే మోసేవాణ్ణిగా"

కొద్దిదూరం బిందూ ముందు నడిచాక ఆగిపోయి "ఎక్కడైనా టర్నింగ్స్ వస్తే చెప్పు, మొత్తం బరువు మోస్తున్నాను కదాని ఒళ్ళు మండి వెళ్ళిపోయేవు" అంది.

హరికి నవ్వే ఓపిక్కూడా లేదు. అతనికీ




పొలాల్లో నడక అలవాటులేదు. పైగా అంత బరువుతో నడక మరీ కష్టంగా వుంది. వెనక్కి చూసిన బిందుకి జాలేసి "ఇటివ్వులే, నేనే పట్టుకుంటాను" అంది.

"వద్దు తల్లీ, మళ్ళీ నువ్వు మొరాయిస్తే నిన్ను సాగదీయడం నావల్లకాదు" అని ఇవ్వలేదు.

"సినిమాల్లో అయితే హీరోలు రెండు సూట్ కేస్‌లు అలవోకగా మోసేస్తారు. పైగా వాటితోనే ఎగురుకుంటూ పాటలు పాడ్తారు. నువ్వేంటి తెగ నీరసపడ్తున్నావు? "

"నేను హీరోలకంటే వేగంగా గెంతుతూ నడవగల్ను"

"ఆ పని చేయి"

"నువ్వేడుస్తావు? "

"ఏం ఫేడ్వను"

"నీ సూట్ కేస్‌లో వున్నవన్నీ ఇక్కడ బోర్లించేసి ఖాళీది పట్టుకుంటే స్టెప్పులు కూడా వేయగల్ను"

"అరే, సినిమావాళ్ళ టెక్నిక్ నీకూ తెల్సా? "

కొంతసేపు చురుగ్గానే నడిచిన బిందు ఆగిపోయి కర్చీఫ్ పరుచుకుని కూర్చుందో చోట.

"మళ్ళీ ఏమైంది తల్లీ? నీతోగానీ ఈ ఊళ్ళో కాపురం పెట్టానంటే రెండ్రోజుల్లో విరక్తొచ్చేసి సన్యాసుల్లో కలిసిపోవడం ఖాయం"

"ఏంటీ, ఈ దిక్కుమాలిన ఊళ్ళో కాపురమా? అనుకోడానికే చిరాగ్గా వుంది"

"మా తాతగారి ఊరిని పట్టుకుని దిక్కుమాలిన ఊరంటావా? "

"ఎవరిదైతేమాత్రం, ఎలావున్నదాన్ని అలాగే అంటాం. నీ తలమీద వాలినంతలో కాకి నల్లగా వుందనక తెల్లగా వుందంటామా? "

"ఆహా ఏంపోలిక చెప్పావమ్మా? ! మా తెలుగు మాస్టారు ఉపమా కాళిదాసస్య అన్నారుగానీ"

"ఏంటీ, ఉప్మా కాళిదాసా? ఆయనెవరు? నాకుమాత్రం ఉప్మా అంటేనే డోకొస్తుంది. మీ అమ్మమ్మ ఒకవేళ ఉప్మా చేస్తానంటే వద్దని చెప్పు"

"నీ ఉప్మాగోల అలావుంచు"

"నువ్వేగా ఉప్మా ఊసెత్తింది"

"మహాతల్లీ, నేను ఉప్మా అనలేదు. ఉపమా అన్నాను అంటే సిమిలీ"

"ఓ... ఐసీ... ఇప్పుడదెందుకు? "

"ఏంలేదు, కాళిదాసునిమించి పోలికలు చెప్పగలవని"

"ఓ, థాంక్యూ"

"నీకు పుణ్యముంటుంది, నడువు"

"నావల్ల కావడంలేదు, కాళ్ళు నొప్పి"

"సరే, అలాగే. చతికిలబడి కూర్చో సాయంత్రం కాస్తా రాత్రవుతుంది. బుస్సు బుస్సుమని పాములు విహారానికొస్తాయి"

"అమ్మో, పాములొస్తాయా? "

"వచ్చి ఊరుకుంటాయా; నీ కాళ్ళకి నమస్కరించి, మెల్ల మెల్లగా చుట్టుకుంటూ, అలా అలా..."

"ఒళ్లు జలదరిస్తోంది, అలా చెప్పకు"

"జరగబోయేది చెప్పడమూ నేరమేనా? "

"షటప్, శాడిస్ట్" అని లేచి నడవసాగింది.

చాలాదూరం నడిచాక "ఈ ఊరు మళ్ళీ జన్మలో రాను" అంది.

"మళ్ళీ రావడం సంగతి తర్వాత. ముందు ఊరు చేరు తల్లీ"

బరువులతో శ్రీహరి, ఏ బరువూ మోయకుండానే బిందు ఇద్దరూ ఆపసోపాలు పడ్తూ అడుగులేస్తున్నారు.

★ ★ ★

అరుగుమీద కూర్చుని విస్తళ్ళు కుడుతోంది శారదమ్మ.

శ్రీహరిని అల్లంత దూరంలో వుండగానే చూసి, చేటంత ముఖంతో సంబరంగా లేచి నిలబడింది.

"ఎన్నాళ్ళకొచ్చావురా హరీ?" అంది పరవశంగా.
"ఎలా వున్నావు అమ్మమ్మా?"
"ఆ... నన్నేం అడుగుతావు? ఊరు పొమ్మంటోంది, కాడు రమ్మంటోంది"
"ఇదిగో ఇలా మాట్లాడావంటే ఇప్పుడే వెళ్ళిపోతా"
"కానీ నేనిప్పుడు నడవలేను, మళ్ళీ" అంది బిందు.
"ఈ అమ్మాయెవర్రా?"
"ఈ అమ్మాయి... మరి..." నట్లు కొట్టాడు.
"అంత నసుగుడెందుకు, విషయం చెప్పక?" అంది బిందు.
"ష్..." అని సైగచేశాడు.
బిందు మౌనం వహించింది.
"అమ్మమ్మా! తన గురించి తర్వాత చెప్తాగానీ, కాసిని మంచినీళ్ళు ఇవ్వవూ, పిచ్చిదాహమేస్తోంది"
"నా మతిమండా, అగ్గిన పడొచ్చారు" అంటూ పరుగులాంటి నడకతో లోనికెళ్ళింది.
"ఆవిడ వయసెంతుంటుంది?"
"ఆడపిల్ల వయసు అడక్కూడదని నీది చెప్పవుగానీ అమ్మమ్మది చెప్పాలా?"
"పిల్లికీ, బిచ్చానికీ ఒకటే మంత్రం అంటావే? పెద్దావిడ వయసు చెప్తే గ్లామరేం పోదులే చెప్పు"
"డెబ్బయ్‌రెండు వుండొచ్చు"
"అయినా ఎంత చలాకీగా వుంది?"
"నా పోలికలే వచ్చాయి ఆవిడకి"
"అన్నట్లు నా గురించి ఎందుకు చెప్పలేదు? ఇలా అయితే నన్ను ఇన్సల్ట్ చేసినట్లే"
"ఇందులో ఇన్సల్ట్ చేయడం ఏముంది?"
"అంటే ఎవర్తోపడ్తే వాళ్ళతో, ఎక్కడికంటే అక్కడికి వచ్చేదానిలా కన్పిస్తున్నానా?"
"ఊరికే పెడర్థాలు తీయకు బిందూ, ఒకేసారి షాక్ తినిపించడమెందుకు పెద్దావిణ్ణి? మెల్లగా చెప్తాగా. అసలు చెప్పకుండానే ఆవిడ అర్థంచేసుకోనూ వచ్చు"
ఇంతలో ఆవిడ నీళ్ళగ్లాసులు తీసుకుని వచ్చింది.
ఇద్దరూ అందుకుని తాగారు.
"హాయిగా పడుకోక విస్తళ్ళు కుడ్తున్నావే?"
"ఊరికినే పడుకునే బదులు ఏదైనా పనికొచ్చే పనిచేస్తే అందం చందం. మంగమ్మ విస్తళ్ళు కుట్టి అమ్ముకుంటుంది. ఆమెక్కాస్త సాయం చేద్దామని. పరోపకారాయ ఇదం శరీరం అన్నారు"
"ఇదిగో అమ్మమ్మా, ఈ అమ్మాయికి తెలుగే సరిగారాదు, నువ్వు సంస్కృతం వల్లించావంటే కష్టం. ఇందాక ఉపమానం గురించి ఏదో అంటే ఉప్మానా అంది. ఇక ఇప్పుడు పరోపకారం అన్నావంటే పరోటానా అంటుంది" అని పెద్దగా అని, గొంతు తగ్గించి ఆవిడ చెవి దగ్గర నోరు పెట్టి, "ఈ పిల్లకి తిండి యావ జాస్తి. ఎప్పుడూ ఏదో ఒకటి పొట్టలో దాణా పడేస్తూనే వుంటుంది" అన్నాడు.
ఆ మాటలు బిందుకి విన్పించకుండా ఎలా వుంటాయి? విని, ఉడుక్కోవాలనేదే హరి ఉద్దేశం కూడా.
శారదమ్మ మూతి బిగించి నవ్వి (ఆవిడ తీరే అంత. ఎప్పుడు నవ్వినా పళ్ళు కన్పించవు. రెండు పెదాల్ని లోనికి తోసేసి నవ్వుతుంది) "అదేమైనా నేరమా? సుష్టుగా తిని, ఆదమరిచి నిద్రపోతేనే ఆరోగ్యం" అని, బిందువైపు తిరిగి "నువ్వేం పట్టించుకోకు అమ్మడూ. వాడు అందర్నీ ఎకసెక్కాలాడుతుంటాడు. అయినా మనసులో కపటం వుండదు, మంచివాడే" అంది.
"మంచివాడిలా కన్పిస్తాడుగానీ ఉత్త దుర్మార్గుడండీ" అంది బిందు
"అదేం లేదమ్మా, కాకపోతే బొత్తిగా లౌక్యం-తెలీదు"
"మీకు తెలీదులే మామ్మగారూ, ఇందాక




నన్నెంత భయపెట్టాడని? ! ఎంతైనా నిబ్బరం కలదాన్ని కనుక సరిపోయింది. మరో పిల్లయితే అక్కడే టపా కట్టేసేది"

"ఏంచేశాడేం? "

హరి గబుక్కున అడ్డొచ్చాడు.

"అబ్బ...ఏంలేదులే అమ్మమ్మా. తమా షాకి అదిగో పాము అన్నాను, ఆ మాత్రా నికే జడుసుకుని ఇంకా ధైర్యస్తురాలినని కోతలు కోస్తోంది"

"ఆడపిల్లతో పరాచికాలేంటిరా? "

"ఆడపిల్లతో కాకపోతే ఆనపకాయతో హాస్యమాడ్తామా? "

"కబుర్లు తర్వాతగానీ స్నానంచేయండి ముందు" అంటూ కుడ్తోన్న విస్తరాకుల సరంజామా అంతా తీసుకుని లోనికి దారి తీసింది శారదమ్మ.

"తాతయ్యేడి? " అనడిగాడు హరి, ఎక్కడా తాతగారి జాడ కన్పించకపోయేసరికి.

"కట్టెలు కొట్టేందుకు రాజుని పిల్చుకొస్తా నని వెళ్ళాడు. వచ్చేస్తాడు కానీ ముందు స్నానాలు చేయండి"

ఇద్దరూ తమ దుస్తులు తీసుకుని వసారాలో వున్న పెద్దావిడ దగ్గరికొచ్చారు.

"ఏంటి చూస్తున్నారు? హరీ, నువ్వా కొబ్బరి చెట్టుదగ్గరున్న గాబులో నీళ్ళతో స్నానం చేయి. అమ్మడూ, నువ్వు ఆ స్నానాల గదిలో కెళ్ళు. అక్కడ కూడా రెండు గాబులున్నాయి" అంటూ ఇద్దర్నీ పురమాయించింది.

హరి వెంటనే టవల్ చుట్టేసుకుని వెళ్ళి పోయాడు.

బిందు పెద్దావిడ చూపిన స్నానాలగది వైపు చూసి అటుగా వెళ్ళింది. దూరంగా చూస్తే కలిగిన చిరాకు, అందులోకి వెళ్ళాక అసహ్యంగా మారింది.

అది కేవలం తాటాకుల సహాయంతో దడిగా కట్టివుంది. ఒకవైపు అసలే అడ్డూ లేదు. పైన కప్పు కూడా లేదు. లోపల కనీసం గచ్చయినాలేదు. ఒక్క . నాపరాయి మాత్రం పరిచి వుంది. మిగిలిన భాగ మంతా రొచ్చురొచ్చుగా, చీదర పుట్టించే ట్లుంది.

'ఛీ... ఇక్కడా స్నానం చేయాలి? ' అను కుంది. అయినా తప్పదు. ఎవర్ని నిందించ గలదు? అసలు హరి బతిమాలినంతలో ఎగురుకుంటూ వచ్చేయడమేనా? ఓ మైగాడ్... ఈ బుల్ షిట్ పల్లెటూళ్ళో ఇంకెన్ని కష్టాలు పడాల్సివుందో. ఎన్ని తిట్టు కున్నా లాభంలేదు. ఎలాగోలా స్నానంచేస్తే గానీ ప్రాణం కాస్త కుదుటపడదు. అనుకుని చేతిలో వున్న బట్టలు, టవలు ఎక్కడ పెట్టా లా అన్నట్లు చూసింది. అక్కడో తాడైనా కట్టిలేదు.

మరోసారి నిట్టూర్చి ఒక తడికెమీద వేస్తోంటే తన మీద ఏదో పాకుతున్నట్లన్పిం చింది. ఆ తడికె శుభ్రంగాలేదు. దానికున్న మురికంతా తన పూవుల్లాంటి బట్టలకి అంటుతుంది. అయినా తప్పదు.

ఇక నీళ్ళలో చేయి పెడ్తే చల్లగా వున్నాయి.

"ఏం ఖర్మరా బాబూ? ఏనాడైనా చన్నీ ళ్ళతో స్నానంచేశానా? హాయిగా గీజర్ ఆన్ చేసి మసిలే మసిలే నీళ్ళతో స్నానంచేసేది. ఈ మామ్మగారికి వయసొచ్చిందిగానీ అస్సలు బుద్ధీబుర్రా ఎదగలేదు. స్నానంచే యమని తోలిందే తప్ప వేణ్ణీళ్ళు కావాలా అని కూడా అడగరా? తనేమైనా మహాత్మా గాంధీనా చన్నీళ్ళతో స్నానంచేయడానికి? నయం, ఇపుడు కాస్త కాఫీ ఇస్తుందో లేక మేకపాలు తెచ్చిస్తుందో? ' అనుకుని ఒక చెంబుడు నీళ్ళు ఒంటిమీద పోసుకుంది. గజగజా వణుకొచ్చింది. సోప్ కేస్‌ని కింద పెట్టేందుకు మనసొప్పక చేతిలోనే వుంచు కుని, ఒంటిచేత్తో ఒళ్ళు రుద్దుకుంటూ ఎలా గోలా స్నానం ముగించింది.

బట్టలు ఎడాపెడా చుట్టుకుని లోపలికి పరుగెత్తింది. ఆ చీర కట్టుకోడానికి తాతలు దిగొచ్చేట్లే వున్నారు. అస్సలు రావడంలేదు.

పొద్దునంటే అమ్మ తనకి చీర కట్టబెట్టి, అది కదలకుండా, జారకుండా, ఊడకుండా సేఫ్టీ పిన్నులు పెట్టింది. కానీ ఇప్పుడెలా? మామ్మగార్ని అడిగితే? అదేంటమ్మాయి, ఆడపిల్లకి చీర కట్టుకోవడం రాదా... అంటే ఎలా? పోనీయ్, నాదేం పోయింది? నాకు వచ్చినట్లు నేను కట్టుకుంటాను. ఒకవేళ కుదరకపోతే తనేం చేస్తుంది. చూడలేక పోతే వాళ్ళే కళ్ళు మూసుకుంటారు అనుకుని ఎలాగోలా చీరని చుట్టేచుట్టే దోపి పారేసింది. చివరికి నడిచేందుకు రాలేదు. ఇదేంటని ఆలోచిస్తే మరీ తాడుని చుట్టినట్లు చుట్టడం సరైన ప్రాసెస్ కాదనిపించింది. అందంగా కుచ్చిళ్ళు పెట్టడం రాకపోయినా, చేతికొచ్చినట్లు అటూఇటూ మడుస్తూ, ఎగాదిగా మరోసారి దోపింది. మళ్ళీ నడిచి చూసింది, ఫ్రీగా నడక సాగింది. సో పర్‌ఫెక్ట్ అన్నమాట.

"యస్... ఇదీ కరక్ట్... ఈ మాత్రానికేనా చీర కట్టుకోవడం రాదు అనుకుంది. ఏదీ బ్రహ్మావిద్యకాదు. ఒకటి రెండుసార్లు చేస్తే అన్నీ వస్తాయి. చీర కట్టుకోవడం వెరీ సింపుల్ అన్నమాట. రేపు హైదరాబాదు వెళ్ళాక ఈ కళానైపుణ్యాన్ని అందరికీ ప్రదర్శించి చూపాలి. 'అచలకి ఈసారి నేనే చీర కట్టాలి' అనుకుంటూ క్రాఫ్ దువ్వుకుని, తెల్లగ్గా పౌడర్ రాసుకుని, చిన్ని బిందియాని నుదుట పెట్టుకుంది.

తర్వాత స్ప్రే చేసుకుని తాజాదనంతో వసారాలోకి వచ్చింది.

శ్రీహరి లాల్చీ పైజమాలో ఎంతో హోమ్లీగా వున్నాడు. అతన్నెప్పుడూ ప్యాంటూ, షర్టుల్లోనే చూసి వుండటాన ఇవాళ ఇంటిమనిషిలా, మరీమరీ దగ్గరగా అన్పించాడు. బాగున్నావని చెంప నిమిరి చెప్పాలన్పించినా పద్ధతి కాదని గబుక్కున తన కోరికని తానే అదుపు చేసుకుని అదే భావాన్ని కళ్ళెగరేయడం ద్వారా చెప్పింది.

హరి ఆమెని పైనుండి కిందివరకూ ఎగాదిగా చూసి, ఒక్కక్షణం తమాయించుకుని రెండోక్షణం కిసుక్కున నవ్వాడు.

"పోన్లే కదా బాగున్నావని సైగ చేస్తే ఏంటా వెధవ నవ్వు, అసందర్భంగా?" అంది బిందు మందలింపుగా.

"అసందర్భం ఏంకాదు, ఎలా వున్నావో ఒకసారి అద్దంలో చూసుకుంటే నీకే తెలుస్తుంది"

"నా బ్యాగ్‌లో వున్న చిన్న మిర్రర్ తప్ప ఇక్కడ పెద్ద అద్దం ఏమీలేదు. ఎలా చూసుకునేది? బాత్రూమే లేని ఊళ్ళో డ్రెస్సింగ్ టేబుల్ ఎలా వుంటుందిలే"

"ప్లీజ్ బిందూ, నన్నేం అన్నా ఫర్లేదు కానీ ఈ పెద్దవాళ్ళని మాత్రం ఏమీ అనకు"

"వాళ్ళు నీకు ఎంతో నాకూ అంతే. నేను వాళ్ళనేం అనను. కానీ... మరీ ఇంత..."

"ఏంటి?"

"నాకు పల్లెటూళ్ళ గురించి తెలుసు. మా అమ్మమ్మా వాళ్ళు, నాయనమ్మా వాళ్ళు వుండేదికూడా విలేజెస్‌లోనే. కానీ ఇంత వెనకబడిన, కనీస సౌకర్యాలయినా లేని ఊళ్ళు కూడా వుంటాయని నేనసలు ఊహించలేదు"

"మనం ఊహించని, మనకి తెలియని నిజాలెన్నో వుంటాయి"

"ఇంతకీ నన్ను చూసి ఎందుకు నవ్వావో చెప్పు"

"ఏంటా చీర కట్టుకోవడం?"

"ఏమైంది బాగుందిగా. ముందు కుదర్లేదుగానీ, తిరిగి మళ్ళీ కట్టుకుంటే చక్కగా వచ్చిందే"

"నీ ముఖంలా వుంది"

"అంత బాగానా?"

"జోక్కాదు. వసంత కోకిలలో శ్రీదేవిలా కట్టావు. తింగరబుచ్చి అంటే సరిపోయేట్లున్నావు"

"అయ్యో, బాగా కట్టుకున్నాను. ఇకపై నా ఫ్రెండ్స్‌కి కూడా అవసరమైతే నేనే కడదామని మురిసిపోతున్నానే. నిజంగా బాగో





లేదా? ఇప్పుడెలా? నాకు ఇంతకంటే బాగా కట్టుకోవడం వచ్చి చావదే"

"పొద్దున చక్కగా కట్టుకున్నావుగా. రోజూ జీన్స్, లాంగ్ స్కర్ట్స్, గాగ్రా చోళీల్లో చూసీ చూసీ ఉదయం చీరలో నిన్ను చూస్తే గొప్ప రిలీఫ్‌గా అన్పించింది. ముద్దొచ్చేట్లున్నావని కాంప్లిమెంట్ కూడా ఇచ్చినట్లున్నాను"

"పొద్దున్న మా అమ్మ కట్టింది"

"ఆవిడ కట్టేటప్పుడు నేర్చుకోకుండా దిక్కులు చూశావా లేక కళ్ళు మూసుకుని కలలు కన్నావా? "

"ఏదో ఒకటి చేశాను లేదా ఎగిరి గంతు లేశాను"

"వామ్మో అంతకోపం ఎందుకు? బుద్ధిలేక అన్నాను కొంచెం శాంతించు"

"శాంతించడం కాదు నిన్ను చితకబాదాలి"

"ఎందుకు? "

"నువ్వు రమ్మన్నావని వచ్చాను చూడూ అందుకు"

"వస్తే ఏమైంది? మహా అయితే కాస్త నడిచావు, ఆ మాత్రానికే నీ కాళ్ళు అరిగిపోయాయా? అసలు నడక ఆరోగ్యానికెంతో మంచిది. ఇక్కణ్ణించి వెళ్ళాక రోజూ ఉదయం, సాయంత్రం వాకింగ్ కెళ్ళు"

"నీ బోడి ఉచిత సలహాలు నేనడగలేదు"

"తెలీనివాళ్ళకి అడక్కపోయినా జ్ఞానులు ఇలాంటి హితబోధలు చేస్తుంటారు"

"నువ్వే అజ్ఞానివి. నోరు మెదిపావంటే చింతపల్లి గేట్ దగ్గరికి విసిరేస్తా, వచ్చినట్లు మళ్ళీ నడవాలి"

"అట్నుండి అటే బస్సెక్కావనుకో నువ్వొక్కదానివీ పొలాల్లోపడి నాలుగు మైళ్ళు నడిచి... పైగా పొలాలన్నీ ఒకలానే వుంటాయి. దారి తెలియక అటూ ఇటూ తిరిగి చింతపల్లి గేట్‌కి బదులు గోంగూర పల్లి అడ్డరోడ్డు చేరుకున్నావనుకో" అంటూ ఆటపట్టించాడు.

"ఏయ్, గోంగూరపల్లులు, పుదీనాపల్లులు కూడా వున్నాయా? "

"ఏమో, వుంటే వుండొచ్చుగా"

"నోర్మూసుకోగానీ, అయినా నీకో రూలూ, నాకో రూలూనా? "

"అదేంటి? నేనలా అన్లేదే"

"అన్లేదుగానీ, చేసి చూపిస్తున్నావుగా. అయినా నేనో ట్యూబ్‌లైట్ కాకపోతే అప్పుడే అడగాల్సింది ఇప్పుడు అడిగితే ఏమిటి లాభం"

"అబ్బ...దేని గురించి బిందూ? "

"నువ్వేమో ప్యాంటూ షర్టూ వేసుకోవచ్చు నేను మాత్రం వేసుకోకూడదా? "

"హైదరాబాదులో వున్నప్పుడైతే పర్లేదు. ఇది కుగ్రామం కనుక బాగోదన్నాను తప్పా? "

"అదే నేనడుగుతోంది కూడా. నీకు తప్పు కానిది నాకు తప్పవుతుందా? "

"మేం ప్యాంటూ షర్టూగాక మరేం వేసుకుంటాం? "

"పంచె ఎందుకు కట్టుకోలేదు? సాంప్రదాయంగా వుండేదిగా. నీకు లేని సంప్రదాయం నాకే వచ్చిందా? "

"అదీ ఇదీ ఒకటా? "

"ఎందుక్కాదు? జీన్స్‌లు, మిడ్డీలు మన కల్చర్ కాదు నిజమే. మీరేసుకునే టెర్లిన్ ప్యాంట్లు, షర్టులు కూడా మనవి కావు. అయినా ఆడపిల్లలనే సరికి అన్నిట్లోలాగే డ్రెస్సులమీద కూడా కామెంట్లు చేసి అణిచేయడానికి చూస్తారు"

"చచ్చానా దేవుడా ఉరుము ఉరిమి మంగలంమీద పడ్డట్లుంది. నీకు చీర కట్టుకోవడం చేతకాకపోయేసరికి నామీద అరుస్తున్నావా? "

"నాకసలు చీరకట్టుకోవడం ఎందుకు రావాలి? నేను ఆ డ్రెస్సులలోనే కంఫర్టబుల్‌గా ఫీలవుతాను కనుక అవే వేసుకుంటాను. చీరల గోల నాకెందుకు? లేనిపోని తద్దినాన్ని కొనితెచ్చుకున్నట్లుంది"

"అమ్మమ్మ, తాతయ్య వింటే బాగోదు, కస్సుబుస్సులాడకు, ప్లీజ్"



"మగవాళ్ళ నైజమే ఇంత. బతిమాలో, బెదిరించో మొత్తానికి తమకి కావల్సింది సాధించుకుంటారు"

"బెదిరించడమా? నిన్నా? అందులో నేను? ? ? " ప్రతి మాటా ఒత్తిఒత్తి పలికాడు.

"ఏదో ఒకటిలే. నువ్వు చెప్పిందానికల్లా గంగిరెద్దులా బుర్ర ఊపుతుంటాను. తీరా గోతిలో పడ్డాక విచారిస్తే లాభం ఏముంది? "

"చీటికి మాటికి దెప్పకు తల్లీ, నీకు పుణ్యముంటుంది. ముందే బాబ్‌కట్, దానికితోడు ప్యాంట్లు, టీ షర్టులు వేసుకుంటే మగరాయుడు అంటారేమో ఇక్కడివాళ్ళు అని ఏదో బుద్ధిలేని సలహా ఇచ్చాను చీరలే తెచ్చుకోమని"

"నీకెటూ బుద్ధిలేదు. ఆ మాటలు విన్నందుకు నన్ను నేనే చెప్పుతో కొట్టుకోవాలి"

"నీ చెప్పులు సరిపోకపోతే నావి కూడా వాడుకో నేనేం అనుకోను"

అతన్ని తిడదామని బోల్డన్ని తిట్లు పోగుచేసిందిగానీ ఆ తిట్ల బాణాలని ఎక్కుపెట్టేలోపు శారదమ్మ ఒక చిన్ని తాటాకు బుట్టలో నిండు గర్భిణీల్లా అందంగా, ఆరోగ్యంగా వున్న మల్లె మొగ్గల్ని, దారపు వుండని తెచ్చిచ్చి "ఇదిగో అమ్మడూ, ఈ పూవులు మాల కట్టుకుని పెట్టుకో తల్లీ" అంది ఎంతో ప్రేమగా.

"నాకా, పూవులా? " అంది ఆశ్చర్యంగా.

"అన్నట్లు నీకు జుట్టు లేదు కదా! ఆడపిల్లకి తలకట్టే అందాన్నిస్తుంది. ఏమైందమ్మా జుట్టు? తిరుపతి వెంకన్నకి మొక్కు తీర్చావా? "

"తిరుపతి... వెంకన్న..." బిందు ఒక పట్టాన మాట్లాడలేకపోయింది. పెద్దావిడ మీద పీకల్దాకా కోపం ముంచుకొచ్చింది. చక్కటి హెయిర్‌స్టయిల్‌ని పట్టుకుని అంత మాటంటుందా?

శ్రీహరి కల్పించుకుని "తను మొహమాటపడ్తోందిలే అమ్మమ్మా. నువ్వన్నట్లు తిరుపతి మొక్కే. అయిదారు నెలలైనట్లుంది, కాస్త ఎదిగింది" అన్నాడు సీరియస్‌గా ముఖంపెట్టి.

బిందు అతన్ని తన్నాలా, చంపాలా అన్నట్లు కొరకొరా చూసిందిగానీ ఆవిడ ముందు ఏమీ అనలేకపోయింది.

"దేవుడికి జుట్టు ఇస్తే మంచిదేలే అమ్మడూ. అన్నట్లు నీ పేరేంటో చెప్పనే లేదు"

"హిమబిందు"

"మంచి పేరు, బాగుంది. మాలకట్టడం వచ్చా? ఆడపిల్లకి రాకుండా ఎలా వుంటుందిలే? "

"రాదండీ"

"తనకి చీరకట్టుకోవడమే రాదు ఇక పూల మాలలు ఏం కడ్తుంది? " అని 'ఎలా కొట్టాను దెబ్బ' అన్నట్లు బిందువంక చూశాడు హరి.

"ఏదీ బ్రహ్మావిద్య కాదు. వంట పని పూర్తయ్యాక మాల నేనే కడ్తాను గానీ... ఏమ్మా చీర నన్ను కట్టమంటావా? " అనడిగింది శారదమ్మ.

బిందు బుంగమూతిపెట్టి కట్టమన్నట్లుగా తల ఆడించింది.

ఇద్దరూ గదిలోకి నడిచారు.



శారదమ్మ ముందు చీర విప్పాలంటే

బిందుకి సిగ్గుగా అన్పించి, బిగదీసుకుని వుండిపోయింది.

అది గమనించి "నేనూ నీకుమల్లే ఆడదా న్నేగా. నా ముందెందుకమ్మా సిగ్గు? రేపు మొగుడిముందు సిగ్గుపడుదువుగానిలే" అంది శారదమ్మ.

బిందు మెల్లగా నవ్వి, తప్పేట్లు లేదు లెమ్మని సిగ్గుని చింతల్లో తొక్కి ఒళ్ళు అప్ప గించింది. ఒక తీరూ తెన్నూ లేకుండా కట్టిన చీరని తనే విప్పదీసి, ఓపిగ్గా, పొందిగ్గా మళ్ళీ కట్టింది శారదమ్మ.

"కుందనపు బొమ్మలా వున్నావు. నా దిష్టే తగిలేట్టుంది" అని మెటికలు విరిచి "ఏ వేళ ప్పుడు తిన్నారో ఏమో వంట త్వరగా చేసే స్తాను పెందలాడే తిందురుగాని" అంటూ వంటకోసం ప్రత్యేకంగా కట్టిన చుట్టింట్లోకి వెళ్ళింది శారధమ్మ.

బిందు ముందు వసారాలోకి వచ్చింది. అక్కడో పెద్ద బల్ల వుంది. శ్రీహరి దాని మీద దర్జాగా పడుకుని ఒక కాలిని సగానికి మడిచి, రెండో కాలు అడ్డంగా పెట్టేందుకు మడిచిన కాలిని సపోర్టుగా వాడుకున్నాడు.

ఈసారి బిందు ఎంతో అందంగా అప్సర సలా వుంది. ఆమె నడిచొస్తోంటే ప్రశంసా పూర్వకంగా చూశాడు.

"ఆహా ఏం దర్పం, ఏం ఠీవి? " అంది బిందు.

"మాదేముందిలే, మీరంటే మహారాణి గాని" అన్నాడు.

"ఒక్కటిచ్చానంటే ఒంగోల్లో వెళ్ళి పడ్తావు"

"మహారాణితో పోల్చినా నేరమేనా? "

"పోల్చావులే పొట్లకాయపచ్చడి. నన్ను పట్టుకుని తిరుపతి మొక్కని చెప్తావా? "

"అమ్మమ్మకోసం ఏదో తమాషాకి చెప్పాలే"

"చెప్తావు చెప్తావు, అంతా నీ ఇష్టమేనా? నన్నూ, నా హెయిర్ స్టయిల్ని ఎంతో మెచ్చుకుని, లేడీడయానాలా వుంటానని చెప్పిన రోజులు మర్చిపోయావు కదూ"

"అదే నిజం. ఇది ఉత్తినే చెప్పిన మాట బిందూ"

"సరే. దీనికి ఇంతకింత కసి తీర్చుకోక పోతే చూడు"

"ఏం చేస్తావు? "

"మా అమ్మమ్మగానీ, నాయనమ్మగానీ ఊర్నుండి వచ్చినపుడు నిన్ను మా ఇంటికి తీసికెళ్ళి..."

"ఊ తీసికెళ్ళి.." నవ్వుతూ రెట్టించాడు.

"బుడబుక్కలవాడని చెప్పకపోతే చూడు"

"ఛీ నీచురాలా. బుడ బుక్కలవాడు, అడు క్కుతినే వాడు అంటూ మరీ అంత హీనంగా పరిచయం చేస్తావా? "

"కసి ఎప్పుడూ ఎక్కువ స్థాయిలోనే వుంటుంది"

"సర్లే పెళ్ళయ్యాక నన్ను మళ్ళీ చూడరా? అప్పుడు నీ పరువేపోతుంది. అదేంటమ్మాయి, పోయిపోయి బుడబుక్క లోణ్ణి చేసుకున్నావే? అంతకంటే మనింట్లో పాలేరుని చేసుకోకపోయావా అంటేగానీ నీ రోగం వదల్దు"

"నన్నేమన్నా పర్లేదు, నిన్నయితే అవమా నించి తీర్తాను"

"చూడు అమ్మడూ..."

"నా పేరు అమ్మడూ కాదు"

"అమ్మమ్మ పిలిస్తే లేని అభ్యంతరం నేను పిలిస్తే వచ్చిందా? "

"పెద్దావిడ పిలిస్తే నువ్వు పిలుస్తావా? "

"పిలవన్లేగానీ, ఎవరైనా శపథం చేస్తే 'పేదరికం పోయేట్లు చేస్తాను, అంటరాని తనంలేకుండా చూస్తాను' అంటూ చేస్తారు గానీ నీలాగా అవమానిస్తాను, గోతిలో తోస్తాను అంటూ శపథాలు చేయరు"

"ముల్లు గుచ్చుకుంటే సూదితో తీసిపడే స్తారుగానీ పూవుల్తో సవరదీస్తూ కూర్చోరు"

"నీ కోపతాపాలు ఇక చాలుగానీ కాస్త ఛీర్‌ఫుల్‌గా వుండు. ఈ చీరలో భలే బాగు న్నావు"

"నువ్వు చెప్పకపోయినా ఆ సంగతి నాకు తెల్సు"

"ఇంత హాట్‌గా వుంటే ఎలా తిరపతీ? "

"స్థంభానికి కట్టేసి బాదుతాను జాగ్రత్త"

అంతలో వీరయ్య లోనికొచ్చాడు. ఆయన్ని చూసి బిందు చుట్టింట్లోకి దారితీసింది.

"ఏం తాతయ్యా, బాగున్నావా? " అంటూ పలకరించాడు హరి.

"బాగున్నానుగానీ, ఎంత సేపైందిరా వచ్చి? " అన్నాడు వీరయ్య.

"చాలా సేపైంది. స్నానం చేసి కూర్చున్నాను"

"అమ్మావాళ్ళంతా బాగున్నారా? "

"అంతా బాగున్నారు. ముందు స్నానం చేసిరా, తీరిగ్గా మాట్లాడుకుందాం"

ఆయన స్నానంచేసేందుకు వెళ్ళాడు.

"మామ్మగారూ, నేనేమైనా సహాయం చేయనా? " అనడిగింది బిందు.

"వద్దులేమ్మా, నువ్వెళ్ళి కూర్చో"

"పెద్దవాళ్ళు మీరు కష్టపడ్తోంటే నేనేమో కూర్చోవాలా? "

"ఇందులో కష్టమేముంది? అలవాటైన పనులేగా"

"అలవాటైతే కష్టాలు కూడా సుఖాలవుతాయా? "

"వడ్లు, మిరపకాయలు దంచిన చేతులకి వంటో లెక్కాచెప్పు? అన్నట్లు నీకు వంట చేతనవుతుందా? "

"వచ్చుండీ"

"ఏమేం చేస్తావేం? "

"నూడిల్స్ చేస్తాను..."

"అవేంటి? దొరల వంటకమా? "

"ఛీ... దొరలు అనకూడదు మామ్మా. వాళ్ళు మనకి దొరలేంటి వాళ్ళ బొంద? "

"ఇంగిలీసోళ్ళని అలాగే అంటాంగా"

"తప్పు. తెలీక అంటే అన్నారు, ఇకపై అనకండి. బ్రిటిషర్స్ అనాలి"

"ఏమో, నా నోటికి తిరగదులేగానీ ఇంకేం వచ్చు? "

"టీ పెట్టగలను"

"పాలు కాయగలదు, నీళ్ల గ్లాసులో పోయగలదు" అంటూ పూరించి వెక్కిరించాడు హరి ఎప్పుడొచ్చాడోగాని.

"గొప్పేలే, నీకు అవి కూడా రావుగా"

"నాకు వచ్చోరాదో నువ్వే చూద్దువుగాని" అంటూ గుమ్మంలోంచి ఒక్క అంగలో లోనికొచ్చాడు.

"మేమిద్దరం ఏదో మాట్లాడుకుంటోంటే, మధ్యలో నువ్వెందుకు ప్రైవసీ లేకుండా"

"ముందొచ్చిన చెవులకంటే వెనకొచ్చిన కొమ్ములు వాడి అని ఒక సామెత వుందిలే"

"అంటే అమ్మమ్మకంటే నువ్వు ముందు పుట్టావా? కొంతమంది యువకులూ పుట్టుకతో వృద్ధులు అని ఒక పాటుంది. అది నీలాంటివాళ్ళని ఉద్దేశించే రాసి వుంటారు"

"అది పాట కాదమ్మడూ, శ్రీశ్రీ అని... పేరు కూడా వినుండవులే"

"వినకపోవడమేం ఖర్మ, టెంత్ సిలబస్‌లో ఆయన పొయెట్రీ వుండేది. నీకు తెల్సోలేదో, పూర్తిపేరు శ్రీరంగం శ్రీనివాసరావు"

"అమ్మో ఇంత నాలెడ్జ్‌వుందా? ఏదో కాపీ కొట్టి పాసయిన బాపతు అనుకున్నాను"

"అమ్మడ్ని ఏడ్పించకురా హరీ"

"అతని మాటలకి నేనెందుకు ఏడుస్తాను మామ్మా? మా స్కూల్లో నేనే ఫస్టొచ్చాను"

"అందరికి తెల్సినవీ నువ్వు ఎక్కించేసుకుని వుంటావులే. తక్కిన వాళ్ళు తమకి తెల్సినంతవరకే నిజాయితీగా రాసి వుంటారు"

"చూడు మామ్మా"

"చూస్తూనే వుందిగా, ఇంకేం చూడాలి? "

"తప్పురా హరీ, అమ్మడ్ని ఏడ్పించకు"

"మీరు అమ్మడు అనకండి మామ్మగారూ, తను కూడా అలాగే పిలిచి వెక్కిరిస్తున్నాడు"

"ఏం పర్లేదు, అలాగే పిలువు అమ్మమ్మా,





అదే బాగుంది"

"నీ వరస నాకేం నచ్చలేదురా హరీ"

"ఈ పూట వంకాయ వేపుడు చేస్తావా? " అనడిగాడు హరి అక్కడున్న వంకాయల్ని చూసి.

"చేద్దామనే కోసుకొచ్చాను"

"మనింట్లో కాశాయా? అందుకేనా ఇంత నేవళంగా వున్నాయి? "

"నేవళం అంటే? " అడిగింది బిందు.

"చూశావా అమ్మమ్మా అది కూడా తెలీదు. ఇందాకే చెప్పానుగా తెలుగు సరిగ్గా రాదని"

"ఊరుకోరా భడవా. నేవళం అంటే తాజాగా అనమ్మాయి"

"తాజా అంటే ఇదేంటి కూజాలా అనుకో గలదు. ఫ్రెష్ అన్నమాట, ఇప్పుడర్థ మైందా? "

"బుద్ధిలేక అడిగా, ఇంకోసారి నిన్నేం అడ గను"

శ్రీహరి బుట్టలో వున్న వంకాయల్ని బిందెలో వున్న నీళ్లతో రెండుసార్లు కడుక్కొ చ్చాడు.

"మామ్మా, వంటింట్లో సింక్ లేకపోతే కష్టంగా లేదూ? ఏం కడగాలన్నా బయటి కెళ్ళాల్సిందేనా? "

"అన్నిసార్లు అటూ ఇటూ తిరిగినందునే అమ్మమ్మ ఈ వయసులో కూడా ఇంత చలాకీగా వుంది"

బిందు 'పోవోయ్' అన్నట్లు చూసింది హరి వంక.

"అమ్మమ్మా, ఉప్పెక్కడ? పసుపెక్కడ? "

శారదమ్మ రెండు డబ్బాలూ అందిం చింది.

హరి నీళ్ళలో ఉప్పు, పసుపు వేసి తిప్పి, వంకాయలు చకచకా తరిగి అందులో పడే యసాగాడు.

వంకాయలు కంద్ర రాకుండా ఈ రకంగా కోస్తారని తన తల్లి దగ్గర నేర్చుకున్న రహస్యం ఇతడికెలా తెలుసబ్బా అనుకుని ఆగలేక "ఏయ్, వంకాయలు ఇలా తరుగు తారని నీకెలా తెల్సు? నేనే మాటల్లో ఎప్పుడో చెప్పి వుంటాను కదూ" అనేసింది బిందు.

శ్రీహరి పెద్దగా నవ్వి "అవునవును, ఊపిరి పీల్చడం కూడా నీ దగ్గరే నేర్చుకు న్నాను" అన్నాడు.

"నెమ్మదిగా కోయరా హరీ, చేయి తెగు తుంది జాగ్రత్త" అంది శారదమ్మ.

"ఏం తెగదులే అమ్మమ్మా"

"కొంచెం తెగినా పర్లేదులే మామ్మా. బాగా ప్రాక్టీసైతే పెళ్ళాన్ని సుఖపెట్టగల్గు తాడు"

"ఏంటి? ! అయితే నువ్వో వంటవాణ్ణి చేసుకో"

"చూసిపెట్టు, చేసుకుంటాను"

"మీ దుంపతెగ, ఎప్పుడూ వాదులాడుకుం టూనే వుంటారంటరా? !"

"నువ్వో పనిచేయి అమ్మమ్మా. ఈ అమ్మా యిని కొన్నాళ్ళు నీ దగ్గర వుంచుకుని ఆడ పిల్ల లక్షణాలు నేర్పు"

"ఆడపిల్ల లక్షణాలా? "

"అవును, మగవాళ్లంటే భయపడటం, సిగ్గుపడటం, వంట చేయడం... ముఖ్యంగా తిరుపతిలో ఇచ్చిన జుట్టుని పెంచుకోవడం"

"చూడు అమ్మమ్మా"

"తిరుపతి వెంకన్నమీద కూడా చతు ర్లట్రా? కళ్లు పోతాయి ఊరుకో"

"అలా చెప్పు అమ్మమ్మా. ఆ కళ్ళు పోతే గానీ బాగుండదు, అమావాస్య చంద్రుడులో కమల్‌హాసన్లా"

"పోయి పోయి ఒక బ్లైండ్ క్యారెక్టర్‌తో పోలుస్తావా? అయితే నువ్వేలా వున్నావో తెలుసా? 'నీకూ నాకూ పిచ్చి' సినిమాలో నూతన్‌లాగా వున్నావు"

"ఆ మూవీ ఎప్పుడొచ్చింది? "

"ఇంకా రాలేదు, రాబోయే సినిమా? "

"ఏంటీ? "

"అవును. అందులో ఆ హీరోయిన్‌కి కళ్లూ, కాళ్ళూ వుండవు. మూగా, చెవిటీ కూడా. ఇంకా..."

"వద్దు మహాప్రభూ"

కొత్తిమీర గిల్లుకొచ్చేందుకు శారదమ్మ పెరట్లో కెళ్ళింది.

"నిన్ను చూస్తే నాకు కంపరంగా వుంది. నేను ఇక్కణ్ణించి వాకౌట్ చేస్తున్నాను" అని బయటివరకూ వచ్చిన బిందు గబుక్కున మళ్ళీ వంటింట్లోకి వచ్చింది.

"ఏమైంది, వాక్ బ్యాక్ చేశావు?"

"మీ తాతగారికి నా గురించి ఏంచెప్పావు? ఆయనేం అడుగుతారో ఏమో భయంగా వుంది. అనవసరంగా నీతో వచ్చి లేనిపోని చిక్కులు తెచ్చుకున్నాను. హైదరాబాదు వెళ్ళాక హిందీ, ఉర్దూల్లో వున్న తిట్లన్నీ నేర్చుకుని నిన్ను తిట్టకపోతే చూడు"

"ఏంపర్లేదు, నీ దగ్గరికొచ్చేప్పుడు చెవుల్లో కాటనో, వాక్‌మనో పెట్టుకుని వస్తాను. ఏంతిట్టినా నాకు వినపడదు. పైగా సౌండ్ లెస్ లిప్ మూమెంట్‌ని భలే ఎంజాయ్ చేయొచ్చు"

"నేనేమంత తెలివితక్కువ దాన్ని కాను, నీ చెవుల్లో లౌడ్‌స్పీకర్ పెట్టి మరీ తిడ్తాను"

అంతలో శారదమ్మ తీసుకొచ్చిన కొత్తిమీర చూసేసరికి బిందూ కోపం మాయమైంది.

"మామ్మగారూ, దీన్ని కూడా పెంచుతున్నారా?" అంది.

"అదేదో పాముని పెంచుతున్నారా అన్నట్లు అంత ఆశ్చర్యం ఎందుకు? ధనియపు గింజలు జల్లితే కొత్తిమీర మొక్కలొస్తాయి తెలుసా?" అన్నాడు హరి.

ఒక కొత్త విషయం తెలుసుకున్నట్లు తల పంకించింది బిందు.

"మామ్మగారూ, మా అమ్మ కొత్తిమీరతో పచ్చడి చేస్తుంది, ఎంత రుచిగా వుంటుందో చెప్పలేను" అంది.

"మీ అమ్మంత బాగా చేయగల్నో లేదో గానీ నేను కూడా చేసి పెడ్తాలే" అంది.

"అన్నట్లు చీకటి పడ్తోంది, లైట్ వేయకూడదూ?"

"మనింట్లో కరెంటు లేదమ్మా"

"అదేంటి?"

"ఈ ఊళ్ళో ఇద్దరికి తప్ప మరెవరికీ లేదు"

"ఎందుకని?"

"ఏమో తీసుకోలేదు. మీ తాతయ్యని రెండుమూడుసార్లు అడిగాను, మనమూ తీసుకుందామని. అంత అవసరం మనకేముంది లెమ్మన్నాడు. ఇక నేనూ ఊరుకున్నాను. ఈ జీవితాలు ఇలా గడిచిపోనీ" అంటూనే రెండు చిమ్నీలు తెచ్చి ఆ గ్లాసులకి పట్టిన మసిని ముగ్గుతో తుడిచింది. అవి తెల్లగా మారిపోయాయి.

రెండు దీపాలూ వెలిగించి ఒకటి వంటింట్లో వుంచి, రెండోదాన్ని ముందుగదిలోకి తీసికెళ్ళి పెట్టింది శారదమ్మ.

బిందూ ఆశ్చర్యానికి అంతులేదు.

★ ★ ★

మామ్మగారు తనకెలాగూ పనులు చెప్పడంలేదని వంటింట్లో నుండి బయటికొచ్చింది బిందు. ఇంటిచుట్టూ ఖాళీస్థలం బాగా వుంది. నడిచే ప్రదేశమంతా కళ్ళాపి జల్లి, ముగ్గులు పెట్టి వున్నాయి. ముందు వైపు నాలుగు కొబ్బరిచెట్లు, జామ, సపోటా, మామిడిలాంటి అనేకరకాల చెట్లు వున్నాయి. ఇక వెనకవైపు కూరగాయల మొక్కలు, సొర, బీర, చిక్కుడులాంటి పాదులకి పందిళ్ళు వున్నాయి. అక్కడే ఒకపక్కన కొన్ని మల్లెకుదుళ్ళు, కనకాంబరం, చేమంతి మొదలయిన మొక్కలు, మరువం, దవనం వున్నాయి.

బిందు వాటిని తదేకంగా చూస్తోంటే "చూశావా కిచెన్ గార్డెన్? వీళ్ళు దాదాపు ఏమీ కొననవసరంలేదు" అన్నాడు హరి వచ్చి పక్కగా నిలబడి.

"అన్నిరకాల కూరలూ లేవుగా. వున్నవా





టినే మళ్ళీ మళ్ళీ వండుకుంటే విసుగు పుట్టదూ? " అంది.

"అమ్మమ్మా వాళ్ళు కాసినవన్నీ తినరుగా. ఇరుగూపొరుగూ వాళ్ళకి ఇస్తారు. వాళ్ళు కూడా వాళ్ళ ఇళ్లలో, పొలాల్లో కాసినవి వీళ్ళకిస్తారు"

"ఓ... ఇచ్చి పుచ్చుకుంటారన్నమాట"

"ఆ పద్ధతివల్ల అటు ప్రేమాభిమానాలు వున్నట్లు రుజువవుతుంది. ఇటు వెరైటీ కూడా వుంటుంది"

"బాగుంది"

"అదే సిటీలో అయితే ప్రతిదీ కొనుక్కోవాల్సిందే. అంతెందుకు ఆఖరికి సంక్రాంతికి గొబ్బెమ్మలు పెట్టాలని ముచ్చటపడితే పేడయినా కొనుక్కోవాల్సిందేగా"

"ఏదీ కొనుక్కోకుండా ఇక్కడే వుండిపో" అంది బిందు.

"నేను వుండిపోతే నువ్వేమైపోతావు? "

"ఏమౌతాను, హాయిగా వుంటాను. ఈసారైనా తొందరపాటు లేకుండా ఒక బుద్ధిమంతుణ్ణి సెలక్ట్ చేసుకుంటాను"

"నాకేమైంది? "

"నీకా నట్టు లూజు కదా"

"అవునా? టైట్ చేయించుకునేందుకు వెళ్తున్నాగానీ నువ్వొక్కదానివి ఇక్కడే వుండు" అని చకచకా ముందు వసారావైపు అడుగులేశాడు.

బిందు అతన్ని అనుసరించి వచ్చి "ఈ పెద్దాయన ఎక్కడున్నారో" అనుకుంటూ నీవడీలా చూసింది. ఆయన అక్కడ లేరు. ఎవరో పెద్దమనిషితో పిచ్చాపాటీ మాట్లాడ్తూ వీధి అరుగుమీద కూర్చున్నారు.

"అవును హరీ, మీ తాతయ్యకి నువ్వయినా చెప్పొచ్చుగా, ఎలక్ట్రిసిటీ కనెక్షన్ తీసుకోమని. అసలు వీళ్ళెలా వుండగల్గుతున్నారు? "

"నేను చెప్తే వింటాడా? 'గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్లు నాకు చెప్తావట్రా' అని వాయిస్తాడు. ఆయన గురించి నీకేం తెలుసనుకున్నావు, హిట్లరనుకో" అంటూ ఎంతో మెల్లగా వుండే ఆయన గురించి కఠినంగా చిత్రించి చెప్పాడు.

"గాడిదగుడ్డు. నాకు చనువూ, చొరవా లేవుగానీ లేకుంటే నేనే చెప్పొచ్చు"

"ఏం చెప్తావు? "

"చాలా చెప్పాలి" అంటూ ఇందాక శారదమ్మ అక్కడ వుంచిన మల్లెపూలమీదికి దృష్టి మళ్ళించింది.

"ఈ గిన్నె భలేవుంది హరీ, తాటాకులతో ఎంత గమ్మత్తుగా అల్లారు? "

"దాన్ని గిన్నె అనరమ్మా తల్లీ"

"అమ్మా అన్నా తల్లీ అన్నా ఒకటేగానీ కాబోయే వైఫ్‌ని పట్టుకుని అలా పిలుస్తావా? బుద్ధిలేదూ? "

"నేనెక్కడ పట్టుకున్నాను, ఇంత దూరంగా వుంటే"

"నలకంత నవ్వు కూడా రాలేదుగానీ, ఇంతకీ ఏమంటారు? "

"బుల్లి బుట్ట అంటారు"

"ఇది మామ్మగారు నాకు ఇస్తారేమో అడుగుతాను" ఇలాంటివి శిల్పారామంలో అమ్మే మాటుంటే ఎంత ఖరీదైనా కొనుక్కుంటారు. ఇప్పుడు హ్యాండీక్రాఫ్ట్స్‌కి డిమాండ్ ఎక్కువైంది"

"సర్లేగానీ, ఆ మల్లెపూలు తల్లో పెట్టుకో కూడదూ? "

"బాయ్‌కట్ చేయించుకుని పూలు పెట్టుకుంటే అమెరికన్ బెగ్గర్లా వుంటాను"

"ఏం వుండవులే, జస్ట్ తిరుపతి వెళ్ళొచ్చినట్లుంటావు"

"ఇంకోసారి తిరుపతి అంటే తన్నులు తప్పవబ్బాయ్"

"అనన్లేగానీ పూలు పెట్టుకోవా ప్లీజ్"

"బాగోదని చెప్తే విన్పించుకోవేంటి? స్టుపిడ్లా పెట్టుకో పెట్టుకో అంటావు"

"నీకో సంగతి చెప్పనా? మా హిస్టరీ లెక్చరర్ ఒకాయన ఒకసారి ఇలా చెప్పారు.

ఆయనకి రోజూ షేవ్ చేసుకోవాలంటే బద్ధకమట. ఒకసారి వేరే ఊరు వెళ్తూ కూడా షేవ్ చేసుకోకపోయేసరికి వాళ్ళ అమ్మగారు "అదేంటి గడ్డం గీసుకోలేదేం? " అనడిగారట. అందుకాయన "ఆ ఊళ్లో నాకు తెల్సినవాళ్లు ఎవరూ లేరు. నా గడ్డం గురించి వాళ్ళేం అనుకుంటే మాత్రం నాకేం అవుతుంది? " అన్నారట. సరే ఊర్నుండి తిరిగొచ్చాక కూడా షేవ్ చేసుకోకుండానే కాలేజీకి బయల్దేరుతోంటే "ఆ ఊళ్ళో ఎవరూ తెలీదన్నావుసరే, ఇప్పుడైనా చేసుకోకపోతే ఎలా? " అన్నారట.

అందుకాయన "ఇక్కడందరూ తెలిసినవాళ్లేగా. వాళ్లు నా గురించి ఏమీ అనుకోరు" అని ఉంటారు. అంతేనా? " అంది బిందు తనే పూర్తిచేస్తూ.

"అరే నీకెలా తెల్సు? "

"ఊహించా"

"కనుక ఇక్కడ నీకెవరూ తెలీదుగా, నీ గ్లామరేం పోదుగానీ పూలు పెట్టుకో"

"నువ్వు తెల్సుగా"

"నేనే పెట్టుకోమంటున్నానుగా. నాకు నిన్నలా చూడాలని ఉంది బిందూ"

"నీ కోరిక తీరుస్తాగానీ మరి మీ తాతయ్యతో..."

"నాలుగురోజుల్లో మనం ఎటూ వెళ్లిపోతాం. నువ్వు మళ్లీ ఈ ఊరే రానన్నావు. కరెంటు గోల నీకెందుకూ? "

"నేన్నీ అంత సెల్ఫిష్ కాదు. అమ్మమ్మ నాకు బాగా నచ్చింది. ఆవిడకీ వయసులో ఎంత కష్టం లైటింగ్ లేకుండా చీకటిలో తిరగాలంటే"

"సరే మాట్లాడతాను"

"ఒప్పించి తీరాలి"

"అది నా చేతిలో ఉందా? "

"ఆమాత్రం ఒప్పించలేవా? ఆయన్నేం స్పేస్‌లోకి వెళ్లమనడం లేదు. ఆఫ్టరాల్ ఎలక్ట్రిసిటీ..."

"ఒప్పిస్తాలేగానీ రెండు పూలు ఇవ్వు, వాసన్చూసుకుంటాను"

బిందు అతని చెవుల వెనుక మల్లెపూలు ఉంచింది.

"నా చెవులో మల్లెపూలు పెడతావా? నీ పని చెప్తానుండు"

"నాపని చెప్పడం తర్వాతగానీ అసలీ పెద్దవాళ్లిద్దర్నీ ఇలా ఈ పిచ్చూళ్లో ఉంచేయడం ఏమైనా బాగుందా? "

"ఏంచేస్తాం? తాతయ్యకి మగపిల్లలు పుట్టలేదుగా!"

"అయితేనేం, నలుగురాడపిల్లలు పుట్టారుగా"

"ఆడపిల్లల ఇళ్లల్లో పెద్దవాళ్లుంటారేమిటీ? "

"ఎందుకుండరూ? కొడుకుల ఇళ్లల్లోనే ఉండాలని ఇండియన్ పీనల్ కోడ్‌లో రాసుందా? "

"రాసి ఉన్నా లేకున్నా అలానే జరుగుతోందిగా"

"మన ఆలోచనల్లో మార్పు రానంతవరకూ ఆచారాల్లోనూ మార్పు రాదు. ఇంత అభివృద్ధి సాధించాం అనుకుంటున్న ఈ రోజుల్లో కూడా ఇదిలా లేదుగా, అదలా ఉందిగా అనడం ఎంత సిల్లీగా ఉంటుంది హరీ? "

"లెక్చర్లు మాత్రం తెగ దంచుతావు. మా అమ్మమ్మలాగా వడ్లు దంచు చూద్దాం"

"నిన్ను రోట్లో పడేసి దంచుతాను జాగ్రత్త. రైస్‌మిల్ లేని కాలంలో ఆ జెనరేషన్‌వాళ్లు ఆ పనులన్నీ చేశారు నిజమే. కానీ మిక్సీలు, గ్రైండర్లు వచ్చిన ఈ కాలంలో ఆ పనులు చేయలేకపోవడం చేతగానితనమా? "

"ఊరికే అన్నాలే"

"డబ్బులివ్వాల్సిన పనిలేదు కనుకనే ఎవరైనా ఇలాంటి పిచ్చివాగుడు వాగేది"

"ఇలాంటి ఐడియాలివ్వకు బిందూ. రేపు ప్రతి మాటకీ టాక్స్ కట్టాలనే రూలు పెట్టినా పెడతారు"





"నువ్వేమైనా అనుకో, ఎంత కోపమైనా తెచ్చుకో. నేనోమాట అని తీర్తాను"

"నాక్కోపం వస్తే నువ్వు ఖాతరు చేస్తావా ఏంటిలేగానీ ఇంతకీ అదేంటో చెప్పు"

"మీ అమ్మకి, పిన్నికి, పెద్దమ్మలిద్దరికీ కూడా బుద్ధీ, జ్ఞానం అనేది ఏకోశానా లేదు"

"అదేంటంతమాటన్నావు. పాపం వాళ్లేం చేశారు? "

"ఇంతకంటే ఇంకేం చేయాలి? ఈ ముసలితనంలో అమ్మానాన్నల్ని గాలికొదిలేసి, హాయిగా వాళ్ల మానాన వాళ్లు బతుకుతున్నారు"

"కేవలం వాళ్లిష్టమే ఉంటుందా బిందూ, పెళ్లయ్యాక భర్తల ఇష్టప్రకారం నడుచుకోవాల్సిందేకదా!"

"అంటే రేపు పెళ్లయ్యాక నేను తుమ్మాల్సి వచ్చినా నీ పర్మిషన్ తీసుకుని తుమ్మాలన్న మాట"

"బోడిగుండు, మోకాలూ ఒకటేనంటావేం"

"నేనేం అనలేదు. అయినా నీలాంటివాళ్లకి బోడిగుండులో వుండాల్సిన బ్రెయిన్‌లాంటిది మోకాల్లోనే వుంటుందిగా"

"స్టేలైపోయి, చిరిగి పీలికలైపోయిన జోకు"

"ఇదిగో నీకు ఇదివర్లోనే చెప్పాను, ఇంకోసారి కూడా చెప్తున్నాను. నా మట్టుకు నేను పెళ్ళికిముందు, తర్వాత అంటూ మారేది లేదు. నా ఇండివిడ్యుయాలిటీని తినడానికి చూడకు"

"నేనేదో తిండి తింటానుగానీ ఇండాలియమ్‌లూ ఇండివిడ్యుయాల్టీలూ తినను"

"సంతోషించాలే. అయినా వాళ్ళు పెంచి పోషిస్తే పెరిగినవాళ్ళేగదా. పెద్దతనంలో వాళ్ళని చూడాల్సిన బాధ్యత తమదే అనుకోనక్కర్లేదా? అందుకు ఒకవేళ భర్తలు ఒప్పుకోకపోతే అలాంటి భర్తల్ని వుంచుకునే బదులు వదిలేసుకోవడం బెటరు. కనిపెంచిన వాళ్ళకంటే ఎవరూ ఎక్కువ కారు"

"ష్... బిందూ, నాతో అంటే అన్నావు గానీ ఇలా ఇంకెప్పుడూ, ఎవరిముందూ అనకు"

"అంటే ఏమవుతుంది? వాళ్ళే సిగ్గుతో తలొంచుకుంటారు"

"అలా కలలు కనకు. మనదేశంలో ముఖ్యంగా మనరాష్ట్రంలో 98% భర్త చాటు పెళ్ళాలే వుంటారు. వాళ్ళకి భర్త కంటే తల్లిదండ్రులు ఎక్కువ కారు సరిగదా. ఆఖరికి దేవుడు కూడా ఎక్కువ కాదు"

"అవున్లే పతియే ప్రత్యక్ష దైవం అనుకుంటారుగా"

"తెల్సుగా అలాంటి భార్యలుగానీ, వారి యొక్క భర్తలుకానీ అమ్మానాన్నలకోసం అవసరమైతే భర్తని వదిలేయొచ్చు అనే మాట వింటే మూకుమ్మడిగా వచ్చి నీ అంతుచూస్తాం అంటారు"

"ఇతర్లెలా ఏడిస్తే మనకెందుగ్గానీ మనకి సంబంధించిన వాళ్లనయినా మనం సక్రమంగా వుండేట్లు చూసుకోవాలిగా హరీ"

"ఇప్పుడేం చేద్దామంటావు? "

"మీ పెద్దమ్మ, పిన్నిలని కూడా వదిలేద్దాం. కానీ మీ అమ్మవరకూ మన మనిషేగా"

హరి మౌనంగా చూశాడు.

"ఆంటీకి ఫోన్ చేసి ఇప్పుడే క్లాస్ తీసుకోవాలన్పిస్తోంది"

"అమ్మకి క్లాస్ తీసుకుంటావా? "

"తప్పేంలేదు. రేపు నేనేదైనా తప్పుచేస్తే నా పిల్లలు చేప్తే నేనేం అపార్థం చేసుకోను, కరక్ట్ చేసుకుంటానే తప్ప"

ఇంతలో శారదమ్మ అక్కడికొచ్చింది.

"ఏమర్రా, వంట ఐపోయింది, భోజనాలు చేస్తారా? " అనడిగింది ఆప్యాయంగా.

"ఇప్పుడేనా మామ్మగారూ? ఏడుగంటలే అయింది. మేం రోజూ పదిన్నరకి భోంచేస్తాం"

"పదిన్నరకే? ! ఆ టయానికి మేం ఓ కునుకు తీస్తాం అమ్మా. ఎంతైనా పల్లెల్లో

వాళ్లంగా"

"నాకైతే ఆకలి కరకరలాడ్తోంది అమ్మమ్మా. ఆ పిల్ల అలాగే అంటుందిలే గానీ పెడ్తే బాగానే లాగిస్తుందిలే తిందాం పద" అన్నాడు.

పెద్దావిడ చూడకుండా వెక్కిరించింది బిందు.

"త్వరగా రా, వేడివేడిగా తినొచ్చు"

బిందు వాళ్ళిద్దర్నీ అనుసరించింది.

"తాతయ్యని కూడా పిల్చేదా అమ్మమ్మా?"

"ఆయన్ని బొట్టుపెట్టి పిలవాలేం? కడుపులో ఎలుకల చప్పుడు కాగానే ఆయనే లేచొస్తాడు. అందాకా వాళ్ళ కబుర్లకి అంతూ దరీ వుండదు"

ముగ్గురూ వంటింట్లోకెళ్ళారు.

హరి చకచకా మూడు పీటలు పరిచాడు.

అప్పటికే కడిగిన పళ్ళేలు, నీళ్ళతో నింపిన గ్లాసులు పెట్టి వున్నాయి.

పొగలు కక్కుతోన్న అన్నాన్ని రెండు పళ్ళేల్లో వడ్డించింది.

"నువ్వు తినవా అమ్మమ్మా?"

"తాతయ్యక్కూడా పెట్టాక తింటాను"

"ఇప్పటి వరకూ ఇలాంటి పతిభక్తిని తిట్టిపోసింది. ఇప్పుడు నీమీద దాడి చేయగలదు జాగ్రత్త. కొంతకాలంగా ఫెమినిజం అంటూ ఒకటి వ్యాప్తిలో కొచ్చిందిలే. దాని ప్రభావం ఇదంతా"

"అంటే ఏమిట్రా?" అందావిడ నవ్వుతూ.

"ఏముంది అరటికాయ తొక్క"

బిందు గుర్రుగా చూసింది.

శారదమ్మ నవ్వుతూ చూసింది.

"అంటే ఏంలేదు, అరటి తొక్కమీద కాలేస్తే ఎలా జారిపడ్తామో, ఫెమినిస్టుల్తో వాదనేసుకుంటే అలాగే ఢాంమని పడిపోతాం"

ఆ క్షణంలో బిందుకి అతని నెత్తిమీద ఠాంగ్‌మని ఒక్కటిచ్చుకోవాలన్పించినా ఎలాగో కంట్రోల్ చేసుకుంది.

"మీ మనవడికేదో తెలుసనుకుని ఏమీ అడక్కండి మామ్మగారూ. ఏమీ తెలీకపోయిన అన్నీ తెలిసినట్లు ఫోజుకొడ్తూ మిస్‌లీడ్ చేస్తాడు. పాతాళం ఎక్కడంటే పైకి చూపిచ్చేరకం"

"పోనీ నువ్వు చెప్పు అమ్మాయి. ఇందాక ఏదో ప్రభావం నామీద వుందన్నాడు అదేంటి?"

"ఫెమినిజం అంటే ఆడవాళ్ళు ఎందులోనూ మగవాళ్ళకంటే తక్కువకాదు, అన్నిట్లో సమానమే అని చెప్తూ ఆడవాళ్ళని రకరకాలుగా అణచివేస్తున్నారని, ఆ అణచివేతకి బలికాకుండా ఎదిరించి పోరాడమని నూరిపోయడమన్నమాట"

"ఓహో" అంది శారదమ్మ శ్రద్ధగా విని.

"కానీ నామీద ఏప్రభావమూలేదు మామ్మగారూ. నా మనసుకి ఏది కరక్టని పిస్తే అదిచేస్తాను, అంతే"

"ఒక్కమాట చెప్పనా బిందూ, ఏ ప్రభావమూ లేకుండా నువ్విలా కావడానికి అవకాశమే లేదు"

"ఎలా అయ్యానేంటి?"

"నడక, నడత, ఆలోచన అన్నిట్లో ఏవరేజ్ ఉమెన్ కంటే నువ్వు ఎడ్వాన్స్‌గా వున్నావు. అందుకు నిన్ను తప్పుపడ్తున్నాననుకోకు. అవన్నీ నాకు నచ్చాకే..." అని గబుక్కున అక్కడ అమ్మమ్మ వుందనే విషయం స్ఫురణకొచ్చి 'నిన్ను ఇష్టపడ్డాను' అనే మాటని నాలుక మీదే వుంచేశాడు.

బిందు కొంచెం చిత్రంగా చూసింది.

"సరదాగా ఆటపట్టించడంవేరు" అన్నాడు మళ్ళీ.

"కానీ, నిజంగా నేనేవో చదివి లేదా విని నేర్చుకోలేదు. నా ఆలోచన్లు ఇలానే వుంటాయి. అవి సహజంగా వచ్చినవే"

"తప్పు. సహజమైన స్వభావం ఒకటుంటుంది కాదనను. కానీ అది కేవలం ప్లెయిన్ కేన్వాస్‌లాంటిది. దానిమీద ఎలాంటి ప్రభావాల రంగులు, పరిస్థితుల




రూపులు పడితే అవి అలా డెవలప్ అవుతాయి"

బిందు ఒక నిమిషం ఆలోచించి "అంతేనంటావా? " అంది.

"ఖచ్చితంగా. లేకుంటే సగటు ఆడపిల్లలో లేని రివల్యూషనరీ థింకింగ్ నీలో ఎందుకుంది? నీకంటే ఇంకా ప్రోగ్రెసివ్‌గా ఆలోచించేవాళ్ళుంటారు. వాళ్ళు నీకంటే ఎక్కువ ఎక్స్‌పోజ్ అయ్యుండొచ్చు. లోకాన్ని చదివి, చూసి వుండొచ్చు"

బిందు సాలోచనగా చూసింది.

శారదమ్మకి వాళ్ళ మాటలు పెద్దగా అర్థం కావడంలేదు.

వాళ్లకి వడ్డించడం మీదే ఆవిడ ధ్యాసంతా కేంద్రీకృతమై వుంది.



**చూ**సీ చూసీ తను కల్పించుకోకపోతే వాళ్ళ సంభాషణ ఎంతకీ తెగేట్లు లేదనుకున్న శారదమ్మ "మీ మాటలు కాసేపు కట్టిపెట్టండి, అన్నం చల్లారిపోతోంది, ముందు హాయిగా తినండి. రేపూ మాపూ ఇక్కడే వుంటారుగా. పగలల్లా కావల్సినన్ని కబుర్లు చెప్పుకోవచ్చు" అంది.

బిందుకి ఆశ్చర్యమేసింది. ఆవిడ స్థానంలో మరెవరైనా పెద్దవాళ్ళుంటే 'నోర్మూసుకుని తినండి' తరహాలో విసుక్కోవడమో, కసురుకోవడమో చేస్తారు. కానీ అంత పెద్దావిడ వండి వార్చింది చాలక ఓపిగ్గా వడ్డన చేస్తూ కూడా రవంత విసుగు లేకుండా ముందు తినమని ఎంత సౌమ్యంగా చెప్తోంది? నిజంగా షీ ఈజ్ గ్రేట్ అనుకుంది.

"సారీ మామ్మగారూ... ఏదో ఎమోషనల్‌గా మాటకి మాట నేనే పెంచాను" అంది బిందు నొచ్చుకుంటూ.

శారదమ్మ పప్పులో తోటకూర, వంకాయ వేపుడు వడ్డించింది.

ఇద్దరికిద్దరూ లొట్టలేస్తూ తిన్నారు.

"అబ్బా! మామ్మా, వంట ఇంత బాగా చేయచ్చని నాకు తెలీనే తెలీదు. రెండూ కూడా బ్రహ్మాండంగా ఉన్నాయి. వంటల పోటీల్లాంటివేవయినా పెడితే ఇండియా మొత్తంమీద మీకే ఫస్ట్ ప్రయిజ్ వస్తుంది" అంది.

"అంతచేటు మునగ చెట్టు ఎక్కించేబదులు ఇంకాస్త వేయమంటే వేస్తుందిగా" అన్నాడు శ్రీహరి.

"చూడు మామ్మా, మెచ్చుకుంటే కూడా తప్పేనా? "

"తప్పని కాదు గానీ మోతాదుని మించి పొగిడ్తే ఆర్టిఫిషియల్‌గా ఐమీన్ భట్రాజు పొగడ్తలా ఉంటుంది"

"మెక్కడమే తప్ప మెచ్చుకోవడం తెలీని మీ మగవాళ్లకి అలాగే వుంటుందిలే"

"నువ్వూరుకోరా హరీ, ఆ అమ్మాయి మీద మరీ ఒంటికాలిమీద లేస్తావెందుకూ? " అని మెత్తగా మందలించి బిందు పళ్లెంలో పప్పుకూర మారు వడ్డించింది.

"అయ్యో మామ్మా, మీరిలా పెడ్తూపోతే నేను తింటూనే ఉంటాను. ఇక తాతయ్యకూ, నీకూ ఏమీ మిగలదు"

"నువ్వు తినాలేగానీ మాకు మిగలకపోయినా ఫర్వాలేదు" అం[illegible] మూతి బిగించి

నవ్వింది.

కమ్మటి నెయ్యి వద్దన్నా వినకుండా చెంచాలకొద్దీ వేస్తోంటే కూర మరింత రుచిగా ఇంకా ఇంకా తినాలనిపించేట్టు ఉంది. కూరన్నం పూర్తయ్యాక తీయటి గడ్డ పెరుగు మీగడతోసహా వేసింది.

"హరి వెక్కిరించినా సరే నాకు తోచిన మాట నేను చెప్పకుండా వుండలేను మామ్మా" అంది.

"ఏంటో చెప్పమ్మా"

"ఊహ తెలిసిన దగ్గర్నుంచీ పెరుగు తింటున్నాను గానీ ఇలాంటి పెరుగు మాత్రం ఇంతవరకూ తినలేదు. ఇందులో కూడా అమృతం లాంటిదేమయినా వేశారా? "

"పిచ్చిపిల్లా! మనింట్లో పాడి కనుక పాలు చిక్కగా ఉంటాయి. పెరుగు రుచిగా ఉంటుంది. అదే పట్నాల్లో అయితే సగానికి సగం నీళ్లు కలుపుతారు. పైగా పాలపొడి వాడ్తారట. ఈ రుచి వాటికెందుకొస్తుంది? "

భోజనం ముగించిన బిందు నవ్వుతూ, "మీరు గనుక రోజూ ఇంత రుచిగా వంట చేశారంటే నేను ఇద్దరు మనుషుల తిండి లాగించేట్లున్నాను" అంది.

"మామూలుగానే ఇద్దరు, ఇప్పుడు నల్గురు మనుషులను" అంటూ సరిచేశాడు హరి.

బిందు జవాబు చెబ్దామనుకునేలోపు శారదమ్మ ఒక మొట్టికాయ వేయడంతో "అబ్బా" అంటూ వెళ్లి చేయి కడుక్కున్నాడు శ్రీహరి.

బిందు కూడా చేయి కడుక్కుని "మీ ఇద్దరికీ నేను వడ్డించనా మామ్మా? " అంది.

"వద్దులేమ్మా. నువ్వెళ్లి కూర్చో మేం కూడా తిన్నాక వచ్చి మల్లెలు మాల కట్టిస్తాను" అంది.

బిందు రెట్టించకుండా వెళ్లింది.

బల్లమీద హరికి కొంత ఎడంగా కూర్చుని, "ఏమన్నావు? నేనెప్పుడూ ఇద్దరు మనుషుల తిండి ఒక్కదాన్నే తింటానా? " అంది.

"అంతేగా" అన్నాడు హరి కూల్‌గా.

"నిజమేలే. నీలాంటి బ్రెయినీటర్ని భరించాలంటే బాగా తిని బలంగా ఉండాల్లే"

"తిందామన్నా నీకు బ్రెయినుంటేగా"

"నిజంగా లేకపోయినా బాగుండేది. అప్పుడు ఇంత బాధపడాల్సిన అవసరం ఉండేదికాదు"

"ఇప్పుడు నీకొచ్చిన బాధేమిటీ? "

"చెప్పినా నువ్వు నమ్మవుగా, కోస్తున్నానంటావు, ఎగ్జాజరేషన్ అంటావు"

"నేనేమంటానో తర్వాత, ముందు నువ్వు చెప్పు"

"ఇందాక చెప్పిందే. అమ్మమ్మ గురించే"

శ్రీహరి ఆలోచనలో పడ్డాడు.

కొంచెంసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

తర్వాత బిందు తటపటాయిస్తూ "హరీ..." అని పిల్చింది మెల్లగా.

అతను చెప్పమన్నట్టు ఆమె వంక చూశాడు.

అది గమనించకుండా తలొంచుకుని కూర్చున్న బిందు "ఏయ్ హరీ" అని మళ్లీ పిలిచింది.

"ఇందాకే పలికాను, నువ్వు చూళ్లేదు, ఏంటో చెప్పు"

"ఇఫ్ యూ డోంట్ మైండ్..."

"నసాపి చెప్పు"

"నాకు చాలా ఎంబరాసింగ్‌గా ఉంది..."

"విషయమేంటో చెప్పు తల్లీ"

"మరి... మరి"

"ఇదిగో, దిక్కుమాలిన తెలుగు సీరియల్స్‌లోలాగా ఒక డైలాగుని వందసార్లు వల్లించావంటే నాకు చెడ్డ చిరాకొస్తుంది"

"ఛీ... పో, పోయిపోయి జిడ్డు సీరియల్స్‌తో పోలుస్తావే"

"అలా వుంటే పోలిస్తే తప్పొచ్చిందా? ఇంతకీ చెప్తావా లేక నేను గుర్రుపెట్టి పడుకోనా? "

"నేను... బాత్రూంకెళ్ళాలి. ఆ తడికెల బాత్రూం ఇండియా పక్కన శ్రీలంకలా




ఎక్కడో దూరంగా వుంది. కాస్త తోడు రావా" అంది.

"ఈ మాత్రానికి ఇంత బిల్డప్పా? "

ఇద్దరూ అటుగా నడిచారు.

"మరీ క్లోజ్‌గా రాకు, కొంచెం దూరంగా నిలబడు. నువ్విక్కడ వున్నావంటే నాకు ధైర్యంగా వుంటుంది" అంటోంటే హరికి నవ్వు ఆగలేదు.

★ ★ ★

వీరయ్య ఎంతో నెమ్మదైన వ్యక్తి. సాధ్యమైనంతవరకూ ఎవర్నికైనా ఉపయోగపడదామని చూస్తాడు. తన సుఖం, సౌఖ్యం చూసుకోకుండానే రోజులు గడిచిపోయాయి. రెక్కల్లో ఓపిక వున్నంతవరకూ క్షణం తీరిక లేకుండా కష్టపడ్డాడు. ఇక ఇప్పుడు వయసు ఉడిగి, శక్తి నశించివున్నాడు.

నలుగురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయగా మిగిలి ఉన్న కొద్ది పొలాన్ని కౌలుకి ఇచ్చారు. ఆ వచ్చే ఆదాయంతోనే వాళ్ళ జీవనం సాగుతోంది.

ఆయన కీళ్ళ నొప్పులతో బాధపడుతున్నాడు.

ఆ ఊళ్ళో ఆయన ఈడువాళ్ళు ఇంకొందరున్నారు. వాళ్ళ దగ్గరికి మెల్లగా తను వెళ్ళి రావడమో, లేక వాళ్ళొస్తే వీధి అరుగుమీద కూర్చోవడమో ఇదే ఆయనకి కాలక్షేపం. అయితే ఎక్కువ మాట్లాడే స్వభావంకాదు.

వీరయ్య అరుగుమీదికెళ్ళి చుట్ట కాల్చుకుంటున్నాడు.

వసారాలో శారదమ్మ పూలు అల్లుతోంటే బిందు, శ్రీహరి ఏదో మాట్లాడ్తున్నారు.

ఆ చుట్ట కంపు నాసికకి సోకగానే బిందూ ముఖం వికారంగా పెట్టి, ముక్కు దగ్గర చీర చెంగు అడ్డుగా పెట్టుకుని, "బాబోయ్, ఈ వాసన నే భరించలేను" అనేసింది.

"ఏయ్, మెల్లగా. తాతయ్యకి విన్పిస్తే కోపమొస్తుంది" అన్నాడు శ్రీహరి.

"మామ్మగారూ, మీకు చుట్ట కంపు ఇష్టమా? " అనడిగింది బిందు గొంతు తగ్గించి.

"చుట్ట కాల్చేవాళ్ళకి ఇంపుగా వుంటుంది, పీల్చేవాళ్ళకి కంపుగా వుంటుంది" అంది శారదమ్మ ప్రశాంతంగా.

"మరి ఆ వాసన నాకు నచ్చదని చెప్పి, మాన్పించే ప్రయత్నం చేయలేదా? "

"ఈ రోజుల్లో మీకున్నంత ధైర్యం, తెగువ మాకు లేవమ్మా. మొగుడి ముందు నోరు మెదపాలంటేనే హడలి చచ్చేవాళ్ళం. ఇక ఇష్టాలూ అయిష్టాల గురించి మాట్లాడ్డం కూడానా? "

"మనసులో వున్నవేవీ పంచుకోకపోతే ఇక అదేం కాపురం మామ్మా? " అనేసింది బిందు.

శ్రీహరి ఉలిక్కిపడ్డాడు. బిందు అంత మాట అనేసరికి అమ్మమ్మ ఎక్కడ నొచ్చుకుందోనని కంగారుపడ్డాడు.

"పెద్దవాళ్ళతో అలాగేనా మాట్లాడ్డం? " అని బిందుని విసుక్కుని "నువ్వేం అనుకోకు అమ్మమ్మా, ఆ పిల్లకి మాట కుదరదు. ఒక్కోసారి ఇలాగే మాట్లాడ్తుంది" అన్నాడు శారదమ్మతో.

"ఆ అమ్మాయి తప్పేం అంది? ఆమాట నిజమేగా. కాకపోతే మా కాలంలో చదువు సంధ్యల్లేవు. ఏమీ తెలిసి చచ్చేదికాదు. మనసుకి కష్టం కలిగినా సరే దాంతోనే రాజీపడిపోయేవాళ్ళం. బహుశా అందుక్కారణం ఇంకోమార్గం ఏదీలేకపోవడమే కావచ్చు"

"నువ్వు చెప్పిందే కరక్ట్ మామ్మా. మేమేదో తెలివిగలవాళ్ళం మీరు తెలివితక్కువవాళ్ళుకాదు. ఆరోజుల్లో ఆడవాళ్ళు బయటికెళ్ళే అవకాశాలు లేవు గనుక భర్త ఎలాంటివాడైనా చచ్చినట్లు ఎడ్జస్ట్ అయిపోయేవాళ్ళు. ఇప్పుడు బయటి ప్రపంచాన్ని చూసే అవకాశం, మా కాళ్ళమీద మేం నిలబడే శక్తి వుండటాన అవసరమైతే ఎదిరించగల్గుతున్నాం" అంది బిందు.

"మా తరం వాళ్ళ జీవితాల గురించి వింటే మీకు ఆశ్చర్యంగా వుండొచ్చు. ఏదోలే చరమాంకంలో వున్నదాన్ని..."

"తాతగారు ఎక్కువ మాట్లాడరా మామ్మా?"

"అంత ఎక్కువగా మాట్లాడే అలవాటు లేదమ్మా"

"ఎందుకలా?"

"ఎందుకంటే నేనేం చెప్పను? ఆయన తీరే అంత"

"తాతగారికి కోపం ఎక్కువా?"

"లేదే"

"ఏమో, చూస్తే అలా అన్పిస్తుంది"

"ఈయనకి కోపంలేదుగానీ వాళ్ళ నాన్న గారు అంటే మా మామగారు మహా కోపిష్టి. ఏ పనిలోనైనా వెంట్రుకవాసి తేడా వచ్చినా సహించేవారు కాదు. అంతెందుకు పళ్లెంలో కుడివైపు వడ్డించాల్సిన కూర పొరపాటున ఎడంవైపు వేసినట్లయితే పళ్లెం నేలకేసి కొట్టేవారు. నెయ్యి ఒక చుక్క ఎక్కువ పడినా, తక్కువ పడినా ఇల్లు లేచిపోయేట్లు అరిచేవారు" అంటూ చనిపోయిన మామగార్ని గుర్తుతెచ్చుకు నవ్వింది.

బిందు గుడ్లు మిటకరించి చూస్తోంటే "తాతమ్మ స్థానంలో బిందూగానీ వుంటే ఆ ఎంగిలి పళ్ళేన్ని ఆయన నెత్తికేసి కొట్టి ఇల్లు విడిచి వెళ్ళిపోయేది అమ్మమ్మా" అన్నాడు శ్రీహరి నవ్వుతూ.

"బిందూ అనే కాదు, ఈ కాలం వాళ్ళెవరూ ఇటువంటివి సహించరు. అంత అవసరమూలేదు. మేమంటే ఏదో పిచ్చి మాలోకాలం, కాలాన్నలా నెట్టుకొచ్చాం"

"ఆయనిప్పుడు లేరనుకుంటా?"

"లేరమ్మా, పాతికేళ్ళ క్రితమే చనిపోయారు"

"చివరివరకూ కోపంగానే వుండేవారా?"

"వయసుడిగేకొద్దీ ఆ వాడి, వేడి కూడా తగ్గింది"

"అంటే క్రమంగా కూర ఎటు వడ్డించినా ఏమీ అనేవారు కాదా?"

"ముఖం చిట్లించడంతో సరిపెట్టేవారు. రోజూ చేసే పనేదైనా వేళమించినా, తేడా వచ్చినా ఇక ఆరోజంతా ముభావంగా వుండేవారు. ఎవరైనా పలకరించినా బదులు చెప్పేవారు కాదు"

"ఓ మైగాడ్, ఆవిడెలా భరించేవారో పాపం?"

"గత్యంతరం లేకపోతే భరించక తప్పదుగా"

"మామ్మా, నీ కథ తెల్సుకోవాలని వుంది. రేపు చెప్తావా?"

"పిచ్చి తల్లీ. నా గురించి తెలుసుకోవాల్సినంత గొప్ప సంగతులేం లేవమ్మా"

"అలా తప్పించుకుంటే కుదరదు"

"ముందు పూవులు పెట్టుకో" అని అందించింది.

లోపలికెళ్ళి బ్యాగ్‌లో వున్న హెయిర్ పిన్ను తెచ్చుకుని దాని సాయంతో పూలు పెట్టుకుంది బిందూ.

"హరీ, మీ తాతయ్య మంచం పక్కనే నీకో మంచం వాల్చి పక్క వేశాను. అక్కడ పడుకో"

హరి సరేనన్నట్లు తలాడించాడు.

"బిందూ నువ్వు నా దగ్గర పడుకుందువుగాని రామ్మా. ఇక రేపు మాట్లాడుకోవచ్చులే" అని లేచింది శారదమ్మ.

బిందు ఆవిణ్ణి అనుసరించింది.

★ ★ ★

శారదమ్మ బిందుని వెంటబెట్టుకు తీసుకెళ్ళిన గదిలో ఒక మంచం వాల్చి పక్కవేసి వుంది. ఆ గదిలోనే మరోగోడ పక్కగా ఎత్తి వుంచిన నులక మంచాన్ని వాల్చింది. దాని మీద ఒక బొంతవేసి, దానిమీద దిండు, దుప్పటి వేసి, కప్పుకునేందుకు మరో దుప్పటి అందిస్తూ "ఇక పడుకోమ్మా, ప్రయాణం చేసొచ్చారుగదా, బాగా అలసిపోయుంటారు" అంది.





# పెలినముత్యాలు

★ అనుభవం వల్ల విజ్ఞానం, అవివేకం వల్ల అనుభవం లభిస్తాయి.

– సచాగంయెట్రీ

★ పాములను చూసి భయపడినట్లే జనులు అబద్ధాలకోరును చూసి కూడా భయపడతారు.

– తిరువళ్లువర్

★ తేనెటీగలు పూవులనుండి తేనెను సంగ్రహించినట్టు పండితుడైనవాడు చిన్న గ్రంధములనుండి సద్విషయాలను గ్రహిస్తాడు.

– దయానంద సరస్వతి

★ సత్యం వజ్రం కంటే కఠోరమైనది. శిరీషకుసుమం కంటే కోమలమైనది.

– సంస్కృత సూక్తి

★ స్వార్థంతో పుణ్యకార్యాలు ఆచరించాలి అనుకోవడం ఆత్మవంచన.

– చిన్మయానంద

★ ఇతరుల దృష్టిని ఆకర్షించాలని చేసే పనులు అనర్థహేతువులు.

– జాన్.ఎఫ్. కెన్నెడీ

★ యంత్రం నిర్దుష్టంగా పనిచేస్తే చప్పుడు ఉండదు. రాపిడి ఉన్నపుడే చప్పుడు, గొడవ, గోల.

– జేమ్స్ ఎలెన్

★ మనసు కాలాన్ని అధిగమించినప్పుడే సత్యం అర్థమవుతుంది

– వివేకానంద

★ పాఠశాలలో బోధన పూర్తి అయినా చదువు జీవితంతోనే పూర్తి అవుతుంది.

– డా.రాధాకృష్ణన్

★ ఉత్తమవ్యక్తి చివర లాభం పొందడానికే మొదట కష్టపడతాడు.

– ఫ్రాంక్లిన్

★ శత్రువుని కూడా గౌరవంగా చూడడం గౌరవాన్నే గౌరవించడంలాంటిది.

– జాన్సన్

★ మిక్కిలి ఎత్తైన స్థానం మీద గురిచూడు. మధ్యలో ఏదో ఒక స్థానాన్ని అందుకుంటావు.

– గ్రీకు సామెత

★ ప్రపంచాన్ని తలకిందులుగా చదివి లోకం మనని మోసగిస్తున్నదని అనుకుంటాము.

– ఎమర్సన్

★ నాకు చాలా ఇష్టం అయినా, అర్థంకానివి మూడు.... చిత్రలేఖనం, సంగీతం, స్త్రీ.

– ఫౌంటెన్ లీ

సేకరణ: పి.వి. రమణకుమార్

"అలాగే మామ్మా" అని వచ్చి పడుకుంది బిందు.

"మధ్య రాత్రి దాహమేస్తే ఇక్కడే చెంబుతో నీళ్ళు పెట్టాను, తాగు" అంది శారదమ్మ తన మంచంమీద నడుం వాలుస్తూ.

"అలాగే మామ్మా" అంది బిందు.

బిందు కళ్ళు మూసుకుని నిద్రపోయే ప్రయత్నంచేసిందిగానీ ఫలితం లేకపోయింది. అంతా కొత్తగా వుంది. ముందే ఆమెకి దీపపు వెల్తురు ఆనలేదంటే ఇక శారదమ్మ పడుకోబోయేముందు దాన్ని మరీ తగ్గించింది. దాంతో కేవలం ఒక కొడగట్టోన్న ప్రమిదలోని వత్తిలా లేదా ఫంక్షన్లలో అలంకరించే షో బల్బ్ వెలుగుతున్నట్లు నామ్‌కే వాస్తే వుంది తప్పించి దానివల్ల గదికొస్తున్న వెలుగంటూ ఏమీలేదు.

చల్లటి చలికాలంలో కూడా బిందు ఫాన్ ఫుల్ స్పీడ్‌లో పెట్టుకుని పడుకుంటుంది. అలాంటిది ఇంత ఎండాకాలంలో అసలు ఫానే లేకుండా పడుకోవాలంటే ఎంత కష్టం? కనీసం బయటినుండి గాలివచ్చే మార్గం అయినాలేదు. ఆ గదిలో ఒక మూరెడు పొడవు, వెడల్పు వున్న చిన్న కిటికీ మాత్రం వుంది. అందులోంచి గాలేం వస్తుంది?

బిందుకి భయంకరంగా ఉక్కపోస్తోంది. ముందే అలవాటులేని చీరతో పడుకోవడం మహా కంపరంగా వుంది. 'ఇంట్లో హాయిగా స్లీవ్‌లెస్ నైటీ వేసుకుని పడుకుంటే ఎంత కంఫర్టబుల్‌గా వుండేది? నాకు ఇవాళ ఒక్కరోజుకే చీరలంటే చిరాకు పుడ్తోంది. లక్షలాదిమంది రోజూ చీరల్లో ఎలా సెటిలై పోతున్నార్రా బాబూ? షర్టులు, కుర్తాలు అయితే లూజులూజుగా వుండి సుఖంగా అన్పిస్తుంది. ఈ వెధవ జాకెట్లు ఎవరు కని పెట్టార్రా బాబూ జిడ్డులా, జలగలా ఒంటిని అంటిపెట్టుకుని తెగ ఇబ్బంది పెట్టేస్తోంది. ఈ ఉక్కపోతలో నిద్రపట్టడం సంగతి దేవుడెరుగు అసలు పిచ్చి పట్టేట్లుంది. ఈ రాత్రి ఎలా గడుస్తుంది?

రేపు హరిని ఎలాగోలా ఒప్పించి, ఒప్పుకోకపోతే ఫాట్‌మని ముఖంమీద ఒకటిచ్చయినా సరే జండా ఎత్తేయాలి. ఓ మైగాడ్... తిండి లేకపోయినా బతకొచ్చు గానీ గాల్లేకుండా బతకడం ఎలా?? అనుకుని అటూ ఇటూ చూసింది ఏమైనా పేపరో, పత్రికో దొరుకుతుందేమో విసురుకుందామని. ఆ ఆలోచనకి తనమీద తనకే కోపం వచ్చింది. ఇంత వెనకబడ్డ ఊళ్ళో అవెందుకుంటాయి? !

రవ్వంత గాల్లేని ఇంత భయంకరమైన వాతావరణంలో మామ్మగారు ఎలా పడుకుందబ్బా అనుకుని ఆశ్చర్యపోయింది. అన్ని రకాల అసౌకర్యాలనీ భరిస్తోన్న ఆవిడకి ఇదో లెక్క కాదేమో. పైగా కుడివైపు వడ్డించాల్సిన కూర పళ్ళెంలో ఎడంవైపు వేసినంత మాత్రానికే పళ్లాన్ని విసిరికొట్టే మామగార్ని భరించిన సహనశీలికి ఇది చెప్పుకోదగ్గ కష్టం కానే కాదేమో.

హరికి వసారాలోనే మంచం వేసినట్లుంది. అక్కడ ఒకవైపునంతా ఓపెన్‌గా వుండటాన హాయిగా గాలిసోకే అవకాశం వుంది. అదృష్టవంతుడు, భలే చోటు కొట్టేశాడు. అయినా ఈ మామ్మ ఇంత అమాయకురాలేంటి? తమ ఇద్దరికీ ముందు వసారాలో పక్కవేసి, ఆ మగ పక్షులిద్దర్నీ ఈ గాల్లేని కొట్టు గదిలో పడేస్తే సరిపోయేదిగా. ఇక్కడ గాలి వుండదని తన ట్యూబ్‌లైట్ బ్రెయిన్‌కి తోచి చావలేదు. లేకుంటే తనైనా అలా చేయమని చెప్పేది.

పోనీ ఇప్పుడు హరీ వాళ్ళు పడుకున్న వసారాలోకి వెళ్తే? ఈ గదికి వచ్చేటప్పుడు చుట్టు తిరిగి వచ్చారు. అంటే ఇందులోంచి వసారాలోకి డైరెక్ట్ వే అంటూ లేదు. ఇప్పుడు చుట్టు తిరిగి వెళ్ళడం తనవల్ల నవుతుందా? బయటంతా చిమ్మచీకటి. ఏ పామో వచ్చి ఎంత ముద్దుగా వుందను




కుంటూ తన కాలిని వాటేసుకుంటే అంతే సంగతులు, క్షణంలో గుండె ఆగి చస్తుంది. బల్లి మీద పాకితేనే చచ్చి బతికినంత హంగామా చేస్తుందాయె.

పోనీ ఈ చిమ్నీని కొంచెం వత్తి పెద్దది చేసి, దాన్ని పట్టుకుని ముందువైపుకి వెళ్ళి హరిని లేపితే ఎలా వుంటుంది? ఆ లక్కీ ఫెలో ఇప్పటికే సెవెన్ హిల్స్ ఎక్కేసి వుంటాడు. తను వెళ్ళి లేపితే అయోమయంగా చూస్తాడు.

"ఏయ్, నువ్వెళ్ళి మీ తాతపక్కన పడుకో. నీ మంచంమీద నే పవళిస్తాను" అని చెప్పాలి. కానీ హరిని నమ్మొచ్చా? అవకాశం దొరికింది లెమ్మని నన్ను నిద్రపోనిచ్చి, వెకిలి వేషాలేమైనా వేస్తే? ఛఛ... హరి నమ్మబుల్ బుల్లే (BULL) అతని అల్లరంతా మాటలవరకేగానీ, ప్రాక్టికల్‌గా బహుబుద్ధిమంతుడు. పైగా అస్సలు మిస్‌బిహేవ్ చేయనని ప్రామిసూ, కోల్గేటూ కూడా చేశాడు. మరి వెళ్తేపోలా అనుకుని లేవబోయింది.

కానీ ఆ దీపం పట్టుకుని చీకట్లో వెళ్ళడం తల్చుకుంటే సినిమాల్లో దెయ్యాల్ని చూపే సీన్లు గుర్తొచ్చాయి. తనకితానే దెయ్యంలా కన్పించడం తల్చుకుంటే ఠారెత్తింది. గుండె శివుడి ఢమరుకంలా డబడబలాడ్తూ నూట నలభైనాలుగుసార్లు కొట్టుకుంది. వద్దు బాబోయ్ ఈ సఫకేషన్ని ఎలాగోలా భరిస్తే బతికుండి బోల్డన్ని సాధించొచ్చు. తనుగానీ హార్ట్ ఫెయిలై ఛస్తే ఆ అక్కుపక్షేమైపోతాడు?

బిందు ఆలోచనలకి అంతూదరీ లేకుండా వుంది. ఇంతలో ఒక విచిత్రమైన ధ్వని వచ్చేసరికి భయంతో గుండె కీచుకీచుమంది.

సినిమా హాల్లో షో మొదలయ్యాక అడుగు పెడితే మొదట అసలేమీ కనిపించదు. కానీ కొద్దిక్షణాల తర్వాత నెమ్మదిగా కళ్ళు ఆ కొద్ది వెలుగులోనే చూసేందుకు అలవాటు పడి కన్పించడం మొదలవుతుంది.

ఇక్కడా అంతే జరిగింది. మొదట శారదమ్మ దీపం తగ్గించగానే చీకటిమయంగా వున్నా, బిందుకి ఇప్పుడదే అలవాటై గది కన్పించడం మొదలుపెట్టింది.

'ఇదేం సౌండ్‌రా నాయినా? ఇంతకు ముందెప్పుడూ ఇలాంటి శబ్దం వినలేదే. డైరెక్టుగా పాముని ఎప్పుడూ చూడకపోయినా, అది చేసే ధ్వనులు వినకపోయినా చిన్నప్పుడు కుక్క భౌభౌమనును, పిల్లి మ్యావ్‌మనును, పాము బుస్సుమనును అని నేర్పించారు. మొదటి రెండిటినీ చూసి ఆ శబ్దాలని కన్‌ఫర్మ్ చేసుకుంది. మూడో దాన్ని కూడా సినిమాల్లో చూసి అదే కరక్టనే నిశ్చయానికొచ్చింది. కానీ ఇప్పుడిదేంటి? పాము కాదుగదా? అయినా పాముల్లో చాలాచాలా రకాలుంటాయని చదివిందే. మరి అన్ని రకాల పాములూ ఒకేరకంగా బుస్సుమనాలని ఏముంది? అనకపోవచ్చు వేటి స్పెషాలిటీ వాటికుండొచ్చు.

మనుషులంతా ఒకే జాతి అయ్యుండీ ఒక్కో దేశస్థులు ఒక్కోలా మాట్లాడ్తారే. అంతెందుకు ఏపీవాడికీ, యుపీవాడికీ పోలికుండదు. అలాంటిది ఏ జాతి పామయినా ఒకే రకమైన శబ్దం చేస్తుందనుకోవడం తప్పు కాదూ?

ఆ ధ్వనిని బాగా ఆలకించింది. ఒకటికి పదిసార్లు విన్నాక "అప్...హూ" అని వస్తున్నట్లు తేల్చుకుంది. ఇదేం కొత్త పనిష్‌మెంట్‌రా బాబూ... ఓ మైగాడ్... ఇదే రకపు పామై వుంటుంది? ఏవైపున పొంచి వుంది? ఎందుకింత చేటు లబలబలాడ్తోంది? కొంపతీసి తన వాసన పసిగట్టిందా? పాములకి కొత్తవాళ్ళు రాక ఇష్టముండదా? ఇప్పుడు తనని కాటేస్తుందా? సినిమాల్లో చూపినట్లు ఆ పాముకాటుకి తను నురగలు కక్కుతూ చనిపోతుందా? అనుకునేసరికి భయంతో కంపించిపో

యింది బిందు.

గుండె చిక్కబట్టుకుని బాగా అబ్జర్వ్ చేసిం తర్వాత అసలు సంగతి అర్థమై "షిట్" అంటూ తన వీపుమీద తానే కొట్టుకుని నవ్వుకుంది. ఇంతా చేస్తే ఆ విచిత్ర ధ్వని మామ్మగారి నోట్లోంచి వస్తోంది. ఇలాంటి గురకలు కూడా వుంటాయని బిందుకి తెలీదు. ఆవిడ రెండు పెదాలూ "అప్..." అంటూ ముందుకెళ్ళి "...పూ" అంటూ వెన క్కొస్తున్నాయి. అప్పటివరకూ కలవరపెట్టిన భయం పోయి గమ్మత్తుగా అన్పించింది.

ఇవాళ రాత్రికి నిద్రెలాగూ పట్టేట్లులేదు. కనుక మామ్మగారి మ్యూజికల్ నైట్‌ని ఎంజాయ్ చేయాలన్నమాట అనుకుంది.

ఒక ఉద్రేకం తీవ్రంగా వున్నపుడు శరీరా నికి సంబంధించిన ఇతర లక్షణాలు నిద్ర పోతాయి కాబోలు. పామేమోనని భయప డినంతసేపూ బిందూ గాలి ఆడని స్థితిని మర్చిపోయింది. ఇపుడు భయం పోగానే ఉబ్బరింత మళ్ళీ అనుభవంలోకి వచ్చింది. కుక్కర్‌లో పడేసి మూత పెట్టినట్లుగా వుంది. చీర చెంగుతో ఊపుకుంటూ కళ్ళు మూసుకుంటే ఎప్పటికో కొంచెం నిద్రప ట్టింది.

పట్టక పట్టక పట్టిన నిద్రకూడా ఎంతో సేపు నిలవలేదు. లఘుశంకకి వెళ్ళాల్సిన అవసరం వచ్చి మెలకువ వచ్చేసింది. మామ్మగారు చూస్తే "అప్...పూ" సంగీ తాన్నే అందిస్తోంది. ఆవిణ్ణి లేపడం భావ్యం కాదు. ఓ మైగాడ్... ఇప్పుడేం చేయాలి? సామాన్యంగా తనకి మధ్యరాత్రిలో ఇలాంటి అవసరం కలగదు. అరుదుగా అవసరం కలిగితే తను పడుకునే గదిలో అటాచ్‌డ్ బాత్ వుంది కనుక ఏమీ ఇబ్బందిలేదు. కానీ ఇక్కడ ఇంటికి ఫర్లాంగ్ దూరంలో బాత్రూం అనబడేది వుంది. వెళ్లే దారంతా చీకటిమయం. కాలు తీసి కాలు వేస్తే ఏం




ముంచుకొస్తుందో అన్నట్లుంది.

అయినా అంత బుద్ధిజ్ఞానం లేకుండా గ్లాసుల కొద్దీ నీళ్ళెందుకు తాగినట్లు ఒంటె లాగా. ఎడారుల్లో తిరిగే ఒంటె నీళ్ళు సరిగా దొరకవని దొరికినప్పుడు ఒకేసారి ఎక్కువ మోతాదులో తాగేస్తుందట. దానికి అన్ లోడ్ బాధ వుండదేమో.

అమ్మ ఎప్పుడో చెప్పిన మాట ఇప్పుడు గుర్తుకొస్తోంది. నెయ్యి ఎక్కువ వేసుకుంటే బాగా దాహం వేస్తుందట. వద్దన్నా విన కుండా మామ్మగారు నెయ్యి బాగా వేశారు. దాంతో తనకి దాహమేసి నీళ్ళెక్కువ తాగింది. అందుకు ఇప్పుడు అనుభవిం చాలి. ఎప్పుడు పొద్దునవుతుందో, తనకి రిలీఫ్ ఎప్పుడు కలుగుతుందో.

బిందూకి వచ్చింది చిన్న కష్టమేం కాదు. అది చాలదన్నట్లు దోమలు తగులుకు న్నాయి.

'ఝుమ్మంది రాగం' అంటూ లయబ ద్ధంగా శబ్దంచేస్తూ 'సయ్యంది పాదం' అంటూ పాదాలు ఆమెమీద మోపి చెలరేగి పోతున్నాయి. రక్తాన్ని పీలుస్తున్నాయి.

'చందమామ కథల్లో శాపగ్రస్థులైన రాజకు మారుల గురించి రాస్తుంటారు. తను కూడా అంతేనా? ఇవాళ్టి తన ఈ బాధలకి ఏ పాపాలు కారణమో, ఎవరి శాపాలు కార ణమో.

'ప్రేమకోసమై వలలో పడెనే
పాపం హిమబిందు...' అని తనమీద తానే పాడుకోవలసి వస్తోంది.

లేకుంటే హరిని నొప్పించడం ఎందుకులె మ్మని వచ్చి ఇలా కష్టాలని కొనితెచ్చుకుం టుందా?

"ఓ గాడ్, సేవ్‌మీ! నువ్వొక్కడివే విను. ఏ జీసెస్‌కో, అల్లాకో చెప్పి నవ్వకు... ప్లీజ్... ఇంతకీ విషయం ఏమిటంటే... వెరీ సెన్సిటివ్. చెప్పేందుక్కూడా డెలికే ట్‌గా వుంది. అయినా తప్పదుగా అందుకే చెప్తున్నా. నా యూరినరీ బ్లాడర్‌ని బరెస్ట్ చేయకు... అర్జెన్సీ లేకుండా చూడు...

అంతేకాదు తొందరగా, అంటే ఫ్యూ మినిట్స్‌లో తెల్లారిపోయేట్లు చూడు. అలా చేస్తావు కదూ... చేయగలిగేంత పవర్ వుంది కదూ నీకు. ఓ గాడ్... దేవుడా... అల్లా... ఖుదా..." ఇలా బిందూ ప్రార్థన చేస్తూనే వుంది. ఆవేళ శివరాత్రి కనుక అయ్యుంటే ఆమెకి పుణ్యం వచ్చేది.

ఎప్పుడూ బారెడు పొద్దెక్కాకగానీ లేవని బిందు తెల్లవారుఝామున లేచిన మామ్మ గారితోబాటు లేచేసింది.

"ఏమ్మా, అప్పుడే లేచావే? ఇంకాసేపు పడుకోమ్మా. పట్నాల్లో ఇంత త్వరగా లేచే అలవాటు వుండదుగా" అంది శారదమ్మ.

"ఉదయానే లేవడం మంచి లక్షణం అని మా అమ్మ అంటుంది మామ్మగారూ" అని లేచి బాత్రూంవైపు నడిచింది బిందు.



**బిం**దు బాత్రూంనుంచి వచ్చేసరికి శారదమ్మ పశువుల కొట్టంలో ఉంది. దాన్నంతా బాగు చేయడం, పేడ, రొచ్చులతో పాడైన గడ్డిని తీసేసి మంచి గడ్డి వేయడం, కుడితి పెట్టడం, పాలు తీయడం, దొడ్డంతా ఊడ్చి పేడ కళ్లాపి చల్లి, ముగ్గులు పెట్టడం ఇలా ఎన్ని పనులో ఆవిడకి. ఇవన్నీ అయ్యాక వంటలోకి దిగుతుంది.

"ఈ పనులన్నీ కూడా మీరే చేస్తారా మామ్మా?"

"మునుపు జీతగాడుండేవాడు. ఈమధ్య ఎవరూ పాలేళ్లుగా ఉండేందుకు ఇష్టపడడం లేదు. కూలిపనికి వెళ్తే బాగా గిట్టుబాటుగా ఉంటుందట"

"పోనీ కొన్ని పనులు తాతయ్య చేయొచ్చుగా"

"ఆయనేం చేయగలడమ్మా? ఏదో కర్ర పోటు వేసుకుని నడుస్తున్నాడుగానీ... వయసు మీద పడిందిగా, తూలుడు, ఒణుకు ఎక్కువయ్యాయి. చేతికందించిన నీళ్లగ్లాసే సరిగ్గా పట్టుకోలేకపోతున్నాడు"

"తాతయ్యకి ఎన్నేళ్లుంటాయి మామ్మా?"

"తొంభై ఏళ్లు. నాకంటే ఇరవైయేళ్లు పెద్ద" అంటూ నవ్వింది.

"బాప్రే... ట్వంటీ ఇయర్స్ గ్యాప్?"

శారదమ్మకి ఆమాట వినిపించలేదు.

"వయసులో అంత తేడా ఉంటే నువ్వెందుకు చేసుకున్నావు మామ్మా? మరో సంబంధం చూడమని చెప్పకపోయావా?"

"బాగానే ఉందిలే సంబడం. మూడేళ్ల పిల్లకి ముప్ఫయ్యేళ్ల మగవాణ్ణి ఇచ్చి చేయడంతో పోలిస్తే ఇదెంత?"

"ఎంత అన్యాయం? నువ్వు ఎక్స్‌ప్లాయిట్ చేయబడ్డావు అమ్మమ్మా" అంది బిందు, ఇది పద్ధతి కాదన్నట్లు తల అడ్డంగా ఆడిస్తూ.

"ఏంటమ్మాయి?" ఎంతో కూల్‌గా అడిగిందావిడ తన పనులు చకచకా చేసుకుంటూనే.

"నువ్వెంత మోసపోయావో తెలుసా? ఇరవయ్యేళ్ల తేడాతో నిన్నెందుకు పెళ్లి చేసుకున్నారో తెలుసా? ఇందుకే... తను పండు ముసలివాడైనా నువ్వు ఇంకా కొంచెం ఓపిగ్గా వుండి అన్నీ చేసి పెడతావని"

"ఓపిక ఉన్నా లేకపోయినా చేసిపెట్టక తప్పదులేమ్మా. ఆడపుటక పుట్టాక కాట్లోకి పోయేవరకూ చేయాల్సిందే. అంతెందుకు,

యములోళ్లు వచ్చి నిలబడ్డా 'ఇదిగో కాళ్లు పట్టి వెళ్లు' అనగలరు"

ఆశ్చర్యపోవడం బిందు వంతయ్యింది. శారదమ్మకి తెలీనిది ఏమీ లేదు. అయితే పూర్వపు మనిషి కనుక అన్నిట్నీ కిమ్మనక భరించడానికి అలవాటు పడిపోయింది.

"నా పనులయ్యేలోగా నువ్వు ముఖం కడుక్కోమ్మా"

"అలాగే మామ్మా" అని తన సూట్‌కేస్ తెరిచినపుడు గుర్తొచ్చింది టూత్‌బ్రష్, టంగ్ క్లీనరూ పెట్టుకుంది గానీ ఇంట్లో వాడుతున్న టూత్‌పేస్ట్ ఎందుకులెమ్మని పెట్టుకోలేదు. దారిలో ఒక పేస్టూ, షాంపూ బాటిలూ కొనుక్కోవాలనుకుంది. కానీ హరితో కబుర్లలో పడి ఆ సంగతే మర్చిపోయింది.

ఇప్పుడెలా? ఈ మామ్మగారింట్లో పేస్ట్ వాడేంత సీన్ ఉండనే ఉండదు. ఈ ఇడియట్ ఏమైనా తెచ్చుకున్నాడేమో, అదే వాడుకుంటే సరి అనుకుని హరికోసం చూసింది. అప్పుడే లేచినట్లున్నాడు, కళ్లు నులుముకుంటూ వచ్చి..

"హాయ్! గుడ్‌మార్నింగ్" అంటూ ఆవిలించాడు.

"నీ పేస్ట్ కొంచెం దానం చెయ్యి"

"పేస్టా? "

"అవును మహానుభావా. పేస్టే..." అని తనూ బాగా రాగం తీసి "టూత్‌పేస్ట్" అంది.

"నే తేలేదు, నువ్వు తెస్తావనుకున్నాను"

బిందుకు వళ్లు మండుకొచ్చింది. "యూస్‌లెస్‌ఫెలో" అంటూ సణుక్కొంది.

"ఏంటి గొణుగుతున్నావు? రాత్రి బాగా నిద్రపట్టిందా? "

"ఆహా. గుల్బర్గా వరకూ వినిపించేంత పెద్దగా గురకలు పెట్టానే నీకు వినబడలేదా? "

"అబ్బ... ఏ నక్షత్రాన పుట్టావోగానీ, ఎప్పుడూ రెడీ టు ఫైట్ అన్నట్లే ఉంటావే"

"అలా అనక నువ్వు అర్థంచేసుకుంటావని ఎవరు ఎక్స్‌పెక్ట్ చేశార్లే"

"ఏమర్థంచేసుకోవాలి? "

"ఏమీ వద్దుకానీ, ఇప్పుడు నేనెళ్లిపోతాను. నన్ను కాస్త బస్సెక్కించు. ఆ తర్వాత నీ ఇష్టం వచ్చినన్ని రోజులు నువ్విక్కడుండు"

హరి నిద్రమత్తు మొత్తం వదిలిపోయింది.

"ఏమైంది బిందూ? నిన్న సాయంత్రం వచ్చావో లేదో అప్పుడే వెళ్దామంటావే? "

"నేనేం వెళ్దాం అన్లేదు, నన్ను పంపి, నువ్వుండు"

"ఎందుకని? అమ్మమ్మేమైనా అందా? తనేం అనదే? "

"లేనిపోనిది ఆవిణ్ణి సీన్లోకి లాగకు. మామ్మగారి లాంటి మంచి మనుషులు ఎక్కడో రేర్‌గా వుంటారు"

"మరేమైంది? "

"నావల్ల కాదు హరీ, ఇక్కడ నేనుండలేను. రాత్రంతా నిద్రలేదు నాకు. ఓవరాల్‌గా ఒక పదినిమిషాలేమైనా నిద్రపోయి వుంటాను"

"ఎందుకని, భయం వేసిందా? కొందరికి కొత్త చోటులో నిద్ర పట్టదులే"

బిందు క్లుప్తంగా రాత్రి తాను అనుభవించిన కష్టాన్నంతా చెప్పుకొచ్చింది.

"ఓస్... దీనికేనా ఇంత హంగామా? "

"పిల్లికి చెలగాటం, ఎలుకకి ప్రాణసంకటం అంటారు. నా తిప్పలు నీకు నవ్వు తెప్పిస్తున్నాయా? "

"బిందూ నువ్వు మరీ ప్రతిదాన్నీ భూతద్దంలోంచి చూస్తావు"

"నీలాగా నా కళ్లకి స్పెక్ట్స్ అయినా లేవు. ఇక మేగ్నిఫయింగ్ గ్లాసెస్ ఎక్కడివి? "

"మళ్లీ ఒప్పుకోవు కూడా. ఆ గదిలో గాలి లేదంటే ఇవాల్టినుండీ మా దగ్గర వసారాలోనే పడుకో. అక్కడ కూలర్ పెట్టినట్లు గాలొస్తోంది"

"అమ్మమ్మ ఆడపిల్లనని నాకోసం లోపల





పక్క వేస్తే వద్దని నేను వసారాలో పడు కుంటానని చెప్పాలా?"

"పాపం ఆవిడకేం తెలుసు? నువ్వు మగ రాయుడవని" అన్నాడు మెల్లగా.

"ఏంటీ?"

"ఏంలేదేంలేదు. నువ్వేం చెప్పొద్దు, నేనే చెప్తాను. వసారాలో వేసేట్లు ఒప్పిస్తాను. ఇక రెండో కంప్లయింట్ ఏమిటీ? నేచర్ కాల్... అదేమైనా ఇంటర్నేషనల్ సమస్యా? నాకర్థంకాదు. అమ్మమ్మని కొంచెం లేపి, తోడు రమ్మంటే రాదూ?"

"పడుకున్నావిడని లేపడం పద్ధతి కాదు"

"అలా అయితే ఫ్రీగా దొరికాయి కదాని డ్రమ్ముడు నీళ్లు తాగకు. గ్లాసుడో, అరగ్లాసుడో అయితే తెల్లవారేవరకూ తొందరపెట్టవు"

"దిసీజ్ టూ మచ్. నువ్వు చాలా డ్యామేజింగ్‌గా మాట్లాడుతున్నావు హరీ"

"అంతేలే. నిజం మాట్లాడితే నిష్ఠూరంగా ఉంటుంది. ఇక మూడో క్లిష్ట సమస్యేంటి? దోమలు...." అని ఒక నవ్వు నవ్వి "ఆఫ్టరాల్ సెంటీమీటర్లో సగం కూడా ఉండని దోమల గురించి కూడా అంత సీన్ క్రియేట్ చేయాలా?" అంటూ పెద్దగా నిట్టూర్చాడు.

బిందూకి మండుకొచ్చింది.

అతని వాక్యం సగంలో ఉండగానే చీరకి పెట్టిన సేఫ్టీ పిన్ను తీసింది. వాక్యం పూర్తి కాగానే దానితో అతని చేతిమీద కసుక్కున గుచ్చింది.

శ్రీహరి కెవ్వున అరిచాడు.

"నువ్వు మరీ హరీ. నలకంత విషయాన్ని తిరుపతి లడ్డూ అంత చేసి చూస్తావు" అంది గారాలు పోతున్నట్లు.

"ఛట్ ఊరుకో. అలా గుచ్చావేంటి? ఎంత నెప్పి పుట్టిందో తెలుసా?"

"అవునా పాపం? నీదైతే సుకుమారమైన శరీరం, ఇవతలి వాళ్లది కాదు, అంతేనా?"

"నేనలా అనలేదు"

"మరెలా అన్నావు. సెంటీమీటర్లో సగం ఉండే దోమలు కుడితే అంత తల్లడిల్లాలా అన్నావు. సూదిమొన ఎంత ఉందని? మిల్లీమీటర్ కూడా లేదే? మరి నువ్వేంటీ, గుండెల్లో గునపం దింపినట్లు చావు కేక పెట్టావు"

"నీతో అన్నీ ప్రమాదమే గానీ దోమా, సూదీ ఒకటా?"

"కానేకాదు. సూదివల్ల కొంచెం నొప్పి పుట్టడానికి మించి ఇంకేమీ హాని ఉండదు. కానీ దోమలు కుడితే కష్టపడి సంపాదించుకున్న రక్తాన్నంతా పీల్చేస్తాయి. అదనంగా మలేరియా లాంటి జబ్బులూ వస్తాయి"

"నీతో వేగలేను. మలేరియా చదివి... ఓహ్.. సారీ.. నా బుద్ధి కూడా సరిగ్గా పన్జేయడంలేదు గానీ ఎల్లెల్బీ చదివి లాయర్‌వయితే బాగుండేదిగా. సిటీలోనే లీడింగ్ లాయర్‌గా పేరొచ్చేది."

"నువ్వు సలహా ఇవ్వలేదని అలా చేయలేదు"

"ఇప్పటికైనా మించిపోయిందిలేదు. వెళ్లాక ఆ ప్రయత్నాలు మొదలెట్టు"

"ముందయితే నన్ను పంపు"

"ఏమర్రా పిల్లలూ, ముఖాలు కడుక్కున్నారా?" అంటూ వచ్చింది శారదమ్మ.

"నేను పేస్ట్ తెచ్చుకోవడం మర్చిపోయాను మామ్మా"

"అయితే ఏమయిందమ్మా? చక్కటి కచ్చికలున్నాయి, ఆ బూడిదతో కడుక్కో, శ్రేష్టం కూడా" అని ఆవిడ వెనక్కెళ్ళిపోయింది.

"రా, బిందూ"

"అలా అనకు. 'రాబందు' అన్నట్లుంటుంది"

"నువ్వు నా పాలిట రాబందువేగా" అని మెల్లగా గొణిగి "కచ్చికలంటే పిడకల్ని కాలిస్తే వచ్చేది. ఇండియన్ టూత్ పౌడరన్నమాట. భలే వుంటుందిలే. చిన్నప్పుడు ఎవరూ చూడకపోతే తినేసేవాణ్ణి. ఎంత రుచిగా వుంటుందనుకున్నావు"

"అలాంటి చెత్త తినబట్టేనా ఇలా తయార య్యావు? " అంటూ అతనితో కలిసి వెనక వైపుకి వెళ్ళింది.

ఇద్దరూ కచ్చికల బూడిదతో పళ్లు తోము కున్నారు.

బిందుకి అది సరికొత్త అనుభవం. ఇదేదో బాగానే వుందే అనుకుంది.

తర్వాత చిక్కటి పాలతో తయారుచేసిన కాఫీ గ్లాసులు అందించింది శారదమ్మ.

బిందూ రెండు చేతుల మధ్య గ్లాసుంచు కుని మెల్లగా తాగుతూ "మామ్మా, మీ చేతుల్లోనే ఏదో మేజిక్కున్నట్లుంది. మీరేం చేసినా దానికి గొప్ప రుచి వస్తోంది. ఇలాంటి కాఫీ ఇంతవరకూ తాగలేదు నేను" అంది.

"అందులో నా గొప్పతనం ఏదీ లేద మ్మాయి. కల్తీలేని చిక్కటి పాలుకదా, దానంతటదే రుచొస్తుంది. పైగా పట్నాల్లో గ్యాసుపొయ్యిలమీద వండుకుంటారుగా. కట్టెలపొయ్యిమీద చేసిందానికీ, గ్యాసు పొయ్యి వంటలకీ తేడా వుంటుంది"

బిందు ఇంకేం మాట్లాడకుండా కాఫీ తాగింది.

"తాతయ్యేడి అమ్మమ్మా? "

"ఆయనకి ఇంట్లో కాలు నిలవదు. ప్రొద్దున్నే కాఫీ తాగ్గానే బయటికెళ్ళి, భోజ నాల వేళకొచ్చి స్నానంచేసి, ఇంత తిని, కాసేపు కునుకుతీసి, మళ్ళీ పెత్తనాలకి బయల్దేరుతాడు. మళ్ళీ సందెదీపం పెట్టాక ఇల్లు చేరతాడు. అదీ ఆయన దినచర్య"

"ఇలా అంటున్నానని ఏమీ అనుకోవద్దు గానీ మామ్మా ఆయనకి అన్నీ అమర్చిపెట్ట డమే తప్ప ఆయన్తో నీకున్న అసోసియేషన్ అంటూ ఏమీ లేదన్నమాట"

శారదమ్మకి దాని భావం సరిగ్గా అర్థ మైందో లేదోగానీ ఎదురు చెప్పకుండా వూరుకుంది.

హరి మామూలుగా అయితే బిందుని ఏదోరకంగా బనాయించేవాడేగానీ, ఇందా కసలే హాటు హాటుగా వుంది. కదిలిస్తే వెళ్ళిపోతానని ఎక్కడంటుందోనని శ్రీహరి వూరుకున్నాడు.

కాఫీ తాగాక "నేనలా బయటికెళ్ళొస్తా" నని శ్రీహరి వెళ్ళిపోయాడు.

"ఏమ్మాయి, చెరువుగట్టుకి వెళ్ళొద్దామా? " అంది శారదమ్మ.

"చెరువు బాగుంటుందా మామ్మా, అయినా ఇప్పుడెందుకులే సాయంత్రం వెళ్దాం" అంది బిందు.

"ఓసి పిచ్చి తల్లీ, నీకు అర్థం కాలేదా? " అని నవ్వి,

'ఇందుకోసం' అన్నట్లు రెండు వేళ్లు పెట్టి చూపింది. అంతే. బిందు గుండెలో పెద్ద రాయే పడింది. అక్కడున్న తడికెల బాత్రూంలాంటిదే ఓ నాసిరకపు టాయ్‌లెట్ ఏ మూలో వుండివుంటుంది లెమ్మను కుంది. అదీ లేదా? ఇదేం పల్లెటూరు? ఇండియా వెనకబడి వుందని తెల్సుగానీ, మరీ ఇంత అధ్వాన్నంగా లేవలేని కుంటి స్థితిలో వుందని కల్లో కూడా అనుకోలేదు.

గుట్టుచప్పుడు కాకుండా పూర్తయ్యే పనికి అందరికీ తెలిసేట్లు ఊరేగింపులాగా వీర వి కారంగా చెంబు తీసుకుని వెళ్ళాలా? హే భగవాన్, తన పరువేం కావాలి? !

అసలీ హరి కూడా ఇంత కంట్రీబ్రూట్ ఏంటి? ఏదో రిమోట్ విలేజ్ అనేస్తే సరి పోతుందా? ఈ ఊరు ఇలా వుంటుందని ఒక టెన్‌పర్సెంట్ కూడా ఊహించలేకపో యింది. ఎలా ఊహిస్తుంది?

తను అప్పటివరకూ చూసిన పల్లెల్లో టాయ్‌లెట్లు, ట్యాప్‌వాటరూ, బస్ సౌక ర్యాలూ అన్నీ వున్నాయి. కాకపోతే సిటీ అంత ఎడ్వాన్స్‌డ్‌గా కాకుండా, షాపులూ గట్రా పెద్దగా లేకుండా, ఆవులు, కోళ్ల పెంపకాలతో పల్లెటూరి వాతావరణం కన్పించేది. అందుకే ఇలాంటి అడవిని ఎంత మాత్రం ఊహించలేకపోయింది.




"ఏంటమ్మాయి ఆలోచన్లో పడ్డావు? మీకు పట్నాల్లో అంటే ఇల్లుదాటి బయటి కెళ్ళాల్సిన అవసరం వుండదుగానీ, ఊళ్లల్లో తప్పదుగా. ఇందులో మొహమాట పడేందుకేముందని? అందరికీ ఆ అవసరం వుంటుందిగా" అంటూ నవ్వింది.

బిందూ ఆలోచించింది. ఇప్పుడు సిగ్గుపడి రానన్నా తర్వాతైనా తప్పదు. అప్పుడైతే ఆవిణ్ణి కదిలించి మరీ అడగాలి. ఆ వెళ్ళేదేదో ఇప్పుడే వెళ్తే కాస్తలో కాస్తయినా బెటర్‌గా వుంటుందనుకుంది.

మామ్మగారితో కలిసి చెరువుగట్టు కెళ్ళింది.

★ ★ ★

బిందూకీ ప్రతిరోజూ తల స్నానం చేయడం అలవాటు. ఎటూ బాయ్ కటింగే కనుక తల ఆరకపోవడం అనే సమస్య లేదు. పట్టులా సిల్కీగా వుండే జుట్టు షాంపుతో రుద్దడం వలన చక్కటి పరిమళాలు వెదజల్లుతూ ఆకర్షణీయంగా వుంటుంది. ఆమె ఫ్రెండ్స్ అందరూ "నీ జుట్టులో ఎంతో గ్లో వుంటుంది, బిందూ" అని మెచ్చుకుంటూ వుంటారు.

ఇప్పుడు తలంటుకుందామంటే షాంపూ లేదు. ఇక తప్పనిసరై మామూలు స్నానం చేసొచ్చింది. హెడ్ బాత్ కాకుంటే ఆమెకసలు స్నానం చేసినట్లే అన్పించదు. నిన్నంటే వచ్చేటప్పుడు తెల్లారుఝామున తలస్నానం చేయడాన సాయంత్రం మామూలు స్నానమైనా ఏమీ అన్పించలేదు. ఎంతో అసంతృప్తిగా వుండి వసారాలో బల్లమీద విసుగ్గా కూర్చుంది.

హరి కూడా అప్పటికే స్నానంచేసి ఆ పక్కన మంచంమీద వెల్లకిలా పడుకుని వున్నాడు.

"నామీద కోపమా బిందూ? "

"కోపం తెచ్చుకుని లాభంలేదు. సాయంత్రం నాలుగ్గంటలకి బస్సుంటుందిగా, దానికి వెళ్ళిపోతాను. కాస్త అక్కడి వరకూ వచ్చి నన్నెక్కించు"

"దిసీజ్ టూమచ్"

"నేను అనాల్సిన మాట నువ్వంటున్నావా? "

"నువ్వు మరీ చిన్నపిల్లలా చేస్తున్నావు"

"ఇది చైల్డిష్‌నెస్సవుతుందా? ఇక్కడుండటం నావల్లకాదు"

"అమ్మమ్మ నచ్చిందన్నావు, ఇంత మంచి వాళ్ళు ఎక్కడో తప్ప వుండరన్నావు. మరి ఆవిడ కోసమైనా కొంచెం సర్దుకోలేవా? నీకు మనుషులకంటే కంఫర్ట్స్ ముఖ్యమా? కంఫర్ట్సుదేముంది, కొంచెం డబ్బు ఖర్చుపెడ్తే అన్నిచోట్లా, అందరికీ దొరుకుతాయి. కానీ అమ్మమ్మలాంటి మనుషులు డబ్బుతో రారు బిందూ"

"అసలు నా మనసులో ఏమనుకున్నానో చెప్తే నువ్వు ఆశ్చర్యంతో కళ్ళు తేలేస్తావు హరీ"

"నేను కళ్ళుతేలేసేంత, లేదా తూలి పడేంత ఆలోచనేం చేశావేంటి? "

"మన పెళ్ళైటూ రెండుమూడు నెలల్లో జరుగుతుందిగా, ఆ తర్వాత వీళ్ళిద్దర్నీ మనతోనే వుంచుకుందామని..." అంటూ అతని ప్రశంసకోసం చూసింది.

హరి వ్యంగ్యంగా నవ్వాడు.

"ఈ ఆలోచనకి నువ్వెంతో మెచ్చుకుంటావనుకుంటే హేళనగా నవ్వుతున్నావా? "

హరి మూతి విరిచి వూరుకున్నాడు.

"కావడానికి నీకే అమ్మమ్మయినా నీకు అలాంటి ఆలోచన రాలేదు. నాకు వచ్చినందుకు సంతోషించక... అసలు నీ ఉద్దేశం ఏమిటి? "

"చిన్నచిన్న అసౌకర్యాలకే సర్దుకోలేని నువ్వు, రేపు వీళ్ళిద్దర్నీ భరిస్తావా? "

"నన్ను ఘోరంగా అవమానిస్తున్నావు హరీ. వాళ్ళకి ఎలాంటి ఇబ్బందీ కలక్కుండా చూసుకుంటాను తెలుసా? "

"అయినా నీమీద ఏ నమ్మకంతో వస్తారు వాళ్ళు? "




"అదేంటి? "

"వున్నమాటే అంటున్నాను. ఇన్నిన్ని సంవత్సరాలు ఈ ఊరికి అలవాటుపడ్డ వీళ్ళు ఒక్కరోజు తమతో వున్న అమ్మాయిని నమ్మి ఇల్లూ వాకిలీ వదిలేసుకుని వచ్చేస్తారా? "

"నువ్వు పెడసరంగా మాట్లాడకు హరీ. నేనేం వాళ్ళ ఆస్తులకోసం రమ్మనడంలేదు. మీ అమ్మమ్మా వాళ్ళకి పొలాలున్నాయో లేదో నాకు తెలీదు. ఒకవేళ వుంటే ఆ పొలాన్ని, ఈ ఇంటిని ఇంకెవరికన్నా ఇచ్చేయమను. కేవలం వాళ్ళని వాళ్ళుగా ప్రేమతో వచ్చివుండమనటం తప్పవుతుందా? "

"తప్పొప్పుల గురించి నేను మాట్లాడ్డం లేదు. నేనంటే నీకిష్టం. నాకోసం చుట్టంచూపుగా ఈ ఊరికి 'రావడానికే తెగ బతిమాలించుకున్నావు. సరే వచ్చావు. కానీ ఏదీ నీకు అనుకూలంగా లేదని నిమిషానికోసారి వెళ్తానని బెదిరిస్తున్నావు. కానీ వాళ్ళు మాత్రం దిక్కూదివాణం లేనట్లు నువ్వు పిలిచావు చాల్లెమ్మని వచ్చేస్తారా? "

"కానీ..."

"కానీ లేదు కంకర్రాయీ లేదు. నీ ఆర్గ్యుమెంట్ ఏమిటో నాకు తెల్సు. అన్ని వసతులకీ దూరంగా వుండే ఈ పల్లెటూరికంటే సిటీలో అయితే ప్రతిదీ చేయిపెట్టే అందేంతదూరంలో వుంటుంది కదాని. అంతేగా. కానీ అందరూ కంఫర్ట్స్ ఒక్కటే చూసుకోరు. ఎవరికి ఏంకావాలో ఏం చెప్పగలం? దానికి ఫిక్సేషన్ వుంటుందా? "

బిందు మాటలు రానట్లు చూస్తూండిపోయింది.

"సరే బిందూ, అంత ఫోర్స్డ్‌గా నిన్నిక్కడ ఇంకా వుండమనడం పద్ధతికాదు. సాయంత్రం బస్సెక్కిస్తాను. రెండున్నరకల్లా రెడీగా వుండు. నేనెటూ వన్ వీక్ సెలవు పెట్టాను గనుక వుంటాను" అన్నాడు.

ఆమె అలాగే కొయ్యబారినట్లు చూస్తూండటం చూసి,

"బయట తీగమీద ఆరేసిన టవల్ తెచ్చి సూట్‌కేస్‌లో పెట్టుకో. లేదంటే మర్చిపోతావు" అన్నాడు.

అప్పటివరకూ కూర్చున్నదల్లా ఒక పక్కకి ఒరిగి కళ్ళు మూసుకు పడుకుంది బిందు.

హరి మాటలు ఆమెని ఆలోచింపచేశాయి.

'అతనన్నదీ నిజమే గదా. తనతో వాళ్ళు రావాలంటే తను వాళ్ళకి నచ్చాలి. మనసులో చోటు సంపాదించాలి. ఏదీ లేకుండా వసతులుంటాయని అన్నీ వదులుకుని పరిగెట్టుకుంటూ వచ్చేస్తారా? అయినా అధునా తన వసతుల్లో పెరిగిన తనకి ఈ వాతావరణం ఇబ్బందిగా వుండి జీర్ణం కావడం లేదుగానీ వాళ్ళకిదే అలవాటైపోయిందిగా.

పైగా బాగా అలావాటైందాన్ని వదులుకుని వలసవెళ్ళడానికి ఎంతో ఆలోచిస్తారు? హైదరాబాదుకంటే ఏ అమెరికాలోనో అయితే మరింత సుఖసౌఖ్యాలుంటాయి. కరప్షన్లూ గట్రా లేకుండా పనులన్నీ సవ్యంగా, సక్రమంగా జరిగిపోయే వీలుంటుంది. అలాని తను తన బ్యాక్ గ్రౌండ్‌ని వదులుకుని, ఇష్టాయిష్టాలేం ఆలోచించకుండా ఒక గ్రీన్ కార్డ్ హోల్డర్ మొగుడిగా దొరికితే వెళ్ళిపోతుందా?

ఆలోచనల్లు అలా సాగుతోంటే నిద్రపట్టింది బిందుకి. శారదమ్మ వచ్చి లేపితేగానీ మెలకువ రాలేదు.

"అమ్మాయ్, ఈ వేళప్పుడు పడుకున్నావే? " అంది.

"రాత్రి నిద్రపోలేదట అమ్మమ్మా" అంటూ రెండు ముక్కల్లో విషయం చెప్పాడు హరి.

బిందుకి సిగ్గుగా అన్పించింది.

శారదమ్మ నవ్వుతూ "నన్ను లేపకూడదూ? దానిక్కూడా మొహమాటమేనా? " అని "పదండి, భోజనాలు చేద్దురుగాని, మళ్ళీ మీ తాతయ్యొచ్చే వేళయింది" అంది.



ఇద్దరూ లేచారు.

"అన్నం తినగానే రెడీ అవ్వు" మెల్లగా అన్నాడు హరి.

"వద్దు, నేనింకో నాలుగురోజులుంటాను" అని కళ్లెగరేసి నవ్వింది బిందు.

హరి ఇంకేం మాట్లాడలేదు.

ఆవేళ పెండలం వేపుడు, సొరకాయ పులుసు, కొత్తిమీర పచ్చడి చేసింది శారదమ్మ.

ఇద్దరూ లొట్టలేస్తూ తిన్నారు. తనకి ఇష్టమని చెప్పినందుకు పనిమాలా కొత్తిమీర పచ్చడి చేసినందుకు మరీమరీ కృతజ్ఞతలు చెప్పింది బిందు. ఆవిడ చూపుతోన్న అభిమానానికి ఏదీ సాటిరాదు అనుకుంది.

"సారీ మామ్మగారూ, మీకు వంటలో సాయం చేయాలని ఎంతగానో అనుకున్నాను. కానీ రాత్రి అస్సలు నిద్రలేనందున పొద్దుటంతా అనీజీగా వుంది. ఆ తర్వాత నిద్రపట్టేసింది. సాయంత్రం మీరు కూర్చుని ఏది ఎలా చేయాలో చెప్పండి, మొత్తం నేనే చేస్తాను" అంది.

"జాగ్రత్త అమ్మమ్మా, ఆ వంటకాలు తిన్నాక మనం మనంగా వుంటామో లేదో డౌటే" అన్నాడు హరి. ఇద్దరి భోజనాలు ముగిసి చేతులు కడుక్కునేసరికి వీరయ్య కట్టెలు కొట్టేందుకు రాజు అనే వ్యక్తిని వెంటబెట్టుకొచ్చాడు.

శారదమ్మ వెళ్ళి, ఎన్ని పేళ్లేయాలో, ఎంత డబ్బివ్వాలో మాట్లాడింది.

జామచెట్టు పక్కగా పడేసి వున్న తుమ్మమొద్దుల్ని గొడ్డలితో నరకడం మొదలుపెట్టాడు రాజు.

బిందు వసారాలో కూర్చుని అతని పని తీరుని గమనించసాగింది. నల్లగా వుండి, కండలు తీరిన రాజు కట్టుకున్న లుంగీని సగానికి ఎగదోపాడు. పైన షర్టు కాదుగదా బనీనైనాలేదు. చెమటలు ధారాళంగా కారుతున్నాయి. అయినా లెక్కచేయకుండా ఒక్కో తుమ్మమొద్దునీ అనేక ముక్కలుగా చీల్చేస్తున్నాడు. ఎంతో కష్టమైన ఆ పనిని రాజు సునాయాసంగా చేసేస్తున్నాడు. అవి ముక్కలు చెక్కలవుతూ, ఎగిరెగిరి అల్లంత దూరంలో పడ్తోంటే బిందు కళ్ళింత చేసుకుని చూస్తోంది. చిన్నచిన్న నలుసు గాలీ ధూళీలా పోయి ఆమడదూరాన పడ్తోంది. 'అమ్మో అలాంటివి అతని కళ్లలో పడితే ఇంకేమైనా వుందా? ఎంత ప్రమాదం, కన్నే పోదూ' అనుకుంది.

"ఆ కట్టెలు కొట్టినందుకు అతనికి ఎంతిస్తారు మామ్మా" అనడిగింది బిందు.

"ఇరవై రూపాయలమ్మా. అసలు పది రూపాయలకే కొట్టే వాళ్ళుగానీ ప్రజలు తెలివిమీరిపోతున్నారుగా. ఇరవై ఇస్తేగానీ వల్లకాదన్నాడు. వేరేవాళ్ళకంటే ఈ రాజు మంచి పనివాడు. ఏదీ చెప్పించుకోడు, అందుకే సరే అన్నాను"

"అంత పనిచేస్తే ఇరవై రూపాయలేనా? అన్యాయం మామ్మా. ఇరవై రూపాయలకి ఈ రోజుల్లో ఏమొస్తుందని? "

శారదమ్మ నవ్వి "అందరూ ఇచ్చిందానికంటే ఒక రూపాయి ఎక్కువే ఇస్తానుగానీ తక్కువివ్వనమ్మా" అంది.

"కానీ చాలా తక్కువ మామ్మా"

"అన్నం కూడా పెడ్తానన్నాను. పనయ్యాక భోజనం చేసి వెళ్తాడు"

బిందూ రెట్టించకుండా వూరుకుంది.

శారదమ్మ భర్తకి భోజనం పెట్టేందుకు వెళ్ళింది.

హరి కళ్ళు మూసుకుని పడుకున్నాడు.

బిందు తన బ్యాగ్‌లోంచి డబ్బు తీసింది. ఒక వంద నోటు చేతిలోకి తీసుకుందిగానీ ఒకవేళ తెలిస్తే మామ్మగారికి మరీ కోపం వస్తుందేమోనని సంశయించి యాభైనోటు తీసుకుని జామచెట్టు దగ్గరికెళ్ళింది.

రాజు అప్పుడే కట్టెలు కొట్టడం ఆపి బొడ్లోంచి బీడీ తీస్తున్నాడు.

ఒక మంచి పద్యం వినిపిస్తే రాయలు





తన మెడలోంచి హారం తీసి ఆ కవికి ఇచ్చే వాడట. అంత ఘనమైంది కాకున్నా అలాంటి అభిమానంతో యాభైనోటుని రాజుకి అందించి వెనక్కొచ్చేసింది బిందు.

రాజు ఆమెని చిత్రంగా చూశాడు.

అదామె పట్టించుకోలేదు. వెనక్కొచ్చేసి, యథాస్థానంలో కూర్చుంది.

భోజనం చేసిన పెద్దాయన అక్కడికే వస్తాడని స్ఫురించి గబుక్కున లేచి చుట్టూ తిరిగివెళ్ళి రాత్రి పడుకున్న గదిలోకెళ్ళి తన కోసం వేసిన మంచంమీద పడుకుంది.

రాత్రంత ఉక్కపోతలేదు. ఫ్యాన్ వుంటే బాగుండేది కానీ లేకున్నా మరీ ఘోరంగా అయితే లేదు. నిన్నటంత ఎండలేదు, పైగా చెట్ల ఆకులు కొంచెం కదుల్తున్నాయి.

'అవునూ తనేంటి, పదార్థాలు బాగున్నా యని పీకల్దాగా లాగించింది? పొద్దునే కదా అనుకుంది వీలైనంతవరకూ ఏమీ తినొద్దు, అప్పుడు రేపు ఉదయం చెరువుగ ట్టుకి పోవాల్సిన బాధ తప్పుతుంది అని. అయ్యిందేదో అయింది. ఇక సాయంత్రంగానీ రాత్రిగ్గానీ ఏమీ తినకూ డదు. హరికి, మామ్మగారికి కూడా అను మానం రాకుండా ఒంట్లో బాగాలేదు, సహిం చడంలేదు అని చెప్పాలి.

ఈ హిట్లర్ త్వరగా పడుకుంటే బాగుండు, అప్పుడు మామ్మతో కాసేపు మాట్లాడే అవకాశం దొరుకుతుంది. అసలు మామ్మ ఈ మహానుభావుణ్ణి ఎలా భరి స్తోందో? శ్రీదేవికి బోనీకపూర్ దొరికినట్లు ఆవిడకి ఈ తాతగారు దొరికారు. ఇదేం కాంబినేషన్? ఒక నవ్వుల దేవికి సీరియస్ మొగుడు. ఒక శాంతమూర్తికి అత్యంత ఉష్ణస్వభావుడు దొరకడంలాంటివి లోక సహజాలు కాబోలు.

దేవుడికస్సలు బుద్ధిలేదు. లోకంలో ఎక్కువ కపుల్స్ ఇలాగే వుంటారుగా. తన తల్లిదండ్రులు మాత్రం ఎలా వున్నారు? వాళ్లేమైనా చూడచక్కని జంటా? మేడ్ఫర్ ఈచదర్ అన్నట్లుంటారా? అమ్మ ఎంత భయపడ్తుందని? తనే విసుక్కుంటుంది. "ఎందుకమ్మా అంత భయం? మెత్తగా వుంటే మొట్టబుద్ధేస్తుందని నువ్వు భయప డినకొద్దీ ఆయన ఇంకా భయపెడ్తాడు. ఒక రకంగా నువ్వే ఆయన్ని అలా తయారుచే స్తున్నావు. కూరలో రవంత ఉప్పెక్కువైతే భయం. ఎవరింటికైనా ఏ ఫంక్షన్కో వెళ్ళా లంటే భయం, ఏమిటిదంతా? " అని ఎన్ని సార్లు క్లాస్ తీసుకుంటుందనీ.

అయినా అమ్మ తనమాట పాటించదు. భయభక్తుల్తో అణగిమణగి వుండేందుకే అలవాటైపోయింది.

"వైఫ్ అండ్ హజ్బెండ్ అంటే మంచి ఫ్రెండ్స్‌లా వుండాలమ్మా. మాస్టర్ అండ్ స్లేవ్‌లా కాదు" అంది తనోసారి తల్లి స్థితికి బాధపడ్తూ.

"నాదేదో ఐపోయింది. ఈ వయసులో కొత్తగా ఏంమార్తాను? నువ్వూ, హరీ ఫ్రెండ్స్‌లానే వుండండి" అంది అమ్మ నిండు మనసుతో.

"నేనెటూ అలాగే వుంటాను. హరి ఏమైనా పొగరెక్కి మొగుడి వేషం వేయ బోతే ఎలా బుద్ధిచెప్పాలో కూడా నాకు తెలుసు"

"అదేంటీ? మొగుడి వేషం ఏమిటి? మొగుడే కదా అవుతాడు"

"మామూలుగా మొగుడు అంటే పెత్తనం చేసేవాడిగా చెలామణీ అవుతున్నాడుగా. అలాంటి లక్షణాల్లేకుండా ఇప్పుడున్నట్లే ఫ్యూచర్లో కూడా వున్నాడో వెల్ అండ్ గుడ్. లేదూ తోక జాడించాడో..." అంటూ తనేదో అనబోతోంటే.

తల్లి అడ్డుకుని, "నా ముందు అంటే అన్నావుగానీ అందరిముందూ ఇలా మాట్లా డకు. భార్యెప్పుడూ భర్త గురించి చులక నగా మాట్లాడకూడదు" అంది.

"ఇది చులకన ఎంతమాత్రం కాదమ్మా.

నేను అనిత గురించో, అచల గురించో ఇలాగే సరదాగా మాట్లాడనా? వాళ్ళు మాత్రం నన్ను ఆటలు పట్టించరా? వాళ్ళతో వున్నంత చనువు, స్నేహం హరితో నాకు లేకపోతే ఇక మేం కలిసుండటంలో అర్థమేముంది? "

తల్లి తననే చూడసాగింది.

"మా ఇద్దరికీ ఒకరిపట్ల ఒకరికి ప్రేమ గౌరవం వున్నాయి. ఇద్దర్లో ఎవరు తప్పో, పొరపాటో చేసినా మందలించే లేదా, ఆట పట్టించే చనువు, స్నేహం కూడా వున్నాయి" అంది తనెంతో స్థిరంగా.

"ఏయ్ బిందూ, ఏమిటి కళ్ళు తెరుచుకునే కలలుకంటున్నావు? " అంటూ హరి అక్కడి కొచ్చేవరకూ ఆమె అలా ఏదేదో ఆలోచనల్లో వుంది.

"ఏంలేదు, అమ్మ గుర్తొచ్చింది"

"హు... ఏం ఆడపిల్లల్రా బాబూ, మరీ ఇంత సెంటిమెంటల్ ఫూల్సా" అన్నాడు కావాలని మెంటల్‌ని విడగొట్టి నవ్వుతూ.

"షటప్, అమ్మ గుర్తొస్తే తప్పా? "

"తప్పనికాదు, ఒక్కరోజుకే బెంగా అని"

"నిన్నట్నుండీ వున్నానా, పోయానా అని ఒక్క ఫోనయినా చేయలేదు చూడు అమ్మ"

"హ్హాహ్హా...నేనే సెల్ ఆఫ్ చేశాను? "

"నీకేం పిచ్చా? ఎందుకు చేశావు? "

"సెల్ వీకయితే ఇక్కడ ఛార్జ్ చేయడానికి కుదరదుగా. అత్యవసరానికి వుంటుంది లెమ్మని"

బిందు సైలెంట్‌గా తల పట్టుకుంది.

"మళ్ళీ మళ్ళీ ఈ ఊరిని తిట్టకులేగాని అన్నట్లు పేస్ట్ లేదన్నావుగా. ఇంకేం కావాలో లిస్ట్ రాసియ్యి"

"కరెంట్‌లేదు గనుక మస్కిటో మ్యాట్స్ పెట్టడం కుదర్దు. టార్టాయిస్ అయితే వెలి గించుకోవచ్చు షాంపూ లేదు. ఇంకా... అయినా ఎక్కణ్ణించి తెస్తావు? "

"నిన్న మనం వచ్చిన చింతపల్లి గేట్ వరకూ నడిచెళ్ళి బస్సెక్కి విజయవాడలో తెద్దామని"

"అంతదూరం నడిచెళ్తావా? వద్దులే ఎలా గోలా సర్దుకుంటాను" అనేసింది బిందు.



ఫోన్ రింగవుతోన్న శబ్దం విన్పించి, పరుగులాంటి నడకతో వెళ్ళి చెవి దగ్గర పెట్టుకుంది బిందు.

"హలో, అమ్మా" అంది ఆనందంగా.

"బొత్తిగా బుద్ధిలేదటే బిందూ? వెళ్ళగానే సేఫ్‌గా చేరానని చెప్పాల్సిందిపోయి నేను చేస్తే కూడా మోగకుండా సెల్ ఆఫ్‌లో పెట్టి కూర్చున్నావు? " అంది వసుమతి నిష్ఠూరంగా.

"సారీ అమ్మా నేను ఆఫ్ చేయలేదు, హరి చేశాడు"

"అదేం? " ఆమె గొంతులో కోపం ధ్వనించింది.

"అపార్థం చేసుకోకమ్మా"

"ఏం అపార్థం చేసుకోవద్దు? అసలు ఆఫ్ చేయడమెందుకు? "

"ఎందుకంటే ఇదొక పెక్యూలియర్ ప్లేస్. ఈ మామ్మగారింట్లో ఎలక్ట్రిసిటీలేదు. సెల్ వీకయితే ఛార్జ్ చేయడానికి ప్రొవిజన్

లేదని ఆఫ్ చేశాడట. ఇందాకే నాకా సంగతి తెల్సి ఆన్ చేశాను"

వసుమతి ఒక నిట్టూర్పు విడిచి "ఇక్కడ నేనేమో భయపడి ఛస్తున్నాను. ముక్కూ ముఖం తెలీని కొత్త చోటికి వెళ్ళావు. ఎలా వున్నావో, వాళ్ళు నిన్నెలా రిసీవ్ చేసుకున్నారోనని తెగ ఆందోళన పడ్తున్నాను"

"వివరాలన్నీ వచ్చాక చెప్తానుగానీ హరీ వాళ్ళ అమ్మమ్మ ఎంత మంచిదో, ఆవిడ నాకెంత నచ్చేసిందో చెప్తూపోయానంటే ఈనెల మన టెలిఫోన్ బిల్ వేలల్లో వస్తుంది. అందుకని అవన్నీ వచ్చాక తీరిగ్గా చెప్తాను. ఇక వుండనా మరి? "

"వుండుండు, ఫోన్ పెట్టేయకు. నువ్వేమో అచల అన్న పెళ్ళికెళ్తున్నానని చెప్పి వచ్చావు. నిన్నేమో అచల మనింటికి ఫోన్‌చేసి నిన్నడిగింది. ఆ కాల్ రిసీవ్ చేసుకుంది మీ నాన్నే. అదేంటి, మీతోబాటు బిందూ బయల్దేరలేదా అని ఈయన అడిగితే ఎక్కణ్ణించి బైల్దేరడం అని ఆ పిల్ల... ఇద్దరూ ఆశ్చర్య మహాశ్చర్యాల్లో మునిగిపోయారు. నేనేదో కాస్త తెలివైందాన్ని కాబట్టి ఆయన ఆ ఫోన్ కట్ చేసేలోపే ఏం చెప్పాలో గబగబా ఆలోచించుకుని వుంచుకున్నాను"

బిందు నవ్వి "అంత తెలివిగా ఏంచెప్పావేంటి? " అంది.

"బిందు వెళ్ళింది అచలా వాళ్ళ అన్న పెళ్ళిక్కాదు అనితా వాళ్ళ అన్న పెళ్ళికి. బహుశా నేనేమైనా పొరపాటుగా చెప్పానేమో అన్నాను"

"నయం, మళ్ళీ అనిత ఫోన్ చేసి నన్నడగలేదు కదా? "

"ఆ భయంతోనే హడలిచచ్చాను. ఫోన్ మోగినపుడల్లా అనితే చేసిందో లేక అదీ నిజం కాదని తెలిసిపోయే ఫోనేమో అని మీ నాన్న మెలకువగా వున్నంతసేపూ గుండె గాబరాగానే వుంది. ఆయనక్కాస్త కునుకు పట్టగానే అనితా వాళ్ళింటికి ఫోన్ చేస్తే అది కాస్తా డెడ్ అయివుంది. నీకెన్ని సార్లు చేసినా ఆఫ్‌లోనే వుంది"

బిందూకి నవ్వు ఆగలేదు.

"నీకేం తల్లీ, హాయిగా నవ్వుతూ వుండు. ఎక్కడేం తేడా వచ్చినా టెన్షన్ పడాల్సింది నేను. ఇంతకీ ఎప్పుడొస్తున్నావు? "

"ఇంకో మూడ్రోజులుండి వస్తానమ్మా"

"జాగ్రత్తగా వుండు"

"అలాగే అమ్మా"

"మీ నాన్న ఫోన్ చేస్తే జాగ్రత్తగా మాట్లాడు. ఆయనేమన్నా కోపంగా మాట్లాడినా నువ్వు తిక్క సమాధానాలిచ్చి బీపీ పెంచకు, నా చావుకొస్తుంది"

"సారీ అమ్మా. నాన్నమ్మ 'సుబ్బిపెళ్ళి వెంకి చావుకి వచ్చింది' అంటుండేది. నేను హరి వాళ్ళ అమ్మమ్మ ఊరికి రావడం నీకు తల్నొప్పి తెచ్చిపెట్టినట్లుంది. సర్లేమ్మా ఇంకోసారి ఇలా చేయన్లే. ఈసారికి అమ్మ తాంజన్ మహాస్ట్రాంగ్ వాడు. అంతకంటే చేయగల్గింది లేదుగా"

"అలాగేలే. నీకోసం ఒక బర్నాల్ ఆయింట్‌మెంట్ కూడా రెడీగా వుంచుతాను"

"ఎందుకమ్మా? "

"ఎందుకేంటి? కాల్చి వాతలు పెట్టాక రాసేందుకు"

"వామ్మో, నీకింత సెన్సాఫ్ హ్యూమరా? సర్లే ఫోన్ పెట్టెయ్. బిల్ పెరిగితే నాన్న పల్స్ రేట్ పెరిగి పర్స్ బరువు తగ్గుతుంది"

"సరే, వుంటాను, జాగ్రత్త" అని ఫోన్ పెట్టేసింది వసుమతి.

★ ★ ★

శ్రీహరి ఫ్లూటుతో కుస్తీ పడుతున్నాడు. రకరకాల పాటలు ట్రై చేస్తున్నాడుగానీ ఒక్కటీ ట్యూన్ సరిగా రావడంలేదు. కొంత సేపు అతన్నే గమనించిన బిందు మూతి బిగించి, తల అడ్డంగా ఊపి "ఇంతకీ ఇదే పాట నాయనా? " అంది.

శ్రీహరి నోట్లోంచి వేణువు తీసి, చేత్తో



పట్టుకుని,

"ఈ పాట కూడా తెలీదా? 'హమే తుమ్‌సే ప్యార్ కితనా యె హమ్ నహీ జాన్‌తే/మగర్ జీ నహీసక్‌తే తుమ్‌హారే బినా...' అదన్నమాట" అన్నాడు.

"మా నాయనే! అంత అద్భుతమైన పాటని ఇంత నిర్దయగా ఖూనీ చేస్తు న్నావా? " అంది.

"కళాపోషణ చేస్తోంటే ఖూనీ చేస్తున్నా నంటావా? "

"చేసింది చాలుగానీ కాసేపలా పొలాల్లో తిరిగొద్దామా? "

హరి ఆమెని ఎగాదిగా చూసి "ఏంటి మనిద్దరమా? " అన్నాడు.

"ఏం మనకి బాడీగార్డ్స్ కావాలా? "

"బిందూ, ఇది తెలుగు సినిమా కాదు, నిజజీవితం"

"నేనేం మనిద్దరం కలిసి చేల గట్లమీద డ్యూయెట్లు పాడదామనలేదే" ఉక్రోషంగా అంది బిందు.

"అంతక్కర్లేదు, ఈ పల్లెటూళ్ళో మని ద్దరం కలిసి నడిచినా చెవులు కొరుక్కుం టారు"

"చెవులూ చేతులూ కొరుక్కోవడమేంటి అసహ్యంగా? చాక్లెట్లో బిస్కెట్లో తినక? !"

"జోకా? "

"కాదు, వాళ్ళకి క్రాకా అని నా డౌటు"

"ఏమనుకున్నా లాభంలేదు. ఊళ్లల్లో జనాలు అలాగే వుంటారు"

"ఆ లెక్కన పాతతరం వాళ్ళయినా మామ్మా, తాతయ్యా మేలన్నమాట, మనని తప్పు పట్టలేదు"

హరి అవునన్నట్లు తల పంకించాడు.

"సరే, నువ్వు శ్రీలక్ష్మి లెవెల్లో ప్రాక్టీస్ చేసుకో. హైదరాబాదు వెళ్ళాక కచేరీ చేద్దు గాని. నేను అమ్మమ్మతో కలిసి అలా తిరి గొస్తాను" అంటూ వెనుదిరిగింది.

బిందు వెళ్ళగానే "ఖుషీ ఖుషీగా నవ్వుతూ/ చలాకి మాటలు రువ్వుతూ/హు షారు గొలిపే వెందుకే /నిషా కనులదానా" అనే పాటని ఫ్లూటుతో ప్రయత్నిస్తోంటే అదొక మహావిషాదాన్ని సూచించే ధ్వనిగా రాసాగింది.

బిందు తల అడ్డంగా ఊపి, నుదుటిమీద సున్నితంగా కొట్టుకుని శారదమ్మని వెతు క్కుంటూ వెళ్ళింది.

శారదమ్మ జాడీలో వున్న చల్లమిరపకా యలు తీసి, నులకమంచం మీదున్న పళ్ళెంలో వేస్తోంది.

మజ్జిగలో మిరపకాయలు ఊరిన వాసన కమ్మగా వుంది.

"ఇవి ఎండటానికి ఎన్నిరోజులు పడ్తుంది మామ్మా? "

"ఎండని బట్టి వుంటుందమ్మా"

"ఏమనుకోకపోతే ఆ మజ్జిగ కొన్ని చుక్కలు నా చేతిలో పోయవా"

"ఓసి పిచ్చితల్లీ" అంటూ కొన్ని మజ్జిగ ఆమె అరచేతిలో పోసి "మీ అత్తయ్య కూడా ఇలాగే అడిగేది. దానికి పచ్చడి కోసం ఎండబెట్టే టొమేటో ముక్కలూ, మాగాయ ముక్కలూ కూడా ఇష్టం" అంటూ నవ్వింది.

"అన్నట్లు మామ్మా, నీకు నడిచే ఓపి కుంటే అలా పొలంవరకూ వెళ్ళొద్దామా? "

"కాస్త ఎండ తగ్గాక వెళ్దాంలే"

"థాంక్యూ మామ్మా, నేను చేయి కడు క్కుని వసారాలో కూర్చుంటాను"

"పదమ్మా, నేనూ అక్కడికే వస్తాను" అంది.

"ఆధా హై చంద్రమా రాత్ ఆధీ
ములాకాత్ ఆధీ
రెహన జాయే తేరీమేరీ బాత్ ఆధీ..."

అని హమ్‌చేస్తూ తొట్టి దగ్గర చేయి కడు క్కుని వసారాలో కెళ్ళింది.

తాతగారు నిద్రపోతున్నారు.

బల్లమీద ఒక పక్కకి ఒత్తిగిలి పడుకుని 'రాయినైనా కాకపోతిని/రామపాదము సోక గా/బోయనైనా కాకపోతిని/పుణ్యచరితము పాడగా' అని పాడుకుంది.




అంతలోనే "వాక్‌మనైనా తేకపోతిని/బుద్ధిజ్ఞానం లేకను వూ..." అని పేరడీ కట్టబోతే కుదర్లేదు.

ఏమీ తోచకపోయేసరికి కళ్ళు మూతలు పడ్డాయి. కొద్దిసేపటికి శారదమ్మ లేపి జున్ను పెట్టింది.

"బాగుంది మామ్మా" అంటూ మక్కువగా తింది.

"పొలానికి వెళ్దామన్నావుగా పద. వచ్చినాక టీ పెట్టుకు తాగుదాం" అంది శారదమ్మ.

బిందు చెంగున లేచి చెప్పులేసుకుంది.

ఇద్దరూ బయల్దేరారు.

కొద్దిసేపట్లో ఇద్దరూ పొలంగట్టు చేరుకున్నారు.

గట్టుమీద నడుస్తోంటే చల్లగా, హాయిగా వుంది.

రైతులు తమ అభిరుచి, అవసరాన్ని బట్టి రోడ్డువైపున వుండే గట్టుమీద బంతిలాంటి పూలమొక్కల్ని, గోంగూర, తోటకూర మొక్కల్ని పెంచుతున్నారు.

వాటిని చూస్తూ, శారదమ్మతో ఏవేవో కబుర్లు చెప్తూ నడుస్తోంది బిందు. అలా చాలా దూరం నడిచాక ఒక పెద్ద మర్రి చెట్టు వచ్చింది.

"ఇక్కడ కాసేపు కూర్చుందామా మామ్మా"

"దాందేముంది, కూర్చుందాం"

"మామ్మా, ఈ ఊర్లో మీకెలా తోస్తుందసలు? "

శారదమ్మ చిన్నగా నవ్వి వూరుకుంది.

"ఈ ఊర్లో కనుక నేను పుట్టి వుంటే... అమ్మో ఊహించడానికే భయంగా వుంది"

"భర్తృహరి సుభాషితం ఒకటుంది. ఒక నీటిచుక్క తామరాకు మీద పడితే ముత్యంలా ప్రకాశిస్తుంది. అదేచుక్క ముత్యపు చిప్పలో పడితే ముత్యమే అవుతుంది. ఒకవేళ ఆ నీటిచుక్క నిప్పుమీద పడితే ఆవిరైపోతుంది..."

"...ఏ మూసీ మురుక్కాలువ మీదో పడితే పనికిరాకుండా పోతుందికదూ" అంది బిందు నవ్వుతూ.

"ఏదీ మన చేతిలో వుండదు కదమ్మా. జరగాల్సిందంతా ముందే రాసి పెట్టాడు పైవాడు"

బిందూకి కర్మ సిద్ధాంతంమీద నమ్మకమూ లేదు, అపనమ్మకమూ లేదు.

ఆ తర్వాత శారదమ్మ విధి బలీయం అనేందుకు నిదర్శనంగా ఏవేవో చెప్తోంటే వింటూ కూర్చుంది.

కొంతసేపు అలా గడిచేసరికి ఏ సూచనా లేకుండా పెద్ద పెద్ద చినుకులతో వర్షం మొదలై పెద్దపెట్టున కురిసింది.

చెట్టు కొమ్మలతో విస్తరించి వుండటాన ఇద్దరూ పెద్దగా తడవలేదు.

"అయ్యో, చల్ల మిరపకాయలు బొత్తిగా తడిచిపోతాయి" అంది శారదమ్మ విలవిల్లాడ్తూ.

"సారీ మామ్మా, నేనే నిన్ను తీసుకొచ్చాను"

"బిళ్ళబీటున ఈ వర్షమొచ్చి పడ్తుందని నీకు మాత్రం ఏం తెలుసు? అందుకే అంటారు వాన రాకడ, ప్రాణం పోకడ తెలీదని"

వర్షం తగ్గాక ఇద్దరూ కాళ్ళకి బుద్ధి చెప్పారు.

నల్లరేగడి మట్టి తడిస్తే చాలు బంకగా తయారవుతుంది. అడుగు తీసి అడుగు వేస్తే పాదానికంతా మట్టి పట్టుకుని బూటులా వస్తోంది. అప్పటికీ ఇద్దరూ చెప్పులు తీసి చేత్తో పట్టుకున్నా నడక మహాకష్టంగా వుంది.

శారదమ్మ ఎలాగో నడుస్తోందిగానీ బిందూకీ ఏడుపొక్కటే తక్కువ.

సగందారిలో వుండగా మళ్ళీ జల్లు కురిసి ఇద్దరూ తడిచిపోయారు.

వీళ్ళ వాలకం చూసి హరి పకపకా నవ్వాడు.

చెరో బిందెడు నీళ్ళతో కాళ్ళ బురద వది

లించుకున్నారు.

నులకమంచం లేకపోవడం చూసి శారదమ్మ చింతంతా మాయమై కొండంత సంతోషపడుతూ,

"చల్ల మిరపకాయలు లోపల పెట్టావా హరీ" అంది.

"అవునమ్మమ్మా. ముందు మీరిద్దరూ తలలు తుడుచుకోండి"

"అన్నట్లు కట్టెపుల్లలు కూడా లోపల పడేశావా? "

"లేదమ్మమ్మా, వాటిని నేను గమనించలేదు"

"అయ్యో, పూర్తిగా తడిచిపోయాయిగా, ఈ పూట వంటచేయడం ఎలా? "

"చావిట్లో పొడికట్టెల్లేవా అమ్మమ్మా? "

"లేవురా. బాగా ఎండగా వుందికదా వున్న పచ్చి అంతా పోతుందని బయటే వుంచాను" మరోసారి ఆవిడ ప్రాణం కొట్టుకుంది.

బిందు బేలగా చూస్తూ "సారీ మామ్మా" అంది.

"నీదేముంది? ఇలాంటివి మాకు మామూలే" అంటూ కొన్ని సన్నటి పేళ్ళు తీసుకుని వంటింట్లోకి వెళ్ళింది శారదమ్మ.

"హలో హరి బిందూ"

"ఏంటీ? "

"హరి యొక్క బిందు- హరి బిందు. షష్టీతతప్పురుష సమాసం"

"ఏం సమాసమో, నాకు సమోసా తినాలన్పిస్తోంది"

"హైదరాబాదు వెళ్ళేవరకూ అలాంటివేవీ కలవరించకు. అన్నట్లు బాగా ఎంజాయ్ చేశావా చేలల్లో షికారు? "

"ఎంజోయ్ చేశానో, ఏట్లో కాలేశానో నీకెందుకు? నువ్వ యితేరాలేదుగా? "అని వంటింటి వైపు నడిచింది. శ్రీహరి ఆమెని అనుసరించాడు.

తడిచిన పుల్లలతో పొయ్యి రాజేయడం కష్టంగా వుంది.

శారదమ్మ ఎంత ఊదినా ఫలితం లేక కళ్ళు తుడుచుకుంది.

"నేను ఊదుతాను. ఇటివ్వు మామ్మా" అంటూ పొయ్యూదే గొట్టం అందుకుంది బిందు.

బుగ్గలు నొప్పి పుట్టేట్లు ఊదితే విపరీతమైన పొగ వచ్చిందేగానీ మంట రావడం లేదు.

ఆ పొగకి కళ్లలోంచి నీళ్ళు కారుతూ ఊపిరి సలపనట్లై గొట్టం అక్కడ పెట్టేసి ఇవతలికొచ్చింది బిందు.

శ్రీహరి ప్రయత్నించి విఫలుడయ్యాడు.

అతిప్రయాసమీద శారదమ్మే విజయం సాధించి టీ పెట్టింది.

"ఇంత కష్టం ఎలా పడ్తున్నారు మామ్మా మీరంతా? అన్ని సౌకర్యాలూ వుంటేనే వంట చేయడం అంటే మహా విసుగు. అలాంటిది..." అంది బిందూ బాధగా.

"ఏం చేస్తామమ్మా? " అంది శారదమ్మ నిర్లిప్తంగా.

★ ★ ★

శారదమ్మ పశువుల కొట్టం దగ్గర వుండటం చూసి "ఇంత మధ్యాహ్నంపూట ఏంచేస్తున్నావు మామ్మా? కాసేపు పడుకోకుండా? " అంటూ వచ్చింది బిందూ.

"ఊళ్లలో వుండేవాళ్ళకి ఎప్పుడూ ఏవో పనులు వుంటూనే వుంటాయమ్మా. మీకంటే పట్నాల్లో గ్యాసు పొయ్యిలూ అవీ వుంటాయి. చక్రం తిప్పితే మంటొస్తుంది" అంది శారదమ్మ నవ్వుతూ.

"గ్యాస్ స్టవ్వుల్ని సిటీలోనే వాడాలని రూలేంలేదు మామ్మా. మా మావయ్యా వాళ్ళు కూడా ఒక పల్లెటూళ్లోనే వుంటారు. వాళ్ళు గ్యాస్ స్టవ్‌మీదే వంటచేస్తారు. నువ్వు కోపం తెచ్చుకోవద్దుగానీ మామ్మా, ఈ ఊరే మరీ ఇంత వెనకబడి వుంది"

అంతలో హరి అక్కడికొచ్చి "అమ్మమ్మా, తాతయ్యా పరిగెత్తినా ఊరు ముందుకి వెళ్ళదులే" అన్నాడు.





"ఇదిగో హరీ, నవ్వురాని జోకులు వేసే బదులు అమ్మమ్మా వాళ్ళు ఇబ్బంది పడ కుండా ఏమైనా చేయగలవేమో ఆలోచించు"

"కాయితాలు చించినంత తేలిక్కాదుగా ఆలోచించడం"

"మామ్మా, ఇంతకీ నువ్వేం చేయబోతు న్నావు? " అంది శారదమ్మ ఒక బస్తాని పట్టుకోవడం చూసిన బిందు.

శారదమ్మ మౌనంగా దాన్ని లాగబో తోంటే బిందు కంగారుగా "ఓయ్ మామ్మా, నువ్వేమైనా లేడీ భీముణ్ణి అనుకుంటు న్నావా? ఆగాగు" అంది అరిచినట్లుగా.

ఆవిడ తన తరహా నవ్వు నవ్వి ఆ పని కంటిన్యూ చేయబోతే హరి, ఆంజనేయు డిలా ఒక్క దూకు దూకి ఆ బస్తాకి అడ్డుగా నిలబడ్డాడు.

శారదమ్మ నిలబడి నవ్వు కొనసాగిం చింది.

"దీన్నెక్కడ పెట్టమంటావో చెప్పు అమ్మమ్మా. కండలు తిరిగిన మగవాణ్ణి నేనుండగా..." అని హరి అంటోంటే,

"ఆహాహా, ఎంతటి మగధీరుడండీ? వెయిట్ లిఫ్టింగ్‌లో పార్టిసిపేట్ చేయలేదు గానీ చేస్తే వరల్డ్ ఛాంపియన్ అయ్యేవాడు" అంది బిందు కల్పించుకుని మధ్యలోనే.

"అంత వెటకారం అక్కరేదు. నా పవ రేంటో నీకు తెలీడంలేదు"

"పది కిలోలైనా మోయగలవా? "

"ఎంతవమానం? ఇప్పుడే నన్ను నేను రుజువుచేసుకుంటాను చూడు" అని ఆ బస్తాని అతికష్టమ్మీద లేవనెత్తి భుజాలమీ దికి ఎత్తుకున్నాడు హరి.

బిందు ఆశ్చర్యానికి అంతులేదు. మూర్ఛ పోవడం ఒక్కటే తక్కువ.

హరి ఆ బస్తాని పళ్ళ బిగువున మోస్తూ అటూ ఇటూ నడుస్తోంటే బిందుకి గుండె శంకరుడి ఢమరుకంలా కొట్టుకుంటూ ఏ నిమిషంలోనయినా అసలు కొట్టుకోవడమే ఆగిపోతుందేమో అన్పించింది.

బిందు ఆశ్చర్యపోయినకొద్దీ హరి మోయ లేక మోస్తూ ఎక్కడ దింపాలో తెలీడంలేద న్నట్లు తచ్చాడుతున్నాడు.

"ఏయ్ హరీ, చాల్లే బడాయ్? ఆ బస్తా త్వరగా దింపు. అలవాటు లేనివాళ్ళు బరు వులెత్తితే కష్టం. దింపు త్వరగా, నీకే చెప్తోంది. గుండె పట్టేస్తుంది. ప్లీజ్ చెప్పిన మాట విను" అంటూ బతిమాలసాగింది.

హరి భుజాలమీంచి ఆ బస్తాని దింపి, అక్కడే వున్న గడమంచిమీద కూర్చున్నాడు.

"నా ఎస్టిమేషన్ తప్పిందే. నీకింత కెపా సిటీ వుందా? " అంది బిందు నవ్వుతూ.

ఆ వెంటనే శారదమ్మ ఆ బస్తాని రెండు చేతుల్తో సునాయాసంగా ఎత్తి కింద పడేసి బిందూ వంక చూసి నవ్వింది.

బిందూ ఒకక్షణం బిత్తరపోయి, తర్వాత ఆశ్చర్యపోయి ఆ వెంటనే లేచి ఆ బస్తాని తనూ ఎత్తి "ఇదేంటిమామ్మా, ఇది బరు వుగా లేదూ? " అంది.

"ఎందుకంటే అందులో వున్నది ధాన్యపు గింజలుకాదు ఊక మాత్రమే"

"ఆ? "

"ఊక అంటే పొట్టు" అన్నాడు హరి.

"ఇప్పటిదాకా ఎంత ఫోజు కొట్టారండీ మహానటుడుగారూ... ఆస్కార్ ఎవార్డ్ నిజానికి నీకు ఇవ్వాల్సింది. నిజంగానే గొప్ప బరువుని మోస్తున్నట్లు, రొప్పుతున్నట్లు ఎంత రియలిస్టిగ్గా నటించావో"

"చూశావా అంత బాగా ఏక్ట్ చేశానా? అయినా ఆస్కార్ కాకపోయినా ఫిలింఫేర్ ఎవార్డ్ అయినా రాలేదు. ఎక్కడా సిన్సియా రిటీ లేదు బిందూ. క్రికెట్ మ్యాచ్ ఫిక్సింగ్ ఒక్కటే బైటికి వచ్చింది గానీ ఎవార్డ్స్ ఫిక్సింగ్ గురించి బైటపడలేదు"

'ఇంక ఆపు నాయనా' అని లిప్‌మూ మెంట్‌తో చెప్పి, చేతులు రెండూ నమస్క రిస్తున్నట్లు పెట్టి "మామ్మా, ఇప్పుడదెం దుకు? " అంది బిందు.

"ఈ ఊకని పేడలో కలిపి, పిడకలు కొడ్తే

పొయ్యిలో బాగా రాజుకుంటాయమ్మా" అని ఆ బస్తా విప్పదీసి, అందులోంచి కొంత ఊక తీసి అక్కడున్న పేడకుప్పలో వేసి గబగబా కలయతిప్పింది శారదమ్మ.

"నీకు చీదరగా లేదా మామ్మా" అంటూ ముక్కు మూసుకుంది బిందు.

"పేడనే చీదరించుకుంటే తెల్లారినట్లే. రోజూ ఇలాంటి మురికి పనులెన్నో చేయాలి" అంటూనే దాన్ని చకచకా వుండలు చుట్టి గోడకి పిడకలేస్తోంది.

శారదమ్మ తన పని ముగించి, చెయ్యి కడుక్కునే లోపుగా బిందు లోనికి వెళ్ళి ఒక పర్‌ఫ్యూమ్ బాటిల్‌తో వచ్చి నిల్చుని "మామ్మా, ఒక్కసారి చేతులు చాపు" అంది.

"ఎందుకమ్మా? " అంటూ ఆవిడ చేతులు జాపగానే పర్‌ఫ్యూమ్ స్ప్రే చేసి "ఇప్పుడు వాసన చూసుకో" అంది.

"హు... 'పట్నం వచ్చిన పతివ్రతలు' ఇన్‌స్పిరేషనా? " అన్నాడు హరి.

"ఏం ఇన్‌స్పిరేషన్? "

"ఆ సినిమాలో రాధిక పేడలో పర్‌ఫ్యూమ్ వేస్తుంది. నువ్వు దాన్ని కొద్దిగా మార్చి అమ్మమ్మ చేతిలో వేశావు"

"బాబూ, నేనే సినిమా ప్రభావంతోనూ అలా చేయలేదు. అసలా సినిమా నేను చూడలేదు. మామ్మ చెయ్యి కంపు కొడ్తుందని మాత్రమే నేనలా చేశాను. బహుశా ఆ సినిమాలో అలాంటి సీన్ వుండటం, నేను ఇలా చేయడం జస్ట్ కో-ఇన్సిడెన్స్ అయ్యుంటుంది"

"కాపీ కొట్టే రైటర్లూ, డైరెక్టర్లూ ఇలాగే అంటారు జస్ట్ కో-ఇన్సిడెన్సని"

"పోవోయ్... అసలు నీకు ఎక్స్‌ప్లనేషన్ ఇచ్చేదేంటి? "

"ఆడవాళ్ళ తీరే ఇంత. అయితే బుకాయించబోతారు లేదంటే ఏం చేసుకుంటావో చేసుకోమన్నట్లుంటారు"

"అబ్బో... ఆడవాళ్ళని మహా కాచి వడపోశావులే"

"టీ కాచి వడపోయడమే రాదు. నేను పోస్తే టీ ఫిల్టర్‌లో కాకుండా చుట్టూ పడ్తుంది. ఇక ఆడవాళ్ళని ఏం కాచి వడపోస్తాను? "

శారదమ్మ ఇద్దరివంకా చూసి "ఒక్క గంటైనా మీరిద్దరూ వాదులాడుకోకుండా వుండలేరట్రా? " అంది.

"మా ఇద్దరిదీ 'మిస్సమ్మ' టైపు ప్రేమలే అమ్మమ్మా. ఈవిడగారు సావిత్రి లెవెల్లో చిర్రుబుర్రులాడ్తుందిగానీ లోపల మనమంటే తెగ లవ్వు"

పెద్దావిడ ముందు లవ్వు, గివ్వు అంటూ హరి మాట్లాడ్డం బిందూకి అస్సలు నచ్చలేదు. సిగ్గుగా కూడా అన్పించింది.

"ఈ అత్తరు వాసన భలే బాగుందమ్మాయి" అంది శారదమ్మ చేతులు మళ్ళీ మళ్ళీ వాసన చూసుకుంటూ.

"ఈ బోటిల్ నీ దగ్గరే వుంచుకో మామ్మా. ఈ పేడపనులు చేసినపుడల్లా కొంచెం చేతికి రాసుకో" అంటూ ఇవ్వబోయింది.

"బాగానే వుందిలే సంబడం. ముసలోడికి దసరాపండగ అన్నట్లు ఈ వయసులో నాకు సెంటు కావల్సొచ్చిందా? అసలు నువ్వేం చేయబోతున్నావో అర్థంగాక చేతులు చాపాను గానీ" అంది శారదమ్మ.

"ఇందులో తప్పేంవుంది మామ్మా? ఇప్పుడే గదా ఈ వాసన బాగుందన్నావు? అయినా ఇలాంటివి పడుచు పిల్లలే వాడాలని రూలేమైనా వుందా? "

"నాకేం వద్దుగానీ, కొంచెం టీ పెట్టుకుని తాగుదాం పదండి. తాతయ్య లేచే టైమైంది"

"ఈ పూట టీ నేను పెడ్తాను అమ్మమ్మా" అన్నాడు హరి.

"పెడ్తే సంతోషమేగానీ కాస్త మీ తాతయ్యకి నచ్చేట్లు పెట్టరా హరీ"

"నువ్వే చూస్తావుగా ఎంత బాగా పెడ్తానో. నేను పెట్టిన టీ తాగితే తాతయ్యే





కాదు తాతయ్యా వాళ్ళ తాతయ్య తాగినా లొట్టలేయ్యాల్సిందే"

"చాల్లే సంబడం. ఇవాళ నువ్వు టీ పెడ్తున్నావని చచ్చి స్వర్గాన వున్నవాళ్ళు ఎక్కడ దిగి వస్తారుగానీ మమ్మల్ని మాత్రం స్వర్గానికి పంపకు"

"డ్యామేజింగా మాట్లాడ్తున్నావు. ఇక మాటలనవసరం. మీరిద్దరూ వెళ్ళి తాతయ్య దగ్గరే కూర్చోండి. ఐదు నిమిషాల్లో అమృతాన్ని గ్లాసుల్లో పోసుకుని తెస్తాను" అన్నాడు హరి నాటకీయంగా.

వీరయ్య, శారదమ్మ, బిందూ ముగ్గురూ వసారాలో కూర్చున్నారు.

వున్నట్లుండి వీరయ్య "నీ చెయ్యి ఇటవ్వమ్మాయ్, హస్త రేఖలు చూస్తాను" అన్నాడు.

"మీకు హస్తసాముద్రికం తెల్సా తాతగారూ? " అంది బిందూ ఆశ్చర్యంగా, చేయి అందించి.

ఆయన ఆ రేఖలూ, ఈ రేఖలూ పరిశీలించి ఏవో లెక్కలేసి "మంచి జాతకురాలివి" అన్నాడు.

బిందూ సంబరపడిపోయింది.

కొద్దిసేపటి తర్వాత టీ గ్లాసులతో వచ్చిన హరికి శారదమ్మ ఆ సంగతి చెప్పింది.

'నిజమేలే, జాతకురాలు కనుకనే నన్ను పెళ్ళి చేసుకోబోతోంది' అనుకున్నాడు హరి మనసులో.

బిందు తన సంతోషంలో తానుండిపోయింది.

★ ★ ★

"అమ్మమ్మా, ఆ అమ్మాయిని చూస్తే నీకేమన్పిస్తోంది? " అనడిగాడు హరి శారదమ్మ తలకి నూనె రాసుకుంటోంటే వెళ్ళి పక్కనే కూర్చుని.

"ఏమనిపించాలో నువ్వే చెప్పు"

"అది కాదమ్మమ్మా, నువ్వెప్పుడూ నీకు నచ్చిన పిల్లని చూసి పెళ్ళిచేస్తాననేదానివిగా"

"నేను చూసేంతవరకూ నువ్వాగలేదుగా. అయినా ఈ అమ్మాయి బాగుందిలే. ఈడూ జోడూ బాగుంది. వంకపెట్టడానికేం లేదు"

హరి సంతోషానికి అంతులేకపోయింది. ఎలా చెప్పాలో, ఆవిడ ఎలా రిసీవ్ చేసుకుంటుందో అని సంకోచిస్తూ, సందేహిస్తూ వచ్చాడు. ఇక ఇప్పుడు ఏదేమైనా చెప్పేయాలనుకుని, బిందు అక్కడ లేకపోవడంచూసి వచ్చాడు. హమ్మయ్య, తను పూర్తిగా చెప్పకముందే గ్రహించేసింది అని రిలీఫ్ ఫీలై, ముసిముసిగా నవ్వుకుంటూ వుండిపోయాడు.

"అసలు సంగతి ఏమంటే ఆమధ్యెప్పుడో మా చెల్లెలి కోడలు సరోజిని తెల్సుగా... అదొచ్చి వాళ్ళ రెండో అమ్మాయిని నీకు చేసుకుంటారేమో మాట్లాడమని అడిగింది. ఆ పిల్లని నేను చూశాను. చక్కనిది, చదువుకున్నది. పేరు కావేరి. ఆలోచిస్తే అంతా అనుకూలంగానే వుంది. సరే వాళ్ళే వచ్చి అడిగితే బెట్టు ఎందుకు చేయాలని వెంటనే మీ అమ్మకి ఉత్తరం రాయించాను.

మీ అమ్మ 'హరి ఒకమ్మాయిని చూసుకున్నాడులే, వాళ్ళని ఇంకో సంబంధం చూసుకోమని చెప్పు' అని జవాబు రాసింది"

"అమ్మ నాకీ సంగతి చెప్పలేదే? "

"చెప్పాల్సిన అవసరం మాత్రం ఏముందిలే. ఒక పిల్లని నచ్చుకున్నాక ఇంకో సంబంధం గురించి చెప్పడం ఎందుకు అనుకుని వుంటుంది. ఆ తర్వాత నెల్రక్రితం మీ అమ్మ ఇక్కడికొచ్చినప్పుడు అన్నీ వివరంగా చెప్పింది..." అని ఒక విషయం చెప్పడానికి తటపటాయించింది.

"మీ అమ్మకి బిందుపట్ల ఒక్క సందేహం వుంది"

"అమ్మ నాతో అనలేదు, ఏమిటది? "

"నువ్వంటే మీ అమ్మకి పంచప్రాణాలుగా, తనేమంటే నువ్వేం నొచ్చుకుంటావో అని అనుండదు. ఆ అమ్మాయి కొంచెం గడసరిలా వుందని, నిన్నేమైనా కష్టపెడ్తుందేమో

నని దాని సందేహం"

"పాపం బిందు మంచిదే అమ్మమ్మా. ఆడ వాళ్ళు వెనకబడి వున్నారని, మగవాళ్ళతో సమంగా చూడబడటం లేదనీ బాధపడ్తూ ఆ ఆవేశంలో ఏదో మాట్లాడ్తుందిగానీ, గద్దరిత నమో, ఇతర్లని ఏడ్పించే తత్వమో లేవు"

శారదమ్మ నవ్వి "ఆ సంగతి నాకూ అర్థమైంది. అయినా అన్ని భావాలూ దాచుకుని తేటగా, నెమ్మదిగా కనిపించే వాళ్ళకంటే, ఏదీ దాచుకోకుండా పైకి మాట్లాడేవాళ్ళే మంచి వాళ్ళు. అసలు ఆడపిల్లలకి ఆ మాత్రం తెగువ, చొరవ వుండాలి" అంది.

"మరి నువ్వు చాలా నెమ్మదిగా వుంటావుగా"

"ఈ వయసులో నెమ్మదిగా వుండక లేడి పిల్లలా తుళ్ళిపడ్తానా? సెలయేటిలా గలగలలాడ్తానా? "

"అంటే నువ్వు చిన్నగా వున్నప్పుడు గోల చేసేదానివా? "

"ఇప్పటి పిల్లల్లా అప్పుడు మాకు చదువుకునే అవకాశాల్లేవు. ఊళ్ళోనే వుండే ఒక ఈడువాళ్ళతో స్నేహం తప్ప అంతకంటే పరిచయాలకి వీలెక్కడిది? అందుకే ఆరోజుల్లో మాకంత తెలివిలేదు. అయినా తోటి పిల్లల్తో కలిసి సరదాగా, చలాకీగా తిరిగేదాన్ని. పదమూడేళ్ళ వయసులోనే పెళ్ళయింది. పెద్దరికం వచ్చి పడింది"

"ఒక్కమాట చెప్పు అమ్మమ్మా, బిందు నీకు నిజంగా నచ్చిందా? లేక నా తృప్తికోసం అంటున్నావా? "

"కేవలం నీ తృప్తికోసం చెప్తే నీకే నష్టం చేసినదాన్నవుతాను. ఒకవేళ ఆ పిల్ల నీకు సరిజోడు కాదు అనుకుంటే నయానో భయానో చెప్పి ఒప్పించి ఆ పిల్లని నీ మనసులోంచి తీసేసి కావేరితో పెళ్ళి చేసేదాన్ని"

శ్రీహరి తబ్బిబ్బయ్యాడు.

అమ్మమ్మ సెంట్ పర్సెంట్ ఏక్సెప్ట్ చేయడం కంటే కావాల్సింది ఏముంది?

"మీ అమ్మకి నేను ఉత్తరం రాయిస్తాలే"

"ఏమని? "

"బిందూ గయ్యాళి అనే శంకలు పెట్టుకోవద్దనీ, ఆమాత్రం గడుసుదనం లేకపోతే నీకొడుకే ఆ పిల్లని చెండుకుతింటాడని"

"ఏయ్ అమ్మమ్మా, బిందూని మెచ్చుకోవడం బాగానే వుందిగానీ నన్ను అవమానించడం బాగాలేదు. నేనెంత అమాయకుణ్ణో నీకు తెలీదా? "

"ఇతర్లతో బాగుండటం కాదురా నాయనా, పెళ్ళాంతో బాగుండి, ఆమెని ఇబ్బంది పెట్టకపోవడం సత్పురుషుల లక్షణం"

"అయితే నేను సత్పురుషుణ్ణి అని రుజువు చేసుకుంటాలే అమ్మమ్మా"

"అదే నాక్కావలసింది. మీ ఇద్దరూ చిలకా గోరింకల్లా వుండండి. ఒకవేళ ఆ అమ్మాయి తెలిసో తెలీకో ఏదైనా పొరపాటు చేసినా మంచిగా చెప్పు. అంతేగానీ పెళ్ళయిందిగా ఎక్కడికి పోతుందిలెమ్మని అహంకారంగా ప్రవర్తించకు"

"అయ్యో అమ్మమ్మా, నువ్వు సత్తెకాలపు మాటలు వల్లించకు. మీతరం వాళ్ళలా ఇప్పటి ఆడపిల్లలు ఎలాంటివాడైనా సర్లెమ్మని సర్దుకుని వుండటం లేదు"

"అదేమంచిది. అందుకే మీరు తోక జాడించడం మానేసి బుద్ధిగా వుండండి"

"అమ్మమ్మా, బిందూకంటే నేనే నీకు దగ్గరివాణ్ణి. ముఖ్యంగా మనవణ్ణి"

"కానీ ఒక మగవాడివి"

"అద్సరే. మేం ఎంటరవ్వగానే 'ఎవరీ అమ్మాయి?' అనడిగావు? ! ఆ తర్వాత కూడా తెలుసున్నట్లు ఎన్నడూ బయటపడకుండా ఇంత గుంభనంగా ఎందుకున్నావు? "

"నీ నోటి ద్వారా నువ్వేం చెప్తావో వినాలనుకున్నాను. చెప్పేదాకా ఆగుదామని నోరు విప్పలేదు"

"వార్నీ? నేనేమో నువ్వేం అనుకుంటున్నావో, అంటావో అని హడలి చచ్చాను అనవసరంగా. మొత్తం కథంతా తెలిసుంటుందని అస్సలు ఊహించలేదు"




"ఓరి పిచ్చి సన్యాసీ, ఏమీ తెలీకపోతే ఇంత శాంతంగా వుంటానా? నా మనవడు ఒక కొత్త ఆడపిల్లని తీసుకొచ్చి ఏమీ చెప్ప కుండా తనతోబాటు వుండేట్లు చేస్తే ఇదేంటి, ఎవరా అమ్మాయి, నీకూ ఆమెకి ఏమిటి సంబంధం, మనింటికి ఎందుకు తీసుకొ చ్చావు, అసలా అమ్మాయి మాత్రం ఎలా వచ్చిందిలాంటి ప్రశ్నలేం వేయనా? నేనే వన్నా పూటకూళ్ళమ్మనట్రా ఏసందేహాలూ లేకుండా ఎవరొచ్చినా ఏమీ అడక్కుండా ఇంట్లో అట్టిపెట్టుకుని తిండిపెట్టడానికి" అనే సింది.

"ఛ... అలా అంటావేంటి? "

"మరెలా అనను? నీతోబాటొచ్చింది మగ వాడే అయితే అనుకోవచ్చుగానీ వయసులో వున్న కుర్రాడు ఈడొచ్చిన ఆడపిల్లని వెంటబె ట్టుకొస్తే, ఎన్ని అనుమానాలు తలెత్తు తాయి? నాకు ముందే తెలియబట్టి నిన్ను రెట్టించి అడగలేదుగానీ..."

"అయితే తాతయ్యక్కూడా బిందుని నేను చేసుకోబోతున్నానని తెలుసా అమ్మమ్మా"

"భేషుగ్గా తెలుసు"

హరి నవ్వుకుంటూ వుండిపోయాడు.



వంటింట్లోంచి ఏదో శబ్దం వస్తోంటే అదేంటన్నట్లు కళ్ళెగరేసింది బిందు.

"అమ్మమ్మ ఏదో విసురుతున్నట్లుంది" అన్నాడు హరి.

ఆమె చెంగున లేచింది. అతడు అనుస రించాడు.

శారదమ్మ మడతపెట్టిన చీర మీద తిర గలినుంచి శెనగపప్పు విసురుతోంది.

"లే, అమ్మమ్మా, నేను విసురుతాను" అని ఆమెచేతిలోంచి తిరగలి గురుజు తీసుకుని సూపర్ ఫాస్ట్‌గా తిప్పసాగాడు.

"మరీ అంత వేగంగా తిప్పకురా. పిండి మెత్తనవకుండా మరీ రవ్వలా పడ్తుంది" అంది.

ఆమె చెప్పినట్లే తిప్పసాగాడు.

"ఎందుకు మామ్మా? ఈ పిండి? "

"కారప్పూసా, మైసూర్ పాకమూ చేద్దా మని"

"ఎందుకు? "

"ఎందుకేంటమ్మాయి? పిల్లలు మీరిద్దరూ అంతదూరంనుండి వస్తే నా ఓపిక్కొద్దీ నేనే మైనా చేసిపెడ్దాం అన్పించదూ? "

"అయితే ఈ రెండూ చేస్తే సరిపో తుందా? అరిసెలు, బూరెలు, బూందీ, కాజా, కొబ్బరిలౌజు, బందరు లడ్డూ, వెన్నుండలు, గట్టిపకోడీలు, సున్నుండలూ, కాజాలు, జిలేబీ... ఇలా ఎన్నున్నాయి? అవన్నీ చేయవా మామ్మా? "

"చాల్లే నీ ఆట పట్టించడాలు" అన్నాడు హరి.

శారదమ్మ తన తరహాలో నవ్వింది.

"నవ్వడంకాదు మామ్మా మేం మరీ తిండిబోతుల్లా కన్పిస్తున్నామా? తినడానికే వచ్చాం అనుకున్నావా? ఆ పిండి దాచేసి, నువ్వొచ్చి కూర్చుని కాసేపు కబుర్లు చెప్తే సంతోషిస్తాను"

"పిండివంట చేస్తూ కబుర్లు చెప్పు కుందాం"

"ఏమక్కర్లేదు. ఇప్పుడు ఎక్కడ చూసినా స్వగృహ హోంఫుడ్స్ అంటూ పెడ్తున్నారు.

# పలుకుముత్యాలు

★ అవమానాలు ఎదురైనప్పుడు నిగ్రహించుకోవటంలోనే విజ్ఞత ఉంది.

– శ్రీశ్రీ

★ నిజాయితీపరులు కొత్తవారిని చూసి భయపడరు.

– సి.నా.రే.

★ తన్ను తాను తెలుసుకొన్ననాడు స్వతంత్రజీవనం సాధించగలడు.

– గాంధీజీ

★ రేపటి భయాలను గురించి విచారిస్తూ కూర్చుంటే ఈనాటి ఆనందాలు చేజారిపోతాయి.

– సోక్రటీస్

★ తక్కువ నేర్పుతో ఎక్కువ విషయాల్ని చెప్పగలగడమే నిజమైన కళ.

–ఎ. నాగేశ్వరరావు

★ సహజప్రతిభ లేని చదువు కంటే చదువు లేని సహజ ప్రతిభ గొప్పది.

– సి.నా.రే

★ ఇతరుల మీద నమ్మకం కుదరాలంటే సహనం ఉండాలి.

– సుందర చైతన్యానంద.

★ నిన్ను అర్థంచేసుకోలేని ప్రజలు నీకు అండగా నిలవక పోవచ్చు కానీ దేముడు నీకు తోడుగా ఉంటాడు.

– స్వామీ చిన్మయానంద.

★ ప్రేమలేని చోట శాంతి ఉండదు. పవిత్రత లేని చోట ప్రేమ ఉండదు.

– చలం

★ ఇతరులను బాధించుటవలన పొందే ఆనందం చాలు నీ పతనానికి.

–పోప్

★ కటువైన మాటలు వాడవద్దు. బాణాలకంటే ఈ మాటలే ఎక్కువగా గాయపరుస్తాయి.

–ఇ.డేవిస్

★ ప్రతిరోజూ ప్రేమతో నిండిన జీవితాన్ని గడుపు, అదే దేవుని చేరడానికి సరియైన మార్గం.

–రామకృష్ణ పరమహంస

★ వినియోగించని విజ్ఞానం జీర్ణంకాని ఆహారం వంటిది.

–సి.నా.రే.

★ పథకం వేయబడిన గొప్ప పనులకంటే పూర్తి చేయబడిన స్వల్పమైన పనులే శ్రేష్ఠమైనవి.

– బెంజిమన్ డిజ్రేలి

సేకరణ: అనంతప్రభాకర దత్తు

అందులో దొరకనివి అంటూ ఏమీలేవు. నాకుతోచి చావలేదుగానీ, మీకోసం అందు లోంచి ఏమైనా కొనుక్కురావలసింది"

"కొన్నవి మనం చేసిన వాటితో సమానం అవుతాయా? "

"ఎందుక్కావు మామ్మా? వాళ్ళు బాగా వంటలొచ్చిన వాళ్ళతోనే చేయిస్తారు. ఏమైనా తేడావస్తే గిరాకీ తగ్గుతుంది కనుక జాగ్రత్తగా చూసుకుంటారు. మామూలు స్వీట్ షాపుల్లోలాకాదు అచ్చం మన ఇళ్ళలో చేసే వంటల్లాగే వుంటాయి"

"అయినా డబ్బు పోయాలిగా"

"డబ్బు లేకుండా ఏదైనా రావాలనుకో వడం దురాశే కద మామ్మా. అయినా సంపాదించేది ఎందుకు? ఖర్చు చేసేందు కేగా. అవన్నీ దాచుకుని ఇంత కష్టపడాల్సిన అవసరం వుందా నువ్వే చెప్పు"

"నీకు జీతం ఎంతొస్తుందమ్మాయి? " అంటూ నవ్వింది.

"ఎనిమిది" అంటూ వేళ్ళతో చూపింది బిందు.

"ఏంటి? ఎనిమిదొందలే? అయితే బాగానే సంపాదిస్తున్నావు అమ్మడూ"

హరి ఘొల్లున నవ్వాడు.

బిందు కూడా ఆపుకోలేక పకపకా నవ్వింది.

"ఎనిమిది వందలకి స్వీపర్లు కూడా రోడ్లూడవరు. ఆమెకి ఎనిమిది వేలొస్తుంది" అన్నాడు హరి.

శారదమ్మ ఆశ్చర్యానికి అంతులేకపో యింది.

"ఏవిటి? ... నెలకే? "

"కాకపోతే సంవత్సరానికా? ఏంట మ్మమ్మా? ఏ జమానాలో వున్నావు? "

"ఇంతకీ నీ జీతం ఎంతరా? "

"ఆ పిల్లకంటే కొంచెం తక్కువే? ఏడు వేల ఐదొందలు వస్తుంది"

ఆవిడ మరోసారి ఆశ్చర్యపోయింది.

"ఇంతదాకా చెప్పరేంట్రా? అంత మంచి జీతాలొస్తున్నాయంటే... మీ తాతయ్య కూడా ఊళ్లో నలుగురితోనూ చెప్పుకుని సంతోషిస్తాడు"

"నిజానికి ఇవేమంత గొప్ప జీతాలు కావు అమ్మమ్మా"

"మీ ఆశకి మరీ అంతులేనట్లుంది. నాక యితే ఇక్కడికే కళ్ళు తిరిగినంతపనయింది. ఇంకెన్ని వేలు కావాలనుకుంటున్నారు? మరీ అత్యాశలొద్దు. దురాశ దుఃఖానికి చేటన్నారు"

ఆవిడతో ఆ విషయమై వాదన అనవ సరం అనుకుని ఇద్దరూ మాట్లాడలేదు.

"నువ్వు రాజుకి యాభై రూపాయలిచ్చావ టగా, వాడు చెప్తే నేను విస్తుపోయాను" అందావిడ.

'గమ్మున జేబులో పెట్టుకోక ఆ సంగతి ఘనంగా చెప్పాలా?' అనుకుని "కోపం వచ్చిందా మామ్మా? అతను అంత కష్టపడి పనిచేస్తే ఇరవైతో సరిపెట్టడం పద్ధతికాదు అన్పించింది. మాకు రోజుకి రెండొందల యాభైపైనే వస్తుంది. పైగా మేం చేసేది ఇంత కష్టమైన పనికానేకాదు" అంటూ సంజాయిషీ ఇచ్చింది బిందు.

"నువ్వేం తప్పు చేశావని కోపం తెచ్చుకో డానికి? కాకపోతే ఈ అమ్మాయికి డబ్బు విలువ బొత్తిగా తెలీదల్లే వుంది అనుకు న్నాను. మరి అంత డబ్బు సంపాదిస్తోంటే అలా ఉదారంగా వుండటం సహజమేలే"

కొద్దిసేపట్లో పిండి విసరటం పూర్త యింది.

"మామ్మా ఆ పిండిని ఒక డబ్బాలో పోసి దాచేయండి"

"ఊరుకో బిందూ! అమ్మమ్మ నొచ్చుకుం టుంది. ఒక పనిచేద్దాం, అమ్మమ్మ గైడె న్సులో మనిద్దరం చేద్దాం, ఓకేనా? "

"అయితే సరే" అంటూ బిందు చెంగుదో పింది.

నీళ్ళు ఎక్కువైతే, పిండి జారుగా వుంటుం

దని కలపడం వరకూ తాను చూస్తానంది శారదమ్మ.

మూకుట్లో నూనె మసిలాక హరి గిద్దల్లో పిండిని చుట్టలుగా వత్తుతుంటే, వాటిని అపకతో తీయడం బిందు వంతయింది.

మొత్తానికి కొద్దిసేపట్లోనే కారప్పూస తయారైంది.

"పాపం పిల్లలు మీరే చేశారు. కనీసం మైసూరు పాకమైనా నేను చేస్తాను" అంది శారదమ్మ.

"అది కూడా మేమే చేస్తాం ఇంకోరోజు" అని పడనివ్వలేదు వాళ్ళు.

బిందుని శారదమ్మ, హరి ఇద్దరూ ఎంతో బతిమిలాడారు కారప్పూస తినమని. కానీ ససేమిరా వినలేదు.

ఏవో పిచ్చాపాటి కబుర్లతో సమయం ఇట్టే గడిచిపోయింది.

ఇక మళ్ళీ సాయంత్రపు పనులు మొదలు.

శారదమ్మ చీపురు పట్టుకుంటే బిందు ఆవిడ చేతిలోంచి లాక్కుని తానే ఊడ్చేసింది. ఆవిడ కొంచెం నీళ్ళు చల్లి వాకిట్లో చంద్రుడి ముగ్గేసింది.

"పనులు చేయాలని తెగముచ్చట పడుతున్నారుగదా అమ్మాయ్, నువ్వు మల్లెమొగ్గలు కోయి. ఒరేయ్ హరీ, నువ్వు కొబ్బరి బోండాలు కొట్టు" అంటూ ఇద్దరికీ పనులు అప్పగించి, తను వంట చేసేందుకు వెళ్ళింది.

తర్వాత స్నానాలు చేయమంది. బిందు చన్నీళ్ళకి భయపడి, వేణ్ణీళ్ళు అడగలేక చేయననేసింది.

శారదమ్మ కట్టిచ్చిన పూలు ఇష్టంగానే పెట్టుకుంది బిందు. మల్లెల పరిమళం మనోహరంగా వుంది. ఆ పూలు పెట్టుకున్న ఆమెని చూస్తే హరికైతే సమ్మోహనంగా వుంది.

ఆ రాత్రి కూడా వాళ్ళిద్దరూ బిందుతో భోజనం చేయించలేకపోయారు. అసలు విషయం చెప్పలేక ఒకటికి పది అబద్ధాలు చెప్పింది. అల్లమ్ముక్క కాస్త తింటే అన్నం సహించకపోవడం, వాంతయ్యేట్లుండటం, కడుపులో తిప్పడం అన్నీ మాయమైపోతాయని శారదమ్మ ఎంత చెప్పినా, బిందు పట్టువిడవలేదు. ఏదేదో చెప్తూ ఎలాగో ఏమార్చి తినకుండా వూరుకుంది. కనీసం పాలైనా తాగమని బతిమాలినా ఫలితం లేకపోయింది.

బిందు మనస్థితి మహా సంకటంగా వుంది.

ఒకపక్కన కడుపులో ఆకలి కప్పలు బెక బెక మంటున్నాయి. మామ్మగారి వంటల రుచి తెల్సినందున నోట్లో లాలాజలం ఊరుతూ, తింటే బాగుండు, తినేస్తేపోలా అన్పిస్తోంది. వాళ్ళంత ప్రేమగా తినమని పదేపదేచెప్తోంటే ఎక్కడ సరే అనేస్తుందో నన్నంత టెమ్టేషన్... వీటిని డామినేట్ చేస్తూ చెరువుగట్టు సీన్.

మొత్తానికి అభోజనంగా పడుకోవడంవల్ల ఆవేళ కూడా ఆమెకి నిద్రలేకుండాపోయింది. శ్రీహరి అమ్మమ్మతో చెప్పి అందరి పక్కలూ వసారాలోనే వుండేట్లు ఏర్పాటు చేశాడు.

అక్కడ గాలి పుష్కలంగా వుండటంతో గడిచిన రాత్రిలా ఉక్కపోతలేదు. నిన్నట్లా నీళ్ళు తాగనందున బాత్రూంకి వెళ్ళాల్సిన అవసరం రాలేదు. మామ్మగారి గురక తెలిసి వుండటాన భయం వేయకపోగా చెవులకి అలవాటు అయిపోయింది. గాలికి దోమలు కూడా పరారవుతున్నాయి. ఎప్పుడో ఒకటి తప్ప వాటి పీడన కూడా లేదు. ఇలా ఈవేళ అంతా బాగానే వుందనుకుంటే ఆకలి వేధిస్తోంది అనుకుని నిట్టూర్చింది బిందు.

ఎప్పుడో కొంచెం నిద్రపట్టడం, ఆకలి బాధవల్ల అంతలోనే మెలకువ వచ్చేయడం, మళ్ళీ తన్నుకుని తన్నుకుని, అంతూదరీలేని ఆలోచన్ల ఆకాశవీధుల్లో విహరించి రావడం, మళ్ళీ కాసేపు నిద్ర... ఇలా గడిచింది.




ఎన్ని కష్టాలొచ్చాయిరా బాబూ అనుకో కుండా వుండలేకపోయింది. మొత్తానికి ఎలాగో రాత్రి గడిచింది.

★ ★ ★

వీరయ్య, శారదమ్మ, హరి, బిందు- నలుగురూ ముందు వసారాలో పచ్చీస్ ఆడుకుంటున్నారు.

పెద్దవాళ్ళిద్దరికీ ఆట బాగా వచ్చు. పిల్లలిద్దరూ అప్పుడే మెలకువలు తెల్సుకుని ఆడి గెలవాలనే ఉత్సాహంలో వున్నారు.

అలాంటి సమయంలో శారదమ్మ చెల్లెలి కొడుకు, కోడలు వచ్చారు.

"ఏరా, ఆంజనేయులూ! బాగున్నావా? ఏమ్మా, సరోజినీ ఎన్నాళ్ళకి గుర్తొచ్చానే? " అంది శారదమ్మ.

"బాగున్నాం కానీ ముందు కాసిని మంచి నీళ్ళివ్వత్తయ్యా" అంది సరోజిని.

శారదమ్మ లేవబోతోంటే, బిందు నేను తెస్తానంటూ సైగచేసి తెచ్చేందుకు వెళ్ళింది.

"ఏం హరీ బాగున్నావా? " పలకరించింది సరోజిని.

హరి నవ్వి తలూపాడు.

"నీ ఆరోగ్యం ఎలా వుంది, పెదనాన్నా? " అన్నాడు ఆంజనేయులు.

"బాగానే వుందయ్యా" చెప్పాడు వీరయ్య.

ఈలోపు బిందూ నీళ్ళ గ్లాసుల్తో వచ్చింది.

"ఎవరీ అమ్మాయి అత్తయ్యా? " అడిగింది సరోజిని.

"ఇంకెవరు? మన హరికి కాబోయే భార్య"

"ఓహో, అప్పుడు చెప్పింది ఈ అమ్మాయి గురించేనా? పిల్ల బాగుంది... నీ సెలక్షన్ బాగుందిరా" అంది నవ్వుతూ.

హరి నవ్వుతూ తల వాల్చేశాడు.

"ఆడపిల్లలా సిగ్గుపడ్తే ఎలా? కావేరి పెళ్ళికి ఈ అమ్మాయిని కూడా తీసుకురా"

"కావేరి పెళ్ళా, ఎప్పుడు? "

"రేపు ఆరో తారీఖే పెళ్ళి. అనుకోకుండా కుదిరింది" అంటూ శుభలేఖ తీసి ఇచ్చింది. శారదమ్మకి, బిందుకి కుంకుమ బొట్టు పెట్టింది.

"కిందటి నెల రాజయ్య కల్సినప్పుడు కూడా అనలేదే" అన్నాడు వీరయ్య.

"అయ్యో పెదనాన్నా, మొన్న ఆదివారం నాలుగ్గంటలదాకా మాకే అసలేమీ తెలీదు. అప్పటికప్పుడు ఈయన ఫ్రెండొకరు ఫోను చేసి చెప్పడం, వెంటనే పెళ్ళిచూపులు ఏర్పాటుచేయడం, వాళ్ళకి అమ్మాయి నచ్చడం, ఆ వెంటనే ముహూర్తం పెట్టించడం నిమిషాల్లో జరిగాయంటే నమ్మండి"

"కక్కొచ్చినా, కల్యాణమొచ్చినా ఆగదంటారు ఇందుకే"

"పిల్లాడేం చేస్తాడు? "

"ఇంజనీరు. సెలవు మీదొచ్చాడు. పెళ్ళి కాగానే అమెరికా వెళ్తాడు. కావేరి నెమ్మదిగా వెళ్తుంది"

"ఎందుకురా ఆంజనేయులూ ఆమెరికా సంబంధం? అమ్మాయి అంత దూరం వెళ్తే ఎప్పుడో తప్ప చూట్టానిక్కుదరదుగదా"

"చూడకపోతే నష్టమేముందిలే పెద్దమ్మా, ఎక్కడున్నా అది సుఖంగా వుండటమే మనం కోరుకునేది"

"ఆ దేశంలోనే తప్ప ఇక్కడ సుఖపడలేరా? "

"ఆ దేశానికీ మన దేశానికీ పోలికే లేదత్తయ్యా. అక్కడి సుఖాలు, సౌఖ్యాలు, డబ్బూ దర్జా ఇక్కడ రమ్మంటే వస్తాయా? అందుక్కాదూ అందరూ అమెరికా వెళ్ళేందుకు అర్రులు చాస్తోంది? "

"కానీ సరోజినీ, మన పిల్లలు అందుబాటులో వుంటేనే కదా మన అచ్చట్లూ ముచ్చట్లూ తీర్తాయి"

"అందుకే వెనకటికాలంలో వున్న ఊళ్ళోనే లేదా పక్కపక్క ఊళ్లలో సంబంధాలు చూసేవాళ్ళు. వాళ్లేం సుఖపడ్డారు? మన పిల్లలు మన కళ్ళెదురుగానే వుండాలనుకోవడం కంటే వాళ్ళెక్కడున్నా బాగా వుండా

లనుకోవడం మంచిది" అంది సరోజిని.

శారదమ్మ ఆలోచన అందుకు భిన్న మైంది. అందుకే ఆవిడ రెట్టించలేదు.

మరికొద్దిసేపు కూర్చుని, నలుగురినీ తప్పక రమ్మని పదేపదే చెప్పి, వచ్చిన కారులో వెళ్ళిపోయారు వాళ్ళిద్దరూ.

★ ★ ★

"మామ్మా, నీ కథ చెప్పవూ" అనడిగింది బిందు.

"ఏముందమ్మా చెప్పేందుకు? "

"ఎందుకుండదూ? నువ్వెవరు? తాతయ్యకి, నీకు పెళ్ళెలా అయింది? ఆయన్తో జీవితం ఎలా వుండేది? ఏమైనా కష్టాలు ఎదురయ్యాయా? వాటిని ఎలా సాల్వ్‌చేసుకున్నావు? ఇలాంటివన్నీ చెప్తే అదే నీ కథ అవుతుంది"

"చెప్పుకోదగ్గవి ఏమీలేవు. అందర్లాగే నేనూ కాపురానికి వచ్చాను. నలుగురు పిల్లల్ని కన్నాను. వాళ్ళకి పెళ్ళిళ్లు చేసి పంపాము. ఇప్పుడిలా మిగిలాము..."

"అదే కొంచెం వివరంగా చెప్పు"

"మా అమ్మా నాన్నలకి పది మంది పిల్లలు..."

"మైగాడ్... పదిమందే? "

"ఆరోజుల్లో అది చాలా మామూలు. పదిహేనుమంది పిల్లలు కూడా పుట్టేవాళ్లు. అందరూ బతికి బట్టకట్టేవాళ్ళు కాదనుకో. నాకంటే ముందు ఇద్దరు పుట్టిపోయారు. నా తర్వాత పుట్టినవాళ్ళలో ఒకడు ఐదేళ్లు పెరిగి, ఒకామె రెండేళ్ళు పెరిగి చనిపోయారు"

"అయ్యో..."

"ఇప్పట్లా పిల్లలు పుట్టకుండా ఆపరేషన్లు లేవు కనుక చాలామంది పుట్టేవాళ్లు. బాలారిష్టాలు దాటకుండా కొందరు పోయేవాళ్లు. పురుగు ముట్టో, మరేదో జబ్బుచేసో సరైన వైద్యం అందక మరికొందరు పోయేవాళ్ళు. అయితే ఇవన్నీ తట్టుకుని బతికిన





వాళ్లు మాత్రం మంచి పుష్టిగా, ఆరోగ్యంగా ఎనభైతొంభయ్యేళ్ళు, కొందరైతే నిండు నూరేళ్ళు బతికేవారు"

"అందుకు రెండు కారణాలు చెప్తారు మామ్మా. ఒకటి అప్పట్లో పంటలకి మందులు, ఎరువులు వేసేవారు కాదటగా. రెండోది బాగా కష్టపడి, మంచి తిండి తినేవారట. నాకు ఇంకోటి ఏమన్పిస్తుందంటే ఇప్పుడున్నంత పోటీ, మెంటల్ స్ట్రగులూ అప్పుడు లేవు కనుగ ప్రశాంతంగా వుండేందుకు అవకాశం వుంది. అదే కనుక మానసిక సంఘర్షణ వుంటే దాని ప్రభావం శరీరంమీద పడి ఆరోగ్యం దెబ్బతింటుంది"

"అది నిజమే కావచ్చు ఇప్పుడున్నన్ని జబ్బులు మా కాలంలో లేవు. ఇంత తరచుగా ఏదో ఒక జబ్బు చేయడమూలేదు. ఎప్పుడో ఒకసారి సుస్తీ చేస్తే ఇళ్ళలోనే చికిత్స చేసుకునేవాళ్ళం. తల్నొప్పి వస్తే సొంఠి అరగదీసి పట్టీ వేస్తే ఇట్టే తగ్గిపోతుంది. జలుబుకి మిరియాల కషాయం, పైత్యం చేస్తే అల్లపు రసం..."

"ఇప్పుడైతే తల్నొప్పి వచ్చినా ఏస్ప్రో, ఎనాసిన్ అంటూ సొంత వైద్యాలు చేసుకోకండి. అది ముదిరి మరో జబ్బుకి దారితీయకుండా డాక్టర్ని సంప్రదించండి అంటున్నారు. తీరా డాక్టర్ దగ్గరికెళ్తే రకరకాల పరీక్షలు చేయించమంటాడు. అవన్నీ రిపోర్టులు వచ్చాక చూస్తే ఏమీ వుండదు. ఆ డాక్టర్ కూడా మనం మింగాలనుకున్న మాత్రే రాసివ్వచ్చు. కొందరు డాక్టర్లు అందరికీ తెల్సిన టాబ్లెట్లు రాసిస్తే తమ ప్రత్యేకత ఏముంది అనుకుంటారని కొత్త కొత్త పేర్లు అరడజను రాసివ్వచ్చు"

శారదమ్మ నవ్వింది.

"కానీ మామ్మా ఇలా జరుగుతుంది, డబ్బు వదలడమే తప్ప ప్రయోజనం లేదు అనుకోవడం మంచిది కాదు. కొన్నిసార్లు మామూలు తల్నొప్పి బ్రెయిన్ ఫీవర్‌లోకి దింపొచ్చు జలుబు ఊపిరితిత్తులకి పాకొచ్చు"

శారదమ్మ తల పంకించింది.

"నేను అనవసరంగా అడ్డొచ్చాను. మళ్ళీ వెనకటి రోజులలోకి వెళ్ళు మామ్మా"

"పదిమంది పిల్లల్లో నేను ఆరోదాన్ని. మీ తాతయ్య నాకు మామయ్య వరసవుతాడు. పెద్దవాళ్లు మాట్లాడుకుని పెళ్ళి చేశారు. పెళ్ళయ్యేవరకూ మేం ఒకళ్ళనొకళ్ళు చూసుకోలేదు"

"నిజం? !"

"నిజమే. మీరంటే పెళ్ళికిముందే మాట్లాడుకుని ఒకరి గురించి ఒకరు తెలుసుకుంటున్నారు. ఇదే మంచిది కూడా. అప్పుడలా లేదు. సరే పదమూడో యేట కాపురానికొచ్చాను. అప్పటివరకూ స్నేహితురాళ్ళతో చెట్టాపట్టాలేసుకు తిరుగుతూ ఆటాపాటల్తో కాలక్షేపం చేసిందాన్ని. ఒక్కసారిగా పెద్దరికం మీద పడింది. ఇంటికి నేనే పెద్ద కోడల్ని కావడాన ఇల్లు చక్కబెట్టాల్సిన బాధ్యత నామీదే వుంది"

"అంత చిన్న వయసులోనా? "

"అవునమ్మా. పదమూడేళ్ళ వయసులో పన్నెండుమంది కుటుంబసభ్యులకి వంట చేసి పెట్టేదాన్ని"

బిందు ఆశ్చర్యంతో నోరు తెరిచి "అంత మందికా? అంది."

"అతిశయోక్తులెందుకమ్మా, నిజమే చెప్తున్నాను. మా మామగారికి ఇద్దరు భార్యలు"

"అదేంటి? "

"పెద్ద భార్యకి సంతానం కలగకపోతే మళ్ళీ పెళ్ళి చేసుకున్నారు"

"పిల్లలు పుట్టకపోతే చేసేసుకోవడమేనా? అందుకు ఆవిడెలా ఒప్పుకుంది? "

"పిచ్చితల్లీ, అప్పట్లో ఎదిరించడం అనే ప్రసక్తే లేదు. మొగుడు ఏలుకొంటే ఏలుకున్నట్లు లేకపోతే ఆమె ఖర్మ అని సరిపెట్టుకోవడమే తప్ప అడగడం అనే మాటేలేదు"

"ఎంత దారుణం? ఒకవేళ మగవాడిలోనే లోపముండి పిల్లలు పుట్టలేదనుకో ఆ భార్య ఇంకో పెళ్ళిచేసుకోవచ్చా? "

"నీకిప్పుడు ఇలాంటి ఆలోచన వచ్చింది గానీ అప్పట్లో అంత తెలివి లేనేలేదు"

"తెలివి స్త్రీపురుషులిద్దరికీ సమానమే మామ్మా. అయితే ఈ మాత్రం స్వేచ్ఛ కూడా లేకపోవడాన అన్నిటికీ అలా రాజీ పడిపోయి బతికి వుంటారు"

"పంజరంలో వున్న చిలుక ఎగరడానికి అశక్తురాలైనట్లు ఆ తరం ఆడవాళ్ళు ఎదిరించలేక వూరుకుని వుంటారు. మొత్తానికి మా అత్తగారికి తొమ్మిదిమంది సంతానం కలిగారు. తాతయ్య పెద్దవాడు. ఆయనకి నలుగురు తమ్ముళ్లు, నలుగురు చెల్లెళ్లు. అందులో ఇద్దరు చెల్లెళ్లకి మాత్రం నేను వచ్చే సరికి పెళ్ళి చేశారు. దురదృష్టంకొద్దీ ఒకావిడ విధవగా మారి పుట్టింట్లోనే వుంది. మరో ఇద్దరు చెల్లెళ్లకి పెళ్ళి కావల్సివుంది"

"అంత చిన్న వయసులో భర్త చనిపోతే ఇక ఆమెకి మళ్ళీ పెళ్లి చేయలేదా మామ్మా? కందుకూరి వీరేశలింగం పునర్వివాహాల గురించి చాలా కష్టపడ్డారుగా"

"విధవా వివాహం అంత సులభమా? ఆవిడ మాతోనే వుండేది. పదేళ్ళక్రితం చనిపోయింది" అని నిట్టూర్చింది.

"అంటే ఇద్దరు అత్తగార్లు, మామగారు, తాతయ్య, నువ్వు, నలుగురు మరుదులు, ముగ్గురు ఆడపడుచులు టోటల్‌గా పన్నెండుమంది అన్నమాట"

"అందరికీ అన్నీ అమర్చిపెట్టడమే నా పని. ఇద్దరు చెల్లెళ్ల పెళ్ళిళ్లు మీ తాతే చేశాడు. తండ్రి ఇచ్చిన పదెకరాల పొలాన్ని పగలనకా, రేయనకా కష్టపడి పాతిక ఎకరాలు చేశాడు. అంత పాటుపడి, కుటుంబం కోసం రెక్కలు ముక్కలు చేసుకుంటే చివరికి మరుదులు తమ పెళ్ళిళ్ళయ్యాక పూర్తిగా మారిపోయారు"

"ఎందుకని? "

"మాకు నలుగురు ఆడపిల్లలు పుట్టారుగా. ఆస్తినంతా వాళ్ళకే కట్నరూపంలో పంచేస్తా

మేమోనని, తామెక్కడ అన్యాయం ఐపో తామో అనుకుని అందరూ కూడబలుక్కుని వాళ్ళ నాన్నని అంటే మా మామగారిని వేరుపడతామని ఆస్తి పంచమనీ అడిగారు"

"ఆయన బాగా కోప్పడ్డారా? "

"తిట్టి, ఉమ్మడిగా వుండమని ఒప్పించేం దుకు ఎంతగానో ప్రయత్నించారు. కానీ వాళ్ళొప్పుకోలేదు. అయితే మామగారికి కోపం వచ్చింది. పెద్దకొడుకు తమ్ముళ్ళతో వంతులు వేసుకోకుండా రాత్రింబగళ్ళు కష్ట పడటం ఆయనకి తెలీదా? అందుకే తాని చ్చింది పదెకరాలే గనుక అందులోనే పంచు కోండి అన్నాడు"

"మంచి మాటన్నాడు కదా"

"కానీ వాళ్ళూరుకోలేదు. ఊరి పెద్దలకి మాయమాటలు చెప్పి, వాళ్ళని తమ పక్షం చేసుకున్నారు. దాంతో పెద్దలు వాళ్ళకే వత్తాసు పలుకుతూ 'ఉమ్మడి పొలంలో పంట బాగా పండితేనేగా, దాన్ని అమ్మి డబ్బు ఆదా చేస్తూ ఇంకా పొలం కొనగలి గాడు. కనుక తర్వాత కొన్న పొలం కూడా అందరికీ చెందుతుంది' అంటూ న్యాయం చెప్పారు. దాంతో అన్నదమ్ములందరికీ అయిదెరకాల చొప్పున వచ్చింది"

"ఎంత అన్యాయం కదా మామ్మా? పొలాల్లో దానంతట అదే ఎక్కువ పంట పండదనీ, ఎంతో శ్రద్ధ తీసుకుని, ఎన్నో మెళకువలతో సాగుచేస్తేనే ఎక్కువ దిగు బడి వస్తుందని నాబోటివాళ్లకే తెలుస్తుందే. అలాంటిది పల్లెల్లో పుట్టి, పొలాల గురించి పూర్తిగా తెల్సినవాళ్ళకి తెలీదా? "

"సత్యమేవ జయతే అంటారుగానీ అధిక శాతం అన్యాయమే రాజ్యమేలుతుందమ్మా. ఉమ్మడిగా వున్నంతకాలం తన, పరభేదం లేకుండా ఎంత చేశామో ఊళ్ళో అందరికీ తెలుసు. తింటానిక్కూడా తీరిక లేకుండా పెద్ద పాలేరులా కష్టపడ్డాడమ్మా తాతయ్య. ఇక నేనయితే ఈ ఇంటికి ఏ నిమిషాన వచ్చానో అప్పుడే చెంగు దోపాను. ఈ మరుదులకి చేయాల్సొచ్చిందే అన్నట్లు కాకుండా వాళ్ళ పెళ్ళిళ్లయ్యేవరకూ కూడా అన్నీ అమర్చి, ఎక్కడా ఏ తేడా రాకుండా చూసుకున్నాను. వదిన ఎంత ఊడిగం చేసినా వాళ్ళకి చీకూ చింతా లేదు. ఎన్నడూ నువ్వు తిన్నావా వదినా, అన్న య్యకి పొలంలో తినేందుకు ఏమైనా ఇచ్చి రావాలా అని అడిగిన పాపాన పోలేదు"

"అది నీ తప్పేగా మామ్మా. అంత స్వార్థ పరులకి ఎందుకు చేయాలి? ఎలాంటివా ళ్ళతో అలా వుండకపోతే మనకే నష్టం కదా? "

"ఎదురుదెబ్బ తగిలి బొక్కబోర్లా పడేవ రకూ తెలీదమ్మా, మనం సరిగ్గా చూసుకుని నడవడంలేదని. అసలు చెప్పొచ్చేదేమంటే వాళ్ళకి పెళ్ళిళ్ళయ్యాక తమ పెళ్లాలు ఇంట్లో ఏ చిన్నపని చేస్తోన్నా వాళ్ళు కందిపోతు న్నారని, ఉమ్మడి కుటుంబంలో ఎంత చేసినా గుర్తింపు వుండదని కుక్కమీదో పిల్లి మీదో పెట్టి సూటీపోటీ మాటలు మాట్లాడే వాళ్లు. అలాంటప్పుడు గుండె తరుక్కుపో యేది. ఒక్క చేత్తో ఇంటిల్లిపాదికీ చేస్తే ఏనాడైనా ఒక్కటంటే ఒక్క మంచిమాట అన్న పాపాన పోయారా? అదే తమ పెళ్ళాలు కాస్త పని అందుకుంటే అలసిపో తారా? అంటే వాళ్ళని కూడా రాణుల్లా కూర్చోబెట్టి నేనే అంతా చేయాలనా? "

"తాతయ్య మాత్రం అంత మెత్తగా ఎందుకుండాలి? మరి నా భార్య మీ అంద రికీ చాకిరీ చేసేందుకే వచ్చిందా అని పోట్లా టేసుకోవద్దూ? "

"ఆయనంత గట్టిగా మాట్లాడగలిగేవాడైతే వాళ్ళ నోళ్లు పెగిలేవే కాదు. ఆ మెతకదనం కనిపెట్టే నోటికొచ్చినట్లు వాగేవాళ్ళు. మొత్తా నికి తాతయ్య కష్టంతో సంపాదించింది కూడా వాళ్ళ ఎదాన కొడితే కొట్టాంగానీ, ఒకరకంగా వాళ్ళెళ్ళిపోయాకే మేం కొంచె మైనా సుఖపడ్డాం"

"కానీ నల్గురు ఆడపిల్లల పెళ్ళిళ్లంటే





మాటలు కాదుగా"

"పిల్లల పెళ్ళిళ్ల సరే, కన్నాక తప్పదు. పొలాన్ని మాత్రం పంచుకుని మరుదులు జండా పీకేశారు. ఇంటికి పెద్ద కొడుకు కనుక తల్లిదండ్రులు నీ బాధ్యతేనన్నారు. విధవాడపడుచు మాతోనే వుండిపోయింది. అసలే పుట్టెడు దుఃఖంలో వుంటే నువ్వు మా ఇంట్లోనే ఎందుకుండాలి, మిగిలిన అన్నలు, తమ్ములు కూడా వున్నారుగా వెళ్ళ మని అనడానికి మేం మనుషులమే తప్ప వాళ్ళలా రాక్షసులం కాము కనుక మనసొ ప్పలేదు. ఇక తక్కిన ఆడపడుచుల పురుళ్ళు, పుణ్యాలు, పండుగలు, పబ్బాలు ఏవొచ్చినా తాతయ్యే వాళ్ళని తీసుకొచ్చి అన్నీ చూసి తిరిగి పంపేవాడు"

"సుఖాలొదిలేసి కష్టాలన్నీ మీరు పంచు కున్నారన్నమాట"

"అందుకే అంటారు ఇంటికి పెద్దకొడుకై పుట్టేకంటే అడవిలో తుమ్మమొద్దై పుట్టడం మేలని. పాపం ఆయనేనాడూ సుఖపడలే దమ్మా. అందర్నీ చూట్టమే సరిపోయింది. జన్మనిచ్చిన తల్లిదండ్రుల్ని చూడాల్సిందేన నుకో. వాళ్ళ బాధ్యత ఆయనదే. చెల్లెళ్ల బాధ్యతా ఆయనదే. అదయ్యేసరికి కూతుళ్ళు పెద్దవాళ్ళు అయ్యారు. మళ్ళీ వాళ్ళకి పెళ్ళిళ్ళు, పురుళ్ళు. కొంచెం ఒక అయిదేళ్ళ నుంచీ బాధ్యతలన్నీ పూర్తయి, ఊపిరి పీల్చు కుంటున్నాడంటే ఆరోగ్యం పాడైంది. సుఖ పడే యోగంలేదు మారాజుకి"

"తాతయ్యకేకాదు, నీకూ సుఖంలేదుగా మామ్మా. పెళ్ళికి ముందు ఏంసుఖపడ్డావో గానీ... అయినా మరీ పదమూడేళ్ళకి పెళ్ళి చేయడం ఏమిటి ఘోరంగా? బాల్యం అయినా ఆటపాటల్తో గడపక అప్పట్నుండే కుటుంబపు ఊబిలో కూరుకుపోవడం ఏమిటి? "

"అష్టవర్షాత్ భవేత్ కన్యా అన్నారు. అంటే ఎనిమిదేళ్లకే అమ్మాయి కన్య అవు తుందట"

"కన్య అవుతుంది, గొంతు నులిమి బావిలో పడేస్తే శవమూ అవుతుంది. బుద్ధీ జ్ఞానంలేనివాళ్ళు ఏదో రాస్తే అంతకంటే అజ్ఞానంతో అవన్నీ అమలుపరిచేవాళ్ళు కాబోలు" అంది బిందు.

శారదమ్మ నవ్వింది.

"అవును మామ్మా మీ అత్తామామలు మీ దగ్గరే వుండేవాళ్ళు అన్నావుగా. మరి వాళ్ళ కోసం అయినా పొలం కొంత ఎక్కువ ఇవ్వాలిగా మీ వాటాకి"

"మాదే లాక్కుపోయినవాళ్ళకి అందుకు మనసొప్పుతుందా? అలాంటిదేం లేకపోగా పెద్ద వయసులో వాళ్లు మూలపడ్డారు. వాళ్ళని ఒక్కనాడూ విసుక్కోకుండా చాకిరీ చేశానమ్మా. చేసి చేశానని చెప్తే ఫలితం వుండదనుకో. నా నోటితో నేనెన్నడూ అన కపోయినా చూసిన ఇరుగూ పొరుగూ 'వాళ్ళకి మీ ఆయన ఒక్కడే కొడుకయితే నువ్వే చేయాలి, తప్పదు. కానీ ఇంకో నల్గురు వుండి కూడా నువ్వొక్కదానివే ఎందుకు చేయాలి? ఆ కొడుకులు, కోడళ్ళు కడుపుకి అన్నమే తింటున్నారా?' అంటూ తిట్టేవాళ్ళు.."

అని చెప్తూ కొంచెం ఊపిరి పీల్చుకుని "నేనే వాళ్లని వారించేదాన్ని. తల్లిదండ్రుల మీద దయలేని పిల్లల్ని వేమన్న చెదపురు గుల్తో పోల్చి చెప్పాడు. అలాంటి చెదపురు గుల్తో మనమెందుకు వంతుపెట్టుకోవాలి? వాళ్ళు చూడటం లేదని ఈ వయసులో మేమూ వదిలేస్తే వాళ్ళ గతేం అవుతుంది? అప్పుడు మేం కూడా చెదపురుగులమే, రాక్ష సులమే. ఇక మాకూ, వాళ్లకీ తేడా ఏముం టుంది-అనేదాన్ని"

"నువ్వన్నదే కరక్టు మామ్మా. ఆ పశువు లతో వంతుపెట్టుకుని మీరు కూడా వాళ్ళని చూడకపోతే అనాథల్లా అయి ఎంత బాధ పడేవాళ్ళో కదా"

"అంత దుర్మార్గం మాలో లేదులే. ఒక్కో

సారి నాకు అన్పిస్తుంది. మా అత్తమామల్ని అరమరికలు లేకుండా చూడబట్టే ఇవాళ్టిరోజున ముసలితనంలో మూలపడకుండా గిరగిరా తిరిగి అన్నీ చేసుకోగల్గుతున్నానేమోనని. ఇలా కాకుండా ఏ కాలో చెయ్యో పడిపోయి మంచం పట్టుకు వేళ్ళాడ్తే మా గతేం కావాలి? మమ్మల్నెవరు చూస్తారు? " అంటోంటే శారదమ్మ కళ్ళలో నీళ్ళూరాయి.

"ఛఛ... అలా కన్నీళ్ళు పెట్టుకోకు మామ్మా, అందరి సంగతి వదిలేయ్. నిన్నూ, తాతయ్యనీ చూసుకోడానికి మేమిద్దరమూ లేమా? " అంది బిందు ఆమె చేతులు రెండూ తీసుకొని చెంపలకి

ప్రేమగా ఆనించుకుని.

★ ★ ★

"పనైపోయిందా వదినా?" అంటూ వచ్చింది పక్కవీధిలో వుండే మంగమ్మ.

"ఆ, అయిపోయినట్లే. నేనొచ్చేస్తున్నాను. నువ్వు వేపచెట్టుకింద కూర్చో మంగమ్మా" అంది శారదమ్మ.

వేపచెట్టు నీడన ఎంత ఎండలో అయినా సరే కాస్తయినా వేడిమి తెలియకుండా



చల్లగా, హాయిగా వుంటుంది. అందుకే అక్కడ కూర్చునేందుకు వీలుగా వీరయ్య చెట్టు చుట్టూ అరుగు కట్టించాడు.

మంగమ్మ వంగిపోయిన నడుముతో మెల్లగా వెళ్ళి ఆ అరుగుమీద తను తెచ్చిన సరంజామా పేర్చి విస్తళ్ళు కుట్టసాగింది.

కొద్దిసేపటికే శారదమ్మ తను కూడా వెళ్ళి పక్కన కూర్చుని కుట్టడం మొదలుపెట్టింది.

"ఏమన్నా కాస్త గిట్టుబాటుగా వుందా మంగమ్మా?"

"ఏంగిట్టుబాటు లేమ్మా? జరుగుబాటే కష్టమైపోతోంది. కృష్ణారామా అంటూ కాల క్షేపం చేయాల్సిన వయసులో కూడా నాలుగు తిండిగింజలకోసం ఇంత యాతన పడాల్సి రావడమేంటో? దేవుడు చప్పునొచ్చి నా ప్రాణాలు తీసుకుపోయినా బాగుండు"

శారదమ్మ "అలా అనకు మంగమ్మా. ఎవరెంతకాలం వుండాలో ముందే రాసిపెట్టి వుంటుంది" అంటూ వారించింది.

"ఏంరాసిపెట్టడమో? సుఖంగా వున్న వాళ్ళు పది కాలాలపాటు బతకాలి గానీ, పూటపూటకి తిండిగింజలకి వెతుక్కునే నాలాంటి వాళ్ళకి ఇంత ఆయుష్షెందుకు?"

"ఏంచేస్తాం మంగమ్మా, గత జన్మలో చేసిన పాపాలు మూటగట్టుకు వచ్చి ఈ జన్మలో అనుభవిస్తాం. అందుకే ఈ జన్మలో అయినా మంచిచేద్దాం"

"ఏంటి మామ్మా, ఈ జన్మ, గత జన్మ, పైజన్మ అంటూ జన్మజన్మల అనుబంధాల గురించి మాట్లాడ్తున్నారు?" అంటూ వాళ్ళ దగ్గరికొచ్చింది బిందు.

"ఎవరీ అమ్మాయి వదినా? మనవ రాలా?"

"ఆ, మనవరాలే. రెండో అమ్మాయి కొడుకు హరి లేడూ, వాడిక్కాబోయే పెళ్ళాం"

బిందుకి సిగ్గుగా అన్పించింది అలా అనే సరికి.

"బాగుంది. ఇంకా పెళ్ళికాకుండానే తీసుకొచ్చేశాడా?"

"నేను చూస్తానంటేనూ, నాకోసం తీసుకొచ్చాడు" ఆవిడలా కవర్‌చేసి చెప్పేసరికి మామ్మమీద ప్రేమ పెరిగింది.

"ఈవిడెవరు మామ్మా?" అనడిగింది బిందు.

"మంగమ్మగారని పక్కవీధిలో వుంటారు"

"ఇంతకీ మీరు ఇందాకేదో జన్మల గురించి మాట్లాడ్తున్నారు ఏమిటి?"

"ఏముంది? గత జన్మలో చేసిన కర్మ ఫలితాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నాం. ఈ జన్మలో అయినా మంచి పనులు చేస్తే వచ్చే జన్మలో సుఖపడొచ్చు అని"

"అదంతా పిచ్చి నమ్మకం మామ్మా. కర్మ ఫలమే వుంది తప్ప ఖర్మ అంటూ ఏదీ లేదు"

"లేకపోతే ఇలా ఎందుకుంటాం? నన్నే తీసుకుంటే అత్తమామలకి, ఆడపడుచులకి, మరుదులకి అందరికీ సేవలు చేశాను. అయినా ఒక్క మగనలుసుని కూడా ఎందుకివ్వలేదు. ఈ పెద్ద వయసులో ఓపికున్నా లేకపోయినా మాకు మేమే చేసుకోవాలిగా. సరే, ఇంకా కాళ్ళలో సత్తువ వుండబట్టి లేచి తిరుగుతున్నాం. ఈమాత్రం కూడా తిరగ లేని పరిస్థితి దాపురిస్తే, ఒకవేళ ఏ కాలో చేయో పడిపోయి మంచాన పడితే మమ్మల్ని ఎవరు చూస్తారు? అనాథ ప్రేతాల్లా తనువు చాలించాల్సి వస్తుంది కదా?"

బిందూకి బాధేసింది.

"మగవాళ్ళే పిల్లలా మామ్మా? ఆడపిల్లలు, వాళ్ళకి పుట్టినవాళ్ళు మాత్రం నీవాళ్ళు కారా?" అంది.

"ఆడపిల్లలు పెళ్ళయ్యేవరకే మన పిల్లలు. ఆ తర్వాత భర్త, అత్తమామల చెప్పుచేతల్లోకి వెళ్ళిపోతారు"

బిందూకి ఆ మాట అస్సలు రుచించ లేదు. ఆ ఆలోచన తప్పని, స్త్రీ అయినా, పురుషుడైనా ఒక వయసు వచ్చాక




స్వయంగా ఆలోచించుకుని ఏది ఎలా చేయాలనిపిస్తే అలా చేయాలని, దాన్నే వ్యక్తిత్వం అంటారని చెప్పాలన్పించినా వృథాప్రయాస అనుకుని విరమించుకుంది.

మళ్ళీ శారదమ్మే "అయినా మగపిల్లలు పుట్టలేదని చింతిస్తున్నానుగానీ, మగ సంతానాన్ని కన్నవాళ్లు మాత్రం ఏం బావుకుంటున్నారు? మా అక్కయ్యకి ఇద్దరు కొడుకులు. ఇద్దరూ డబ్బు యావలో పడి దేశాన్ని వదిలి అమెరికా వెళ్ళారు. మంగమ్మకి ఇద్దరు కొడుకులున్నారు, ఏంలాభం ఇద్దరికీ తల్లి బరువైపోయి, వదిలించేసుకున్నారు. కనుక పుత్రరత్నాలున్నా చూస్తారన్న నమ్మకం లేదు" అంది.

"ఎక్కడుంటారు మీ పిల్లలు?" అడిగింది బిందు.

"పెద్దోడు ఈ ఊర్లోనే వుంటాడమ్మా. చిన్నోడు నందపల్లిలో వుంటాడు"

"ఇద్దర్నీ చదివించలేదా?"

"పెద్దవాడు పదేళ్ళ వయసులో వున్నప్పుడే వాళ్ల నాయన ధనుర్వాతం చేసి పోయాడు. ఇక వాణ్ణి చదివించడం నావల్లనేమౌతుంది? ఇంట్లో మగదిక్కులేదు. మా అత్తమ్మ, నేనూ కూడా మగవాళ్ళకిమల్లే పొలానికెళ్ళి సేద్యంచేశామమ్మా. ఏమాటకామాటే చెప్పుకోవాలి. పెద్దవాడు ఆ వయసులోనే మాకు చేదోడువాదోడుగా వుంటూ వ్యవసాయపు పనులు నేర్చుకున్నాడు"

"అప్పుడు మీ చిన్నబ్బాయికి ఎన్నేళ్లు?"

"రెండేళ్ళు. మేం ముగ్గరం పొలంపనులు చేసుకుంటూ చిన్నవాడైనా బాగుపడ్తాడని పదోతరగతిదాకా చదివించాం. ఆ చదువుతో మున్సిపల్ ఆఫీసులో గుమస్తా ఉద్యోగం సంపాదించాడు"

"కేవలం పదోతరగతితో ఉద్యోగం వచ్చిందా? ఇప్పుడైతే పెద్దపెద్ద చదువులు చదివినా ఉద్యోగం రావడం మహాకష్టం"

"ఆరోజుల్లో అంత పోటీ లేనందున వచ్చి వుంటుంది. ఇప్పుడు వాడి బిడ్డలు నువ్వన్నట్లు పెద్దచదువులు చదివి కూడా ఉద్యోగాల్లేక ఎదురుచూస్తున్నారు"

"అద్సరే... గవర్నమెంటుద్యోగం చేస్తోన్న మీ చిన్నబ్బాయి మిమ్మల్ని తన దగ్గర అట్టిపెట్టుకోవచ్చుగా"

"అడ్డాలనాడే బిడ్డలుగానీ గడ్డాలొచ్చాక కాదు అంటారు. అలా వాడికి ఈ తల్లి పొడ గిట్టడంలేదమ్మా"

అలాంటి కొడుకుల్ని బతకనివ్వడంకంటే భూస్థాపితం చేయడం మేలనుకుంది బిందు. ఎంత కష్టం కలిగించినా తన కొడుకుని పరాయివాళ్ళు ఏదైనా అంటే బాధగా వుండొచ్చని ఆ మాటలు పైకి రాకుండా కంట్రోల్ చేసుకుంది.

"చిన్నకోడలు ఆరో తరగతి వరకూ చదువు వెలగబెట్టింది. ఆ మాత్రానికే ఆవిడగారు కలకటేరులా యమదర్జా చూపుతుంది"

"ఆవిడ ఆరోతరగతికే ఫోజుకొడ్తుంటే నేనింకా చాలా ఫోజు కొట్టొచ్చు". అంటూ కళ్ళెగరేసి నవ్వింది బిందు.

"అన్నీ వున్న విస్తరాకు అణిగేవుంటుంది. ఏమీ లేని ఆకే ఎగిరెగిరి పడ్తుంది" అంది మంగమ్మ.

"భార్యాపిల్లల్ని పోషిస్తోన్న అతనికి మీరొక్కరే ఎక్కువయ్యారా?"

"ఎవరి అవసరం వుంటుందో వాళ్ళు బరువుకారు. ఇప్పుడు వాడికి నా అవసరం ఏముంది?"

"గుర్రప్పందాలకి ఉపయోగించే గుర్రాలకి మంచి ఆహారం ఇస్తూ, వైద్యం చేయిస్తూ ఎంతో బాగా చూసుకుంటారట. తీరా అది ఆరోగ్యం పాడయ్యో, ముసలిదయ్యో పందేనికి పనికిరాకుంటే దాన్ని కాల్చి చంపేస్తారట. ముసలితనంలో తల్లిదండ్రులు కూడా పనికిరాని గుర్రాల మాదిరి అవుతున్నాం"

"ఆ గుర్రాలని కాల్చేసినట్లు నన్ను కూడా కాల్చి చంపినా బాగుండును వదినా. నాకు చావెప్పుడొస్తుందో ఏమో. బలవంతపు



చావు చావాలంటే దెయ్యాన్నవుతానేమోనని భయంగా వుంది" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది మంగమ్మ.

మంగమ్మ అలా అనేసరికి శారదమ్మకి, బిందూకి కూడా విపరీతమైన ఆందోళన కలిగింది.

బిందూకైతే హృదయం మరుగుతున్నట్లే వుంది. ఆవిడ కొడుకుల్ని, కోడళ్ళనీ కూడా కలేసి కట్టేసి అరేబియా సముద్రం మధ్యలోకి విసిరేయాలి అన్నంత ఆవేశమొచ్చింది.

'అన్నీ చేయించుకుని పెరిగి పెద్దవుతారే. తీరా సంపాదనా పరులయ్యేసరికి తల్లిదండ్రులు ఆనరా? ప్రపంచంలో మరెవ్వర్ని ఆదరించినా ఆదరించకపోయినా పర్లేదు గానీ మనకి జన్మనిచ్చిన వాళ్ళని దూరంచేసుకుంటే ఎలా? వాళ్ళని బతికున్న శవాలుగా తయారుచేసి, ఈ లోకంలోనే నరకాన్ని చూపిస్తే ఎలా? ఇలాంటి పిల్లలకి ప్రభుత్వం ఏ శిక్షా విధించదా? ఇలాంటి కసాయి సంతానం దోషులకిందికి రారా? నిర్లక్ష్యం, హృదయం లేకపోవడం అనేవి నేరాల పరిగణనలోకి రావా?' అలా బిందూ ఒక అంతూదరీలేని ఆలోచనల్తో సతమతమౌతోంది.

"నీ చిన్న కొడుకు ఎంత స్వార్థపరుడో ముందే తెలుసు మంగమ్మా. అన్నమంతా పట్టి చూడనక్కర్లేదంటారు చూడు అలా వాడి నైజం ఎప్పుడో అర్థమైంది. కనుక వాడేదో నిన్ను ఉద్ధరిస్తాడని నేను కల్లో కూడా అనుకోలేదు. కానీ పెద్దవాడు చిన్నతనంనుంచీ కష్టజీవిగా పెరిగాడు. మంచీ చెడూ, కష్టంసుఖం అర్థంచేసుకుంటాడు కనుక నిన్ను బాగా చూసుకుంటాడు అనుకున్నానమ్మా. అందరికీ ఆ జబ్బే సోకినట్టు వీడు కూడా చిన్నవాడిలా పచ్చి స్వార్థపరుడౌతాడు అనుకోలేదు" అంది శారదమ్మ.

"నేనూ అంతే అనుకున్నాను వదినా. ఆయన లేకపోయినా పిల్లల్ని పెంచి పెద్దచేశాను. నా కష్టాన్నంతా మర్చిపోయి వాళ్ళని చూసి మురిసిపోదాం అనుకున్నాను. కానీ అదేం లేకపోగా నా తిండికే లోటొస్తుందనీ, నేనే వాళ్ళకి భారమౌతాననీ అనుకున్నానా?" అంది.

"అయినా మంచివాడు అనుకున్న పెద్దవాడికి ఇలాంటి బుద్ధెందుకు పుట్టింది మంగమ్మా?"

"ఏం చెప్పమంటావు వదినా? మనం ఎన్నో ఆశలతో మన పిల్లలు సుఖంగా వుండాలి, కోడలొచ్చి సందడిగా తిరగాలి, ఇంట్లో మనవలు తిరగాలి అనుకుని వాళ్ళ పెళ్ళిళ్లు చేస్తాం. కానీ ఆ కోడళ్లు వస్తూనే ఇంటిని గుప్పిట్లో పెట్టుకోవాలనీ, మొగుణ్ణి కొంగుకి కట్టుకోవాలనీ, అత్తమామల ముసలివాసన భరించలేక విసిరి పారేయాలనీ చూస్తారు"

"కొడుకులు సరైన వాళ్ళయితే కోడళ్ళు ఏంచేయగలరు?"

"నువ్వన్నమాటా నిజమే. మన బంగారం మంచిదైతే కంసాలేం చేస్తాడు అని... నేను కన్నాను కనుక నా పిల్లలు గొప్పవాళ్లు అనను. కానీ..."

శారదమ్మ, బిందూ చెప్పమన్నట్లు చూశారు.

"పెద్దవాడు చిన్నవాడంత గడుసువాడు కాదు వదినా. పెళ్ళికి ముందు నన్ను బాగా చూసుకునేవాడు. ఏ పనిచేయాలన్నా నన్ను సంప్రదించేవాడు. చేయమంటే చేసేవాడు, వద్దంటే మానేవాడు. పెళ్ళాం వచ్చాక ఇక నన్ను అడగడం మానేసి ఆమెనే అడగడం మొదలుపెట్టాడు. అందుకు నేనేం ఈర్ష్య పడలేదు. నేనూ పెద్దదాన్ని అయ్యానుగా అదే మంచిది లెమ్మనుకున్నాను..."

"రానురాను నన్నసలు పలకరించడమే మానేశాడు. అది తట్టుకోలేకపోయాను. నాలో నేను కుమిలిపోయేదాన్ని. అదీ చాలదన్నట్లు మొగుడూ పెళ్ళాలిద్దరూ గునుస్తూ వుండటం, పిల్లిమీదో, కుక్కమీదో పెట్టి ఏదో





ఒకటి సాధించడం మొదలుపెట్టారు"

"అంటే అంచెలంచెలుగా మారుతూ వచ్చారన్నమాట"

"ఎదురుతిరిగే ధైర్యం లేకపోయేసరికి మరింత రెచ్చిపోయారనిపిస్తోంది"

"పిల్లల్ని ఏమైనా అనేందుకు ధైర్యం కావాలా? " ఆశ్చర్యపోయింది బిందూ.

"నేను పెంచినంతవరకూ, నా అవసరం వున్నంతవరకే పిల్లలమ్మా. వాళ్లూ నా అంత ఎదిగి, సంపాదనపరులయ్యాక ఇంకా పిల్లలేంటి? వాళ్ళు పులులు, నేను పిల్లిని" అంటూ నిట్టూర్చి "నాకెవరున్నారు? ఆయన ఎన్నడో నన్నొదిలేసి పోయి స్వర్గాన కూర్చుని చోద్యంచూస్తుండే. పోనీ మా అత్త గారయినా వుందిలెమ్మనుకుంటే ఎన్నాళ్లు శిలేసుకుని వుంటుంది, కాలం చెల్లి ఆవిడా పోయింది. వున్న ఇద్దరు కొడుకులూ పరాయివాళ్ళయ్యారు. ఇక ఎదిరించే ధైర్యం ఎక్కణ్ణించి వస్తుంది? " అంది మంగమ్మ భారంగా.

బిందూకి అదంతా జీర్ణంకావడంలేదు. కళ్ళని ఆల్చిప్పల్లా చేసుకుని చూస్తోంది.

"సాధిస్తూనో, ఛీత్కరించుకుంటూనో పట్టెడు అన్నం పెడ్తోంటే సిగ్గూశరం, మానం, అభిమానం అన్నీ చంపుకుని తినే దాన్ని"

"ఏంచేస్తాం మంగమ్మా? మనసుకి ఎంత కష్టంగా వున్నా బొందిలో ప్రాణం వున్నంతవరకూ శరీరానికి ఆకలి వుంటుం దిగా. మహా అయితే ఒకరోజో, రెండ్రోజులో అలిగి అభోజనంగా వుండగలం కానీ పూర్తిగా తిండి మానేయలేంగా" అంది శారదమ్మ.

బిందూకి కడుపులో దేవినట్లైంది.

"చిన్నతనంలో పిల్లలు అన్నం తినకపోతే చందమామని, నక్షత్రాలని, గోంగూరని, వంకాయనీ చూపిస్తూ, ఓపిక లేకపోయినా ఎత్తుకుని ఇంట్లోకీ వాకిట్లోకి తిరుగుతూ గోరుముద్దలు చేసి తినిపిస్తారు. తమకి నీరసం ముంచుకొచ్చినా సరే వాళ్ళు తింటే చాలనుకుంటారు. అలాంటిది ఆ తల్లిదండ్రులే పెద్దతనంలో గుప్పెడు మెతుకులు ఎప్పుడు పడేస్తారా అని ఆశగా చూస్తోంటే సాధిస్తారా? " అంది బిందు జీరపోయిన గొంతుతో.

"సాధిస్తూనైనా పెట్టేవాళ్ళు కొందరుంటే, అసలు పెట్టనే పెట్టం అని రోడ్డుమీదికి గెంటేసేవాళ్ళూ వున్నారమ్మా" అంది శారదమ్మ.

"చావు కబురు చల్లగా చెప్పినట్లు నా పెద్దకోడలు ఒకరోజు కంచంలో అన్నం వడ్డించి "అత్తయ్యా, నీకు కోపం వచ్చినా తాపం వచ్చినా మేం చేయగల్గిందేంలేదు. రేపట్నించీ నీ వంట నువ్వొండుకో. మీ అబ్బాయి తను చెప్పలేక నాతో చెప్పించాడు" అంది.

"నిజంగా అంత డైరెక్టుగా అలా చెప్పిందా? "

"నిక్షేపంగా చెప్పింది. నేను తెల్లబోయి మీకు తెలీని ఆస్తులు నాకేం వున్నాయి? ఎక్కణ్ణించి ఏం తెచ్చుకుని వండుకోమంటారు? " అన్నాను. అంతవరకూ శాంతంగా వున్న పెద్ద కోడలు గయ్‌మని లేచింది. "మా ఆయనొక్కడే నీ కడుపున పుట్టాడా? నందపల్లిలో వున్న నీ చిన్నకొడుకూ, కోడలూ గవర్నమెంటుద్యోగం చేసుకుంటూ దర్జాగా బతుకుతున్నారు. వాళ్ళని అడిగి తెచ్చుకో" అంది.

బిందూ, శారదమ్మలకి ఆ దృశ్యం కళ్ళక్కట్టినట్లు కన్పిస్తోంది.

"... అలా ఏమీ తెలీనట్లు మాట్లాడతావేంటమ్మాయి? నీ మరిది గురించి, తోటి కోడలి గురించి నీకు తెలీదా? వాళ్ళు నన్ను చూసే మాటుంటే ఇక్కడే ఎందుకుంటాను? " అన్నాను. ఆవిడ లబలబలాడ్తూ "అయితే మంచిగా వుండటమే మా తప్పా? వాళ్లేమో ఏ బాధ్యతా లేకుండా జల్సాగా బతుకుతోంటే మాకే పట్టిందా? ఇన్నాళ్లూ



చూసిందే ఎక్కువ. ఇకమీదట చిన్న కొడుకుని నిలదీసి చూస్తాడో లేదో తేల్చుకోండి. లేకుంటే పెద్ద మనుషుల్లో కాస్త గడ్డిపెట్టించండి" అంటూ మజ్జిగనీళ్ళు కుడితొట్లో పోసినట్లు విసురుగా పోసి నేలని ధనధనా తన్నుకుంటూ వెళ్ళిపోయింది" అంది మంగమ్మ.

గుండెని రంపంతో కోసినట్లున్న ఆ సంఘటన మంగమ్మ ఎన్నటికీ మర్చిపోలేదు. అది ఎంతో తాజాగా నిన్నే జరిగినట్లుగా వుంటుంది.

"తర్వాతేమైంది? మీ చిన్నబ్బాయి దగ్గరికి వెళ్ళి చూశారా? "

"లేదమ్మా. వాడి దగ్గరికి వెళ్ళడం అనవసరం అని తెల్సు. అందుకే వెళ్ళలేదు. అలాగని అంత ఖరాఖండిగా చెప్పాక ఆ ఇంట్లోనూ వుండాలన్పించలేదు. నాకు వున్న ఆస్తి అంతా కట్టుకునే బట్టలేగా. అవి తీసుకుని మునుసబుగారిని అడిగి నాలుగు రూకలు తెచ్చుకుని సుందరయ్య గారింట్లో ఒక గదిలో వుండటం మొదలెట్టాను. ఆయన పాపం పుణ్యాత్ముడమ్మా. అద్దె కూడా ఇవ్వనవసరంలేదన్నాడు. చచ్చి ఆయన కడుపున పుట్టి ఋణం తీర్చుకోవాలి"

"అలా అనకు మంగమ్మా. ఇరుగూపొరుగూ ఒకరికి ఒకరు సాయం చేసుకుంటే అందులో ఋణాలేముంటాయి? "

"అంత తేలిగ్గా ఎలా తీసేయగలంలే వదినా? కన్నవాళ్ళే రోడ్డుమీదికి గెంటేశాక ఇక పరాయివాళ్ళు ఆదరించాలని ఎక్కడుంది? "

"మామ్మగారూ, అసలు మీరే ఎందుకు వుంచుకోలేదు ఆవిణ్ణి? ఇంత పెద్దింట్లో మీరిద్దరే వుంటున్నారు కదా, ఆవిణ్ణి కూడా ఇక్కడే వుండమనాల్సింది"

"అప్పట్లో మంగమ్మతో నాకు ఇంత దగ్గరితనం లేదమ్మా. సుందరయ్యగారింట్లో చేరే వరకూ నాకసలు ఇలాని తెలీనే తెలీదు"





"ఊళ్ళల్లో అన్నీ అందరికీ తెల్సిపోతాయంటారు? "

"నిజమేగానీ మొదట తెలీదమ్మా. నాకేమో పెద్దగా బయట తిరిగే అలవాటు లేదు. తర్వాత తెల్సినా అడగడం బాగోదని నేనెన్నడూ అడగలేదు"

"సుందరయ్యగారింట్లో చేరాక వీరిల్లు దగ్గరై, వదినతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఆ తర్వాత వదిన ఇక్కడే వుండమని చెప్పిందమ్మా. అయినా సుందరయ్యగారు ఏమైనా అనుకుంటారని నేనే వద్దన్నాను" అంది మంగమ్మ.

"మొత్తానికి మీకు ఇప్పుడు తినడానికి ఇబ్బందేం లేదు కదండీ? "

మంగమ్మ నిట్టూర్చింది.

"అపార్థం చేసుకోకండి. నేనేదో మిమ్మల్ని కించపర్చాలని అడగడం లేదు"

"కష్టంగానే వుందమ్మా" అంది మంగమ్మ ఇక అంతకంటే చెప్పలేక.



"అమ్మాయి బిందూ, ఇవాళ మా అక్కయ్యా వాళ్ళ ఊరు వెళ్దాం. నా పనయ్యేలోగా త్వరగా స్నానంచేసి తయారవ్వు" అంది శారదమ్మ.

"ఏ ఊరు మామ్మా? ఇక్కణ్ణించి ఎలా వెళ్తాం? "

"బీరపాడని ఎంతోదూరం కాదులే, ఒక గంటలో వెళ్ళగలం"

"అలాగే వెళ్దాం. అక్కడెవరెవరు వుంటారు? "

"తినబోతూ రుచి అడగడమెందుకు? స్వయంగా చూద్దువుగాని"

"సర్లే మామ్మా, సస్పెన్సుని బ్రేక్ చేయడ మెందుకులే? అన్నట్లు హరి వస్తున్నాడా? "

"ఇందాక అడిగితే రానులే మీరెళ్ళండి, నాకు వేరే పనుంది అన్నాడు"

'ఏంటబ్బా అంత రాచకార్యం? ' అని తన లోతాను అనుకుని అక్కణ్ణించి కదిలింది స్నానానికి బట్టలు తీసుకునేందుకు.

గదిలో హరి ఏదో సర్దుకుంటూ కనిపించాడు.

"అమ్మమ్మ ఊరెళ్దాం రమ్మంటే రానన్నావట. ఏంటో ఈ ఊళ్లో నువ్వు చక్కబెట్టాల్సిన ఘనకార్యాలు? " అంది బిందు.

"మరీ ఘనకార్యం కాకపోయినా ఒక మోస్తరు క్రియే"

"క్రియా? ! కర్తా, కర్మా, విశేషణం కాదా? "

"గ్రామర్లో వచ్చే క్రియ కాదులే"

"తెలుగు బొత్తిగారాని ఫూల్ కింద జమ కట్టకు. ఇంతకీ ఏం పని? "

"విజయవాడ వెళ్ళాలి"

"వెళ్ళి? "

"అమ్మాయిలకి సైట్ కొడ్దామని"

"నీకు అంత సీన్ లేదులే. నేనంటే పిచ్చి మాలోకాన్ని కనుక నీ బుట్టలో పడ్డాను"

"నువ్వేం పామువా, బుట్టలో పడేందుకు"

"పామునో, పావురాన్నోగానీ అసలు సంగతి చెప్పు"

"నా క్కాబోయే భార్య చాలా ఇబ్బంది పడ్తోంది. తనకోసం పేస్టు, షాంపూ, టాల్కం యిస్‌లాంటివి తీసుకొద్దామని"

బిందూకి చెప్పలేనంత సంతోషం కలిగింది. తన ఇబ్బందిని గుర్తించి అంత దూరం నడిచెళ్ళి, నడిచి రావడానికి సిద్ధపడిన హరిమీద ప్రేమ పొంగుకొచ్చింది.

"నువ్వామాట అన్నందుకు థాంక్యూ హరీ, కానీ నేను అంత సెల్ఫిష్‌కాదు. నువ్వంత కష్టపడి అవన్నీ తీసుకొస్తే నాకేం అవి ఆనందాన్నివ్వవు. రెండురోజులు గడిపి నదాన్ని ఇంకో రెండ్రోజులు సర్దుకోలేనా? " అంది.

"అంతొద్దులేమ్మా. దీన్ని అలుసుగా తీసుకుని ఫ్యూచర్లో దెప్పితే నేను భరించలేను"

"ఛ... నేనేం అనను"

"నిన్నెవరు నమ్మొచ్చారు? ఎప్పుడో దేనికో మండిందంటే ఇలాంటివన్నీ గుర్తొస్తాయి"

"ఏమీరావు. ఈ విషయంలో నిన్నేం అననుగా"

"ఇప్పుడు నేనేం విననుу. నేనివాళ సిటీ వెళ్ళాలని నా మైండ్ ప్రిపేరైపోయింది. అందులో మార్పులుండవు" అంటూ స్నానానికి వెళ్ళిపోయాడు.

ఇక తనమాట వినడని తెల్సి, ఇదేం మొండితనమనుకుంటూ బిందూ కూడా స్నానానికి వెళ్ళింది.

అందరి స్నానాలూ పూర్తయ్యాక వెళ్లే హడావిడి వుండటాన నలుగురికీ ఒకేసారి భోజనాలు వడ్డించింది.

"సాయంత్రానికి వచ్చేస్తారుగా" అన్నాడు వీరయ్య భార్యని ఉద్దేశించి.

"అదేంటి తాతయ్యా? మీరు రావడం లేదా? " అంది బిందు.

"రానులేమ్మా. ఇంట్లో ఎవరూ లేరుగా"

"అబ్బో, మనింటిని పిల్లెత్తుకెళ్తుందని కాపలానా? " అంది శారదమ్మ.

"నేను రానులే, మీరెళ్ళిరండి. సందెవేళకి వచ్చేయండి పురుగూపుట్రా వుంటాయి. అందునా ఆడవాళ్ళిద్దరే వెళ్తున్నారు"

"అందుకే మాకు తోడుగా వుండటం కోసమైనా రావచ్చుగా"

"రానులే, ఒంట్లో సత్తువ లేదివాళ"

"అయితే ఒక పని చేయండి అమ్మమ్మా"

"ఏవిట్రా? "

"ఇవాళ నేనెటూ సిటీ వెళ్తున్నానుగా అవీ ఇవీ తెచ్చేందుకు. వాటితోబాటు గ్లూకాన్‌డీ కూడా ఒక ప్యాకెట్ తెస్తాను. అది తాగితే బోల్డంత శక్తి వస్తుంది తాతయ్యకి. కనుక మీ ప్రయాణం రేపు పెట్టుకోండి"

"బాగానే వుంది సంబడం. మీ తాతయ్యకి శక్తొచ్చాక ఇంకోసారి వెళ్తాంగానీ ఇవాళ ఆగేదిలేదు. రాత్రి కల్లో అక్కయ్య కన్పించినప్పట్నుంచీ తనని చూడాలని తెగ పీకుతోంది"

ఇక ఆ విషయం గురించి ఎవరూ రెట్టించలేదు. భోజనాలయ్యాక వీరయ్య పడుకోవడానికి సిద్ధమవుతోంటే వాళ్ళు ముగ్గురూ బయల్దేరారు.

శ్రీహరి సిటీకి వెళ్ళేవైపు దారితీస్తే శారదమ్మ, బిందు బీరపాడు వెళ్లేమార్గాన్ని అనుసరించారు.

బిందు గ్రామ వాతావరణానికి కొద్దిగా అలవాటుపడి, మానసికంగా ప్రిపేరవడాన కావచ్చు నడుస్తోంటే, తాను ఈ ఊరికి వచ్చే రోజున కలిగినంత కష్టము, చిరాకు ఇవాళ కలగలేదు. వయసులో ఎంతో పెద్దదైన మామ్మగారే నడవగా లేనిది తాను నడవలేనా అని కూడా అన్పించి వుంటుంది.

★ ★ ★

శారదమ్మ, బిందులని అంతదూరంలో చూసిన అరుంధతమ్మ కళ్ళమీద చేయి అడ్డంపెట్టుకుని కళ్ళు చికిలించి చూస్తూ ఎవరో గుర్తుపట్టే ప్రయత్నం చేస్తోంది.

"ఏంటక్కయ్యా అలా చూస్తున్నావు? " అంది శారదమ్మ దగ్గరగా వెళ్ళి పక్కన కూర్చుని.

"నువ్వటే చిన్నమ్మా. ఈ అమ్మాయెవరు? "

"హరికి కాబోయే భార్య"

అరుంధతమ్మ నవ్వి "కూర్చోమ్మా" అంది.

బిందు కూర్చున్నాక అరుంధతమ్మ వెళ్లి కుండలో మంచినీళ్ళు తెచ్చిచ్చింది.

నీళ్ళు తాగేక అందరూ లోపలిగదిలోకెళ్ళారు.

వెంకటయ్య పడుకుని వున్నాడు.

"నిద్రపోతున్నట్లున్నారు బావగారు" అంది శారదమ్మ.

"నిద్రకాదు" అని, "ఎవరొచ్చారో చూడయ్యా" అంది.

వెంకటయ్య కళ్ళు తెరిచి చూసి "బాగున్నావా చిన్నమ్మా? " అన్నాడు.

"బాగానే వున్నాను. రాత్రి అక్కయ్య కలలో కన్పించేసరికి పొద్దున్నే ఇలా పరిగెత్తుకుంటూ వచ్చాను"

"నీకైనా కలలో కన్పించినందుకు సంతోషంగా వుంది చిన్నమ్మా"

"అదేంటక్కయ్యా అలా అంటావు? నువ్వెప్పుడూ గుర్తొస్తూనే వుంటావు. కాకపోతే మునుపటిలా చిటుక్కున రాలేకపోతున్నాను. మరీ మంచాన పడలేదన్న మాటేగానీ వయసుడిగి ఓపిక తగ్గిందిగా"

"నీమీద నాకేం నిష్ఠూరం లేదు చిన్నమ్మా. నువ్వు కనుకనే ఈ అక్కయ్య ఇంకా బతికుందని గుర్తుంచుకుని పలకరించి వెళ్తుంటావు. నువ్వూ రాకపోతే మేం బతికున్నామో, చచ్చామో కూడా పట్టించుకునే నాథుల్లేరు"

"ఏంటక్కయ్యా శంకరం, శేఖరం ఇక మనదేశానికి రానట్లేనా? "

"రానట్లే" అంటూ చెంగుతో కళ్ళు తుడుచుకుంది.

"అదేం? మొన్నటిదాకా కొన్నాళ్ళుండి వచ్చేస్తామన్నారుగా"

"కొంత డబ్బు సంపాదించుకుని వస్తామన్నారు. కొంత అంటే ఎంతో మనకేం తెలుసు? " అన్నాడు వెంకటయ్య.

"నిజమేలే, డబ్బాశకి పరిమితి ఎక్కడుంది? అందుకే అంటారు, భోజనం పెట్టి తృప్తిపరచొచ్చుగానీ ధనమిచ్చి సంతృప్తి పర




చలేమని" అంది శారదమ్మ.

"ఇదేంటి మామ్మా కొత్తగా వుంది. వంద రూపాయల విలువ చేసే భోజనం కంటే ఒక ఐదు వందలిస్తే ఎక్కువ సంతోషం కలుగుతుందిగా" అంది బిందు.

"దాని భావం అది కాదమ్మాయి. ఎంత తిండిబోతయినా, అత్యాశాపరుడైనా అన్నం కడుపు పట్టినంతవరకూ, బ్రేవ్‌మని త్రేన్పు వచ్చేవరకూ తినగలడు. కానీ డబ్బుకి అలాంటి పరిమితి లేదుగా. ఐదొందలిస్తే వెయ్యి ఇవ్వకూడదా అన్పిస్తుంది. వెయ్యిస్తే లక్ష... అలా అంతకంటే ఎక్కువ మీదే దృష్టి వుండి ఎంతకీ సంతృప్తి కలగదు అని"

"ఓ... అదా" అంది బిందు తల నిలువుగా వూపుతూ.

"అయితే ఇక రారన్నమాట. కానీ డబ్బు కంటే కన్నవాళ్ళు ఎక్కువని వాళ్ళకి అర్థంకా కపోతే ఎలా? "

"పిచ్చి చిన్నమ్మా. మీట నొక్కితే పను లన్నీ జరిగిపోయే ఆ ధనవంతుల దేశం ముందు ఈ పేద తల్లిదండ్రులు ఆన తారా? "

"కానీ ఎన్నికోట్ల డబ్బూ మనిషిని పుట్టిం చలేవు. మీరు కనీ పెంచకపోతే వాళ్ళకి ఉనికేది? "

అరుంధతమ్మ, వెంకటయ్యా ఇద్దరూ మౌనం దాల్చారు.

"అసలే రాకుండా పరాయిదేశంలో ఏంవుంటార్లే అక్కయ్యా, ఇంకొంతకాలం పోయాక వస్తారేమో"

"రామని వాళ్ళే రాస్తే ఇంకా వెర్రి ఆశలు పెంచుకోవడం ఎందుకు చిన్నమ్మా? "

"పోనీ వచ్చి ఇక్కడే వుండిపోకపోయినా, అప్పుడప్పుడూ చూసిపోయేందుకైనా రారా? "

"బహుశా మేం పోతే ఆఖరి చూపులకొ స్తారేమో"

ఆ మాటకి శారదమ్మకి, బిందుకి కూడా హృదయం కలుక్కుమంది.

"ప్రాణం పోయాక వాళ్ళొస్తే ఎంత రాక పోతే ఎంత? మనం చూడొచ్చామా, మాట్లాడొచ్చామా? " అన్నాడు వెంకటయ్య.

"నేనొక్క మాటంటే మీరేం అనుకోరుగా" అంది బిందు.

"ఇందులో అనుకోడానికేం వుంది? ఏంటో చెప్పమ్మా" అంది అరుంధతమ్మ.

"మీ అబ్బాయిలకి ఇక్కడికి రావడానికి ఇష్టం లేకపోతే అంటే ఈ పల్లెటూళ్ళో వుండ లేమనుకుంటే మరో సిటీలో వుండొచ్చుగా"

"ఆ దేశంలో వచ్చినంత డబ్బు ఈ దేశంలో రాదటకదా" అంది అరుంధతమ్మ.

"కొందరు డబ్బే తిని బతుకుతారులేమ్మా" అన్నాడు వెంకటయ్య.

"పోనీ అక్కడ బాగా సంపాదించొచ్చని ఆశ పడుతున్నారనుకున్నా మిమ్మల్ని కూడా అక్కడికి తీసికెళ్ళొచ్చుగా"

"ఈ మట్టికంపుకొట్టే మనుషుల్ని అంత ఖరీదైన వాతావరణంలోకి ఎలా తీసికెళ్తా రులే? "

"వాళ్ళంత డబ్బు సంపాదిస్తూ అక్కడ వున్నారంటే అందుకు కారణం మీరు కాదా? మీరు కనీ పెంచకపోతే మీ పిల్లలు గాల్లోంచి రాలేదుగా" బాధగా అంది బిందు.

"కనడంతో సరిపోయిందా అమ్మాయి? రెక్కలు ముక్కలు చేసుకుని వాళ్ళని చది వించారు. ఆ రోజులు నాకింకా కళ్ళ ముందు మెదుల్తున్నాయి. వున్న నాలుగెక రాల పొలంలో ఇద్దరు కొడుకుల్ని అంత లేసి చదువులు చదివించడం అంటే మాటలా? " అంది శారదమ్మ.

"ఆ పొలం పండీపండక... అతివృష్టులు, అనావృష్టులు ఎన్నొచ్చినా వాళ్ళ చదువులకి ఆటంకం రాకుండా పట్నంలో వుంచి చది వించాను. మేం తిన్నా, తినకపోయినా వాళ్ళు చదువుకుంటే చాలనుకున్నాం"



"తింటానికి తిండిలేక పస్తు పడుకున్న రోజులెన్నో"

"ఆకలితో కడుపులో పేగులు అల్లాడు తోంటే పిల్లల భవిష్యత్తు గురించి కలలు కంటూ ఆ బాధని మర్చిపోయేవాళ్ళం. ఎండనక, వాననక పొలాల్లో పడి పనిచే యడం, పురుగూ పుట్రాని తప్పించుకోవడం, వానలు పడకపోతే పొలాలు బీళ్ళవడం, పండినపంట చేతికందే సమయానికి వరద లొస్తే నెత్తీనోరూ కొట్టుకోవడంలాంటి తిప్పలు పడకూడదనీ, నాలాంటి బండబా రిన బతుకు వాళ్ళకి వుండకూడదనీ అనుకు న్నాను. అదే పెద్ద తప్పయింది"

"ఇందులో మన గొప్ప ఏముంది లేయ్యా? ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లలు బాగా బతకాలనీ, భోగభాగ్యాలు అనుభవిం చాలనే కోరుకుంటారు. కాకపోతే ఇవాల్టిరో జున మన పిల్లలు మనని పట్టించుకోకపో యేసరికి బాధపడ్తున్నాం" అంది అరుంధ తమ్మ.

"మనమేకాదు, మనలాంటివాళ్ళు ఇంకా చాలామందే వున్నారు. మంచి వయసులో వున్నప్పుడు పిల్లలో పిల్లలో అంటూ వెధవ త్యాగాలు చేస్తూ మన గురించి మనం పట్టించుకోం. తీరా వయసుమీద పడ్డాక మనకి మనం చేసుకునే శక్తీ వుండదు, పిల్లలూ పట్టించుకోరు. ఇదసలు సరైన పద్ధ తి కాదని దండోరా వేసి చెప్పాలన్పిస్తోంది"

"దండోరావేసి చెప్తావా? "

"అవును. పిల్లలకోసం మీరు కడుపులు కట్టుకోకండి. ముందు మీ సుఖం మీరు చూసుకోండి. లేదంటే ఇవాళ ఎండటమే కాదు, పెద్దతనంలో పిల్లలు తమ బాధ్యత అనుకుని మిమ్మల్ని చూస్తారని ఎలాంటి గ్యారంటీలేదు. పైపెచ్చు సరైన తిండి తిన కుండా గొప్ప త్యాగం చేస్తున్నామని విర్రవీ గితే మిమ్మల్ని మెచ్చుకుని మేకతోళ్లు కప్పే వాళ్ళు ఎవరూ వుండకపోగా ఆరోగ్యం పాడై, ముసలితనం పరిగెత్తుకుంటూ వచ్చే స్తుంది అని చెప్పాలన్పిస్తోంది"

బిందుకి ఆ మాటల వెనుక వున్న ఆవే దన మనసులో సూటిగా గుచ్చుకుంది.

"మీరంత కష్టపడి పెంచినందుకైనా వాళ్ళకి..." మాట కూడా పూర్తి చేయలేకపో యింది.

"మిమ్మల్ని ఎవడు కనమన్నాడు? కన్నాక పెంచడం లోకాన్ని ఉద్ధరించడమా అంటున్నారు కద."

"అయితే అమ్మానాన్నల్ని పోషించడమే లోకాన్ని ఉద్ధరించడమా? "

"తామిక్కడుంటే అలాగే చూసేవాళ్ళం అంటారు"

'ఏ తల్లిదండ్రులూ ఎలాంటి పరి స్థితిలోనూ తమ పిల్లల్ని దిక్కూమొక్కూ లేకుండా వదిలేయలేరే? తల్లిదండ్రుల్ని మాత్రం వదిలేస్తారా? పెద్దవయసులో వాళ్ళు కూడా చిన్నపిల్లల్తో సమానమేగా' అనుకుంది బిందు.

★ ★ ★

"అబ్బ... ఏంతోచట్లేదు మామ్మా. నాలు గురోజులకే నాకిలా వుంది. మీరెలా వుండ గల్గుతున్నారు? ఒక టీవీనో, టేప్ రికార్డరో ఏదీ లేకపోతే విసుగ్గా అన్పించదూ? " అంది బిందు.

"నిండా మునిగితే చలి వుండదట. అలా ఈ ఊళ్ళో ఈ జీవితం మాకు అలవాటైపో యింది" అంది. శారదమ్మ.

"ప్చ్... కనీసం పుస్తకాలు చదివే అల వాటు కూడా లేదుకదా, అసలెలా తోస్తుంది మీకు? "

"తోచడం అంటే మాకసలు అంత తీరిక ఎక్కడుందిలే బిందూ. ఇప్పుడంటే పిల్లల బాధ్యతలు కూడా తీరి, మా రెండు పొట్టలు నిండటానికి ఎంత కావాల్లెమ్మని పొలం కౌలుకి ఇవ్వడాన ఈ మాత్రం తీరిక దొరు కుతోంది. వచ్చేపోయేవాళ్ళని పలకరిస్తూ, మంగమ్మలాంటి వాళ్ళకి నా చేతనైన





సాయం చేస్తుంటే ఆ కాస్త సమయం కూడా ఇట్టే గడిచిపోతుంది"

బిందు విని వూరుకుంది.

"నీకు అంత విసుగ్గా వుంటే, ఇవాళెటూ బుధవారం. మంగాపురంలో సంత పెడ్తారు, మెల్లగా వెళ్ళొద్దామా?" అనడిగింది శారదమ్మ.

"సంత అంటే ఆవుల్ని, గేదెల్ని అమ్ముతారుకదా"

"ఇది పశువుల సంత కాదమ్మా, మామూలు సంత. కూరలు, సరుకులు, చెప్పులు, బుట్టలు- ఇలా అన్నీ వుంటాయి. ఈ చిన్నచిన్న ఊళ్లలో ఏమీ దొరకవుకదా, అందుకని అందరూ వెళ్ళి సంతలో కావల్సినవి కొనితెచ్చుకుంటారు"

అంటే ఇది చిన్న రకపు ఎగ్జిబిషన్ అన్న మాట.

"మంగాపురం అంటే ఎక్కడ మామ్మా?"

"బాగా దగ్గరే, అరగంటలో వెళ్ళొచ్చు"

"అయితే వెళ్దాం"

"ఏరా హరీ, నువ్వూ వస్తావా?"

"రాకేం చేస్తాను?"

"అవును మామ్మా, నేనంటే ఎలాగోలా నడుస్తానుగానీ, నువ్వూ తాతగారూ నడవగలరా? అందునా నిన్నే మీ అక్కయ్యగారి ఊరికి నడిచావు కదా"

"ఓపిక లేదుగానీ మెల్లగా నడుస్తాంలే"

నలుగురూ ఆమాటా ఈమాటా చెప్పుకుంటూ నడుస్తూ శారదమ్మ చెప్పినట్లు అరగంటలో మంగాపురం సంత చేరుకున్నారు.

ఎగ్జిబిషన్లో నీట్‌గా వుండే స్టాల్స్‌ని చూసిన బిందూకి ఈ సంత నీరసం తెప్పించింది. ఎక్కడికక్కడ, వేటికవి కుప్పలుపోసి, గుట్టలుగా పేర్చి అమ్ముతున్నారు. అక్కడికి వచ్చినవాళ్ళంతా రైతు కూలీలే. వాళ్ళమధ్య తాను, హరి అస్సలు ఇమడనట్లు అన్పించిందామెకి.

శారదమ్మ, వీరయ్య నిత్యావసర వస్తువులేవో కొంటున్నారు.

హరి చిన్నపిల్లాడిలా ఆట వస్తువులు కొంటున్నాడు. క్రమ పద్ధతిలో లేని అంకెల్ని క్రమంగా మార్చే పజిల్, అట్నుండి ఇటు, ఇట్నుండి అటు మట్టిని జార్చేది ఇలా ఏవేవో కొనుగోలు చేశాడు.

బిందూకి మాత్రం అక్కడేమీ నచ్చలేదు. ఆఖరికి ఏమైనా హెయిర్ పిన్స్ తీసుకుందామన్నా ఏవీ బాగాలేవు. అన్నీ మెరుపులతో, చమ్కీలతో చౌకబారుగా వున్నాయి.

చిన్న పిల్లలకే పరిమితమైన రంగుల రాట్నం పట్ల బిందూకి ఆసక్తిలేదు. అదే జెయింట్ వీలయితే ఆమెకెంతో ఇష్టం. అది ఎక్కడం కోసం ఎగ్జిబిషన్‌కి నాలుగు సార్లయినా వెళ్తుంది ప్రతి సంవత్సరం.

హైదరాబాదులో ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో రెండు రౌండ్లు కొట్టినా అలుపూసొలుపూ తెలీని బిందూకి కొద్దిసేపటికే ఆ సంతలో విసుగ్గా, నీరసంగా అన్పించింది. మనసుకి నచ్చడానికి, నచ్చకపోవడానికి మధ్య వుండే తేడా అది.

అలా నిరాశగా నడుస్తోన్న బిందూకి మిర్చి బజ్జీల బండి కన్పించగానే కొంచెం ప్రాణం లేచివచ్చినట్లయింది. ఒక డజను బజ్జీలు తీసుకుని ముగ్గురికీ అందించింది.

అక్కడే నిలబడి నలుగురూ తిన్నారు.

"హ్వా... కారం... కారం... నీళ్ళు, నీళ్ళు" అన్నాడు హరి.

"మిరపకాయ పడేయక ఎందుకు తిన్నావు?" అంది బిందు.

"ఏడ్చినట్లుంది. బజ్జీ తింటే మిర్చితోసహా తినాలి. లేకుంటే మజా ఏం వుంటుంది?"

"మజానో, ధంసప్పో అఘోరించు" అని మెల్లగా అని.

"ఇప్పుడు మండుతోంటే బాగుంది కదూ" అంది.

"హ్వా...నీళ్ళు, నీళ్ళు" అంటూ ఆ బండి దగ్గరున్న నీళ్ళు తాగేందుకు వెళ్ళబోయాడు.

"ఏయ్ హరీ, అవి తాగకు. మినరల్ వాటర్ దొరికితే తాగు"

"ఇదే ఎక్స్ట్రా అంటే, ఈ సంతలో మినరల్ వాటర్ దొరుకుతుందా? "

"అయితే తాగకు, ఇంటికెళ్ళేవరకూ ఓపిక పట్టు"

"నాకామాత్రం రెసిస్టెన్స్ పవరుందిలే, ఈ నీళ్ళు తాగినా ఏం కాదు"

"అలాగేతాగు, ఏ జాండీసో వస్తేగానీ తిక్కకుదరదు"

"మరి బజ్జీలు తింటే ఏంకాదా? "

"ఏదైనాసరే ఉడికినపుడు అందులో వుండే బాక్టీరియా చచ్చిపోతుందని చదువుకోలేదా? "

హరి ఇక రెట్టించలేదు. అతనికీ తెలుసు, కలుషితమైన నీళ్ళు ఎంత హాని చేసేదీ. కాకుంటే కారానికి నీళ్ళు తాగాలన్పించింది. అప్పటికి మామూలు స్థితికొచ్చి ఇంటికెళ్ళేవరకూ తాగొద్దులెమ్మనుకున్నాడు.

అక్కణ్ణించి కదిలి ముందుకి నడిచారు.

"బిందూ, నీకేమైనా కొనిపెట్టాలన్పిస్తోంది. నీకేం నచ్చిందో చెప్పు. నా అంతట నేను కొంటే పట్నంలో పుట్టి పెరిగిందానివి నచ్చుతుందో, నచ్చదోనని సందేహంగా వుంది" అంది శారదమ్మ కొండంత ఆప్యాయంగా.

ఆ క్షణంలో బిందూకి కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. 'మనకోసం మనం చాలా కొనుక్కుంటాం. అవి కేవలం అవసరాన్ని తీరుస్తాయే తప్ప ఆనందంలో ముంచెత్తవు. అదే మనకోసం ఇతర్లు ఏమైనా కొనిస్తే దాని విలువతో సంబంధం లేకుండా చెప్పలేనంత సంబరం కలుగుతుంది. మనని ఇతర్లు గుర్తించడం, జ్ఞాపకం వుంచుకోవడం, ప్రేమించడం, ఏమైనా ఇవ్వాలని వాళ్ళకి అన్పించడం ఇలాంటివే గదా పరవశం కలిగించేది. ఇలాంటి అనుభూతులు లేనట్లయితే జీవితం ఎంత డ్రైగా వుంటుంది?! మనని మనం చూసుకొంటూ, మన కోసమే మనం బతకడంలో అసలు అర్థం ఏమైనా వుందా? ' అనుకుంది.

"ఏమీ అనుకోకు మామ్మా, ఇక్కడ నాకేం నచ్చలేదు. అయినా ఈ లోకంలో అన్నిటికంటే గొప్పది, మరి దేనితోనూ సమానం కాని మనసునే ఇచ్చావు. ఇంకేం అక్కర్లేదు" అంది బిందు.

"అలా అంటే ఒప్పుకోను. నిన్నింతదూరం నడిపించి తీరా నీకేమీ కొనివ్వకపోతే నాకేం బాగా అన్పించదు"

"అబ్బా, ఇప్పటికే కాళ్లు లాగుతున్నాయి, ఇంకా ఆలశ్యం చేయకు మామ్మా. అంతగా అయితే మా పెళ్ళప్పుడు ఏమైనా కొనిద్దుగాని లే" అంటూ శారదమ్మ భుజం చుట్టూ చెయ్యివేసి, ముందుకి నడిపించింది బిందు.

తాతగారు ఒక్క సంచీ అయినా తాను పట్టుకుంటానని ఎంత బతిమాలినా వినకుండా శ్రీహరే రెండు సంచులూ పట్టుకున్నాడు.

నలుగురూ ఏవో కబుర్లు చెప్పుకుంటూ వేగంగానే ఇల్లు చేరారు.

★ ★ ★

శారదమ్మ, వీరయ్య తెచ్చిన సరంజామానంతా సర్దుకుంటున్నారు.

శ్రీహరి సంతలో కొనితెచ్చిన బొమ్మలతో పదేళ్ళ పిల్లాడిలా మైమరచిపోయి ఆడుకుంటున్నాడు.

బిందు నిశ్శబ్దంగా వసారాలో వున్న మంచంమీద వెల్లకిలా పడుకుంది. పాటలు విని ఎన్నిరోజులైందో, ఒక వాక్మన్ తెచ్చుకున్నా బాగుండేది అనుకుంది.

ఏవో ఆలోచనలు చుట్టుముట్టాయి.

సంతలో ఆ నాసిరకపు వస్తువుల్ని, శాటిన్లా మెరిసిపోయే చౌకబారు దుస్తుల్ని ఎగబడి కొంటోన్న తన ఈడు పిల్లలు, తన కంటే చిన్నవాళ్ళు వాళ్ళ ముఖాల్లో కొట్టొచ్చినట్లు కనిపిస్తోన్న అమాయకత్వం కళ్ళ ముందు మెదిలింది.

'బర్త్ ఈజ్ ఏన్ ఏక్సిడెంట్' అంటారు కదా! తను తన అమ్మానాన్నలకి కాకుండా





ఇలాంటి పల్లెటూళ్లో మరేరైతు కుటుంబం లోనో పుట్టివుంటే ఏంజరిగేది? ఏముంది, తనూ వాళ్ళలో ఒకరిగా అలాంటి జీవనం సాగిస్తూ ఇప్పుడు తను ఏవగించుకొంటోన్న వస్తువులనే అపురూపంగా కొనుక్కుని తెగ మురిసిపోయేది అంతేగా.

ఒకవేళ తనే ఈ మామ్మగారయ్యుంటే... బింధూకి ఒక్కక్షణం ఊపిరి సలపలేదు. ఏదైనా పీడకలవస్తే, అది నిజమేనని హడ లిపోతూ, బెదిరిపోతూ ప్రాణం కీచుకీచుమ న్నట్లుగా వుంది. ఆ ఊహకే ఇంత భయంగా వుండే, ఇక అదే నిజమైతే?' అమ్మో వద్దు.

ఏముంది మామ్మగారి జీవితం? బాల్య మైనా ఆడుతూ పాడుతూ కేరింతలతో, తుళ్ళింతలతో సంతోషంగా గడపకముందే పెళ్ళి అనే సంకెళ్ళతో బంధించేశారు. ఒక వంద కిలోల బరువు లేపితే గొప్ప వెయిట్ లిఫ్టర్ అంటూ బహుమతులిచ్చి విపరీత మైన పబ్లిసిటీ ఇచ్చేవాళ్ళెవర్కైనా మామ్మ గారిలాంటి వాళ్ళగురించి ఆలోచనొ స్తుందా? పసితనం తీరకముందే కుటుంబ బాధ్యతంతా నెత్తిన వేసుకోవడాన్ని మించిన వెయిట్ లిఫ్టింగ్ మరొకటి లేదని ఎంత చెప్పినా అర్ధమవుతుందా?

ఆవిడ జీవితంలోగానీ, అలాంటి అనేక మంది ఆడవాళ్ళ జీవితంలోగానీ ఏముంది? ఉదయం వెల్తురు రాకముందే లేచి, పశువుల కొట్టాలు బాగుచేసుకుని, వాకిళ్ళూడ్చి కళాపి చల్లి, ముగ్గులు పెట్టి, కుటుంబ సభ్యులందరికీ వంటలు చేసి పెట్టి... ఇదేగా? కనీసం కుకర్, గ్యాస్‌స్టవ్ లాంటి సౌకర్యాలైనా వున్నాయా అంటే అప్పుడు కాదు గదా, ఇప్పటికీ లేవు.

నాన్నమ్మ 'కోటి విద్యలూ కూటికోసమే' అంటూ ఒక సామెత చెప్పేది. ఆమాట ఎంతవరకూ నిజం? మనం పుట్టింది, అన్నీ నేర్చుకుంటోంది కేవలం తిండి తినడం కోస మేనా? ఆ మాట ఎంతమాత్రం నిజం కాదు. మనదేశంలో తినడానికి తిండి లేకుండా అల్లాడుతోన్న వాళ్ళు వున్నమాట వాస్తవమే. కానీ చాలామందికి తినడానికి, కట్టుకోడానికి ఎలాంటి ఇబ్బందీ లేదు. మరి ఆర్ధికస్థోమతు వున్నవాళ్ళు కూడా సుఖంగా, శాంతంగా లేకుండా ఎందుకు బాధ పడ్తు న్నారు. ఏవో అసంతృప్తులు, అనేక వేద నలు, పీడనలు ఎందుకున్నాయి? కనుక మనిషికి కావాల్సింది కేవలం తిండీ, బట్టా ఎంత మాత్రం కాదు. తను గానీ మామ్మ గారి ప్లేస్‌లో వుంటే దొరికిన ఈ జీవితంతో ఎంతమాత్రం రాజీపడగలిగేదికాదు. తను కేవలం తన కోసం పుట్టాను అన్పించదు. ప్రపంచంలో వున్న అందరికోసమూ కాకున్నా కొందరు కాకుంటే కొందర్కైనా ఉపయోగపడే పనేదో చేయాలని ఎప్పుడూ అన్పిస్తుంటుంది. పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా అన్నట్లుగాక తన జన్మవల్ల ఏ కొద్ది మందికైనా సరే మేలు జరగాలి అన్పి స్తుంది. అంటే కేవలం తన కుటుంబ సభ్యు లని బాగా చూడటంకాదు. అది మామూలు సంగతి. తను ఊపిరి పీల్చుకు న్నంత సహజంగా కుటుంబ సభ్యుల్ని చూస్తుంది. కానీ తన పరిధి మరికొంచెం పెరగాలి. తను ఇతర్లకేమైనా చేయగల్గితేనే తన జన్మకో సార్ధకత వుంటుంది.

ఈ మామ్మగారు, తాతగారు, మామ్మగారి అక్కయ్య, బావగారు, మంగమ్మగారు వీళ్ళం దర్నీ చూశాక తన మనసులో ఆందోళన ఎక్కువైంది. వాళ్ళు సుఖంగా, సంతోషంగా వుండటం కోసం, దిగుళ్ళన్నీ మర్చిపోవడం కోసం తనేం చేయలేదా? ఏమీ చేయలేదా? ఏదో చేయాలి.

కొంతకాలంగా పెద్దవాళ్ళు పిల్లలకి బరువై పోతున్నారు. ఆ వయసులో వాళ్ళకి వాళ్ళు ఏమీ చేసుకోలేరు, మరెవరూ ఆదరించరు అంటే అదెంత కష్టం? పసిపిల్లలెంతో పెద్ద వాళ్ళూ అంతేకదా! కంటిచూపు మందగించి, పళ్ళూడిపోయి, కాళ్ళలో శక్తి నశించి ఎంత



అశక్తత చోటుచేసుకుంటుంది? పాపం ఆ తాతగారికి పెరాల్సిస్ కూడా తోడైంది. ఆయన్ని లేపాలన్నా, అవతలకి తీసుకువెళ్ళాలన్నా ఆ మామ్మగారికి ఎంత కష్టం? కన్న కొడుకులుగానీ కూతుళ్ళుగానీ అంత కసాయిగా ఎలా వుండగల్గుతారు?

ఇలా ఆలోచించి లాభంలేదు. పాములకి కోరలెందుకుంటాయి, పులికి పంజా ఎందుకు వుంటుంది అంటే సమాధానం వుందా?

తనేదో చేయాలి.

దీని గురించి తీవ్రంగా ఆలోచించాలి.

బిందూ మనసు, మెదడు కూడా వేగంగా పనిచేస్తున్నాయి.



శుభలేఖ ఎవర్తోనో పంపకుండా, మరో రెండ్రోజుల్లోనే పెళ్ళి వున్నా స్వయంగా వాళ్ళిద్దరూ వచ్చి పిల్చారంటే పెళ్ళికి ఎలా నైనా వెళ్ళాలి. కానీ ఈ ఊర్నుండి విజయవాడ వరకూ వెళ్ళాలంటే మాటలు కాదు. తనకంటే కూడా భర్తకి మరీ కష్టం. ఏంచేయాలో పాలుపోక ఆలోచనలో పడిన అమ్మమ్మని ప్రశాంతంగా వుండమని చెప్పాడు హరి. ముందురోజే విజయవాడ వెళ్ళి ట్రాన్స్‌పోర్ట్‌వాళ్ళతో మాట్లాడి ఒక టాక్సీ మాట్లాడి, అడ్రసదీ వివరంగా చెప్పి వచ్చాడు.

మరుసటిరోజు ఉదయానే టాక్సీ వచ్చింది.

అప్పటికే తయారుగావున్న నలుగురూ ఎక్కికూర్చున్నారు.

"ఇలా టాక్సీలో వచ్చే వీలుంటే మరి ఆరోజెందుకు నడిపించినట్లు హరీ? " అంది బిందు.

"చాల్లే ఈ ఊరు రావాలన్నప్పుడల్లా టాక్సీలో వస్తే ఐపోతాం. ఏదో అమ్మమ్మ, తాతయ్య పెద్దవాళ్ళు గనుక, పెళ్ళికి వెళ్ళక తప్పదు కనుక ఈ ఏర్పాటు చేశాను" అన్నాడు హరి.

"నువ్వింత పిసినారివా? "

"అది పిసినారి తనంకాదు, విచక్షణ. ఏది అవసరమో, ఏది అనవసరమో తెలియక పోతే ఎలా? ఇద్దరమూ చిన్నవాళ్ళమే. గేట్ దగ్గర్నించి ఊళ్ళోకి నడవలేమా? ఆ మాత్రానికి విజయవాడనుండి టాక్సీ మాట్లాడుకోవాల్సిన అవసరం వుందా? "

"ఈ వయసులో అందునా కీళ్ళనొప్పుల బాధ వల్ల నడవలేకపోతున్నానుకానీ మైళ్ళ కొద్దీ దూరాన్ని ఇట్టే నడిచేవాణ్ణమ్మా" అన్నాడు వీరయ్య.

బిందూ మౌనం వహించింది.

పెద్దవాళ్ళిద్దరూ ఆ పెళ్ళికి ఎవరెవరు బంధువులు వస్తారో ప్రస్తావిస్తూ, ఎవరెవరి గురించో చెప్పుకుంటున్నారు. బిందుకి అందులో రవంత ఆసక్తిలేదు.

డ్రైవరు అప్పటివరకూ వున్న కేసెట్ మార్చి

"నాచూపే నిను వెదకినది

నీ వైపే నను తరిమినది

నాకెందుకిలా అవుతోంది

నామది నడిగితె చెపుతుంది..." పాట పెట్టాడు.





హరి కొంచెం పైకే గొంతు కలిపి పాడుతోంటే, బిందూ మనసులోనే హమ్ చేయ సాగింది.

దారిలో అనేక పాటలు మారాయి.

దాదాపు ముప్పావుగంటలో విజయవాడ చేరి, మరి కాసేపట్లో మధు గార్డెన్స్ ముందు ఆగింది టాక్సీ.

శారదమ్మ చెల్లెలు సరస్వతమ్మ, ఆంజనేయులు, సరోజినీ ఎదురొచ్చి పలకరించి లోనికి తీసుకెళ్ళారు.

పెద్దవాళ్ళు బంధువర్గంతో కబుర్లలో మునిగిపోతే హరి, బిందూ ఒకచోట కూర్చున్నారు.

"నిన్ను నేను చూసి వుండకపోతే బహుశా ఆ పెళ్ళికొడుకు ప్లేస్‌లో నేనే వుండేవాణ్ణి" అన్నాడు హరి.

"ఏంటీ? "

"అవును, అమ్మమ్మ చెప్పింది. వాళ్ళు నన్ను అడిగారట"

"చేసుకోకపోయావా? " ఉక్రోషంగా అంది.

"ప్చ్... బ్యాడ్‌లక్. అనవసరంగా నీతో కమిట్ అయిపోయాను. లేదంటే ఎన్నో లక్షలు ఇచ్చేవాళ్ళట. నువ్వున్నావంటే ఒక్క లక్షయినా ఇస్తావా పెడ్తావా? "

"ప్పోప్పోవోయ్. నా మనసు విలువ నీకింకా తెలీలేదూ? అది కోటి కోట్లు చేస్తుంది"

"ఆ మనసేదో కావేరికీ వుంటుందిగా"

"సరే ఇప్పటికైనా మించిపోయిందిలేదు. కావేరి కాకుంటే మరో కనకమహాలక్ష్మిని చేసుకో పో. దేనికీ రిగ్రెట్స్ వుండకూడదు"

"ఏయ్ ముక్కోపీ, క్షణాల్లో మండిపోతావుకదా"

"తీరికూర్చుని ఒళ్ళు మండించేది నువ్వేగా"

"నిన్ను వదిలి నేనెక్కడికైనా పోగలనా? అంతెందుకు మనిద్దరం చనిపోయాక నిన్ను నరకానికి, నన్ను స్వర్గానికి పొమ్మన్నారనుకో... నాకు స్వర్గసౌఖ్యాలేం అక్కర్లేదు, బిందు పక్కనుంటే నరకం కూడా స్వర్గమౌతుందని చెప్తాను"

"ఏంటి నాయినా ఈలోకంలో చాలక పోయాక్కూడా 'నిను వీడని నీడను నేనే' అని పాడుకుంటూ వెంటపడ్తావా? " అని కొద్దిదూరంలో వుండాల్సిన మామ్మగారి కోసం చూస్తే కన్పించలేదు.

"ఏయ్ మన వాదనలు తర్వాత. ముందు అమ్మమ్మావాళ్ళెక్కడున్నారో చూడు"

"అంత కంగారెందుకు? ఫంక్షన్లో తప్పిపోవులే. అదిగో "అక్కడున్నారుగా" అంటూ చూపించాడు హరి.

"నేను వాళ్ళ దగ్గరికెళ్తున్నాను" అంటూ బిందు అటు దారి తీసింది.

వీరయ్య మగవాళ్ళతో మాట్లాడుతున్నాడు.

వాళ్లకి కొన్ని కుర్చీలవతల శారదమ్మ మరో పెద్దావిడతో మాట్లాడుతోంటే బిందు వెళ్ళి కుర్చీ జరుపుకుని కూర్చుంది.

"ఈ అమ్మాయి హరికి కాబోయే భార్య పార్వతమ్మా" అని "ఈవిడ నాకు మేనత్త కూతురమ్మా, పేరు పార్వతమ్మ" అంటూ ఇద్దరికీ పరస్పరం పరిచయం చేసింది శారదమ్మ.

"మీరెక్కడుంటారండీ? " అడిగింది బిందు.

"హైదరాబాదులో"

"అరే, నేనూ అక్కడే వుంటాను"

వాళ్ళిద్దరూ బిందూ వెళ్ళేముందే కలుసుకున్నట్లున్నారు.

"అదేంటి పార్వతీ, కొడుకు దగ్గర వుండటంలేదా? "

"లేదు శారదా, కొడుకు దగ్గర్నుండి వెళ్ళి రెండేళ్ళయింది"

"నాతో ఎవరూ అనలేదే. ఇంతకీ హైదరాబాదులో ఎవరింట్లో వుంటున్నారు? "

"వృద్ధాశ్రమంలో వుంటున్నాం"

"అదేంటి? "

"మనలాంటివాళ్లకోసం ఏర్పాటుచేశారు"

"ఎందుకెళ్లారు? "

"అవసరమై"

"ఏంఅవసరం? అయినవాళ్లుంటే ఎక్కడో వుండాల్సిన అవసరం ఏమొచ్చింది? "

"ఇది వెనకటికాలంకాదు శారదా? ఒకప్పుడు కుటుంబం అంటే భార్య, భర్త, పిల్లలేగాక అత్తమామలక్కూడా అందులో చోటుండేది. ఇప్పుడలా కాదు. అలాంటప్పుడు మారే రోజుల్తోపాటు మనమూ మారాలి"

"అయ్యో మీ భార్యాభర్తలకి ఇంత కష్టమొచ్చిందని నాకు తెలీదమ్మా? "

"పిచ్చి శారదా, ఇలా వెళ్లినందువల్ల వచ్చిన కష్టాలు తీరాయి. ఇంటికంటే గుడి పదిలం అన్నట్లు ఆశ్రమంలో ఎంతో సుఖంగా శాంతంగా వుంది"

శారదమ్మ అయోమయంగా చూసింది.

"నేను చెప్తోంది నిజమే శారదా. పిల్లలకి వాటాలు పంచగా మిగిలిన పొలము, నగలు అమ్మేస్తే రెండు లక్షలొచ్చాయి. ఆ డబ్బుని ఫిక్స్‌డ్ డిపాజిట్ చేశాం. నెలకి నాలుగువేల చొప్పున వడ్డీ వస్తోంది. ఆ డబ్బు ఆశ్రమంలో కట్టేస్తే ఇక మాకు చీకూ చింతా ఏమీలేదు. వేళకింత పెట్టింది తినడమూ, హాయిగా పడుకోవడమూ" శారదమ్మ నమ్మలేనట్లు చూసింది.

"నీ దగ్గర నేను అబద్ధాలు చెప్తానా శారదా? ఇప్పుడు మాకు ఏ బాధాలేదు. ప్రాణానికెంతో హాయిగా వుంది"

"కానీ వేళకి తిండితింటే సరిపోతుందా? మాబోటివాళ్ళం కొడుకులు, కోడళ్ళు లేరు అనుకుంటోంటే మీరేమో వుండీ ఆ ప్రేమకి, ఆదరణకీ నోచుకోలేకపోతే బాధేయదూ? "

"ప్రేమనేది సహజంగా వుంటే బాగానే వుంటుంది శారదా. లేనప్పుడు అడుక్కున్నా రాదు. ఇకపోతే వాళ్ళ దగ్గరున్నప్పుడు మేం సాముకున్నదేమిటి? కొడుకూ కోడలూ ఇద్దరూ ఉద్యోగానికిపోతే ఇల్లు కనిపెట్టుకుని అరవచాకిరీ అంతా చేసేదాన్ని. కూరగాయలు తేవడం దగ్గర్నుంచీ ఎలక్ట్రిసిటీ బిల్ కట్టడం వరకూ బయటి పనులన్నీ ఆయన చక్కబెట్టేవాడు"

"అవును అదంతా తెల్సిందేగా. మీరిద్దరూ క్షణం తీరిక లేకుండా కష్టపడేవారు"

"చాలా ఇళ్ళలో జరిగేది ఇదే. భార్యాభర్తలిద్దరూ ఉద్యోగస్తులైతే పెద్దవాళ్ళమీదే పని భారం పడుతుంటుంది. రెండు సంపాదనలున్నప్పుడు ఇంటిపనులకోసం ఎక్కువసేపు చేయడానికి ఇష్టపడే పనిమనిషిని పెట్టుకోడానికి మనసొప్పదు. జీతాలు వేలల్లో వచ్చినా కొన్ని వందలు చేయిజారడం కూడా ఇష్టముండదు" శారదమ్మ బాధగా చూసింది.

"అవును శారదా, ఇంట్లో ఇద్దరూ సంపాదిస్తున్నపుడు ఆదాయం బాగానే వుంటుంది కనుక ఇంటిపనులన్నీ చూసుకోడానికి ఒక మనిషిని పెట్టుకునేందుకు సిద్ధపడకపోతే ఎలా? ఆశకి అంతెక్కడుంది? ఏమీ ఖర్చవకుండా అంతా మిగలాలనుకోవడం దురాశ కాదా? ఆ కొద్ది డబ్బు కూడా ఆదా చేసుకోవాలనే కక్కుర్తితో పని భారమంతా ముసలాళ్ళమీద వేస్తే ఎంతని చేయగలరు? "

"ఇంట్లో చాకిరీ చేయలేక ఆశ్రమంలో చేరారా? "

"అదొక్కటే కాదులే శారదా, ఇంట్లోంచి వెళ్ళడానికి ఇంకా కారణాలున్నాయి. మొదట దాని గురించి విన్నప్పుడు చేరడానికి ఎంతో బెరుకుగా, సందేహంగా అన్పించింది. కానీ అక్కడ అలవాటయ్యాక ఆ భయాలన్నీ మాయమయ్యాయి. ఏ తల్నొప్పులూ లేవు. ఎవర్తోనూ అభిప్రాయభేదాలు, కలహాలు లేవు. ఎలాంటి రాజకీయాలూ లేవు. ఎంత హాయిగా వుందో చెప్పలేను. నన్నడిగితే మన ఈడు వాళ్ళందరికీ ఈ హోమ్‌లే సుఖసంతోషాలు ఇవ్వగల్గుతాయి" అంది పార్వతి.

"అయితే మీ ఆయనక్కూడా అక్కడే





బాగుందా? "

"ఆ... ఆయనకీ అక్కడే బాగుంది. మా ఇద్దరికనేకాదు శారదా అక్కడున్న అందరూ ఇదే మాటంటారు. వయసు మళ్లాక మనం తట మనం విడిగా వుండలేం. పిల్లల దగ్గ రుంటే భారమౌతాం. కనుక ఎలాంటి భేష జాలకీ పోకుండా, స్వచ్ఛందంగా మనంతట మనమే హోమ్‌లో చేరిపోవడం ఉత్తమం"

"కానీ అక్కడ ఒంటరిగా అన్పించదా? మీరంటే భార్యాభర్తలిద్దరూ వున్నారనుకో..."

"ఒక్కరి చొప్పున చేరినవాళ్ళే ఎక్కువ శారదా. జంటలుగా చేరినవాళ్ళు మేం గాక ఇంకొక్కరే. అయితే వాళ్ళు కూడా ఆశ్రమం లోనే బాగుందంటున్నారు. ఎందుకంటే పిల్లలు లేకనో, వున్నా వాళ్ళ దగ్గర వుండ డానికి ఏ ఇబ్బందో వుంటేనే కదా ఆశ్ర మంలో చేరతారు. అటువంటివాళ్ళు ఎటూ ఒంటరితనంతోనే వస్తారు. ఇక అక్కడికొ చ్చాకనే ఆ ఒంటరితనాన్ని కొంత మర్చి పోయి మనుషుల్లో పడ్తారు" అంది పార్వ తమ్మ.

"అన్నట్లు నీ కొడుకూ, కోడలూ అందులో చేరొద్దని అడ్డుకోలేదా పార్వతీ? "

"లోకులేమనుకుంటారోనని వద్దన్నారు. కానీ మా ఆయన వినలేదు. అదే మంచి దైంది"

"ఇప్పుడు నిష్ఠూరంగా వున్నారా వాళ్ళు? "

"అదేంలేదు. నిజం చెప్పాలంటే దగ్గరున్న ప్పటికంటే ఇప్పుడే అభిమానంగా వుంటు న్నారు. ఎప్పుడైనా హోమ్‌కి వచ్చి పలకరించి వెళ్తుంటారు."

శారదమ్మ నవ్వి, "మీ ఇద్దరి ఆరోగ్యం బాగానే వుందికదా" అంది.

"బాగుంది శారదా. ప్రతివారం హోమ్‌కి ఒక డాక్టర్ వస్తారు. ఏమైనా సుస్తీ చేస్తే చూసి మందిచ్చి వెళ్తారు"

"అయితే ఇంటికంటే గుడి పదిలం అన్నట్లు పెద్దతనంలో పిల్లల దగ్గర వుండటం కంటే వృద్ధాశ్రమంలో వుండటమే మేలంటావు? "

"అవును శారదా, మీరిద్దరూ కూడా చేరండి" అంది పార్వతమ్మ నవ్వుతూ.

"ఇప్పుడింకా లేచి తిరుగుతూ పనులు చేయగల్గుతున్నానుకదా పార్వతీ. ఈ ఓపి క్కాడా హరిస్తే నువ్వు చెప్పినట్లే చేయాలి"

"పూర్తిగా మంచాన పడకముందే దాని గురించి ఆలోచించండి" అంది పార్వతమ్మ.

బిందూ ఆ మాటలన్నీ ఆలకిస్తూనే వుంది. ఆమె మనసులో సుళ్ళు తిరుగు తోన్న అలజడికి ఒక జవాబు దొరికినట్ల యింది.

అంతలో ఒక ఎర్ర పట్టుచీరావిడొచ్చి "ఏం పెద్దమ్మా, వృద్ధాశ్రమం గురించి బ్యాండేస్తోందా నీకు? " అంటూ కళ్ళెగరేస్తూ నవ్వింది.

"అంతేలేవే, అలాగే నవ్వు. అక్కడ నేనెంత సంతోషంగా వున్నానో నాకే తెలుసు. నాలాగే ఇంకొందరు దిగుళ్ళన్నీ మర్చిపోయి నిశ్చింతగా వుండాలని చెప్పడ మేగానీ లేకపోతే నాకు మాత్రం కంఠశోష కాదూ? " అంటూ తాను కూడా నవ్వింది పార్వతమ్మ.

అందుకు ఎర్ర చీరావిడ మనసారా నవ్వు తోంటే బిందు, శారదమ్మ శృతి కలిపారు.

★ ★ ★

బిందూ వెల్లకిలా పడుకుని చూరుకేసి తదేకంగా చూడసాగింది.

శ్రీహరి వచ్చి మంచం పక్కనే నిలబడినా ఆమె దృష్టి అటు మళ్ళలేదు.

ఒక నిమిషం అలా వేచి చూసిన హరి విసిగిపోయి ఆమె కళ్ళముందు చెయ్యి ఆడించాడు.

ఇంకో ప్రపంచంనుంచి వచ్చినట్లు అప్ప టికి అతనివేపు దృష్టి సారించింది.

"ఏం బిందూ, రింగులు రింగులు తిప్పు కుంటూ ఏదైనా ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్ళావా? " అనడిగాడు హరి ఆమె ఇంకా మౌనంగా వుండిపోవడం చూసి.




బిందు లేచి కూర్చుని, "ఫ్లాష్‌బ్యాక్ ఏం కాదుగానీ ఫ్లడ్‌లైట్‌లాంటి బ్రహ్మాండమైన ఐడియా తట్టింది" అంది.

"కొంప తీసి కథేమైనా రాయబోతున్నావా? "

"కథ రాయాలంటే కొంపలెందుకు తీయడం? హాయిగా కొంపలు కొనుక్కోవచ్చు"

"ఏంటీ? "

"అవును. ఇప్పుడు ఏవరేజ్‌న వారానికో సినిమా రిలీజవుతోంది. టీవీ ఛానల్స్‌లో పదో పన్నెండో డెయిలీ సీరియల్స్ వస్తున్నాయి. కనుక కథలకి కావల్సినంత డిమాండ్ వుంది"

"అవన్నీ నీ భ్రమలు. సినిమాలకీ, సీరియల్స్‌కీ నీబోటివాళ్ళు కొత్తగా కథలేం రాయనవసరంలేదు"

"నేను కాకున్నా ఎవరో ఒకరు రాయాలిగా"

"అక్కర్లేదు. ఒకే కథని అటుతిప్పీ, ఇటు తిప్పీ, అది మార్చీ, ఇది మార్చీ, అది చేర్చీ, ఇది చేర్చీ పది కథలు పుట్టిస్తారు. ఆ పదీ వందవుతాయి"

"వంద వెయ్యవుతాయి... ఇక వద్దు బాబూ"

"మరి విషయంలోకి రా... ఏదో ఐడియా అన్నావు"

"నువ్వు నవ్వనంటే చెప్తాను"

"విన్న జోక్‌నే తిన్నగా చెప్పలేవు. ఇక నువ్వు సొంతంగా చెప్పేదాంట్లో నవ్వేందుకు స్కోపేం వుంటుందిలే? నాకెటూ నవ్వు రాదు, చెప్పు"

"ఏయ్ స్టుపిడ్! నేనేం నువ్వు కాదు. నువ్వే ఆకలేయకపోయినా అన్నం తినొచ్చాను, సినిమా చూస్తోంటే నిద్ర ముంచుకొచ్చిందిలాంటి చచ్చు కబుర్లేవో చెప్పి అక్కడికవి ఆర్కే లక్ష్మణ్ కార్టూన్స్‌కిమల్లే నవ్విస్తాయనుకుని నేను నవ్వలేదేమిటాని చూస్తుంటావు. ఉల్లిపాయ కోసి మల్లెపూవు వాసన రావడంలేదేమిటా అని చూసే ఫేస్ నీది"

బిందూ పెదాల కదలిక ఆగిపోయాక రెండు చూపుడువేళ్ళనీ చెవుల్లోంచి తీసి, "ఇప్పుడేం అన్నావో నాకు వినిపించలేదుగానీ త్వరగా విషయం చెప్పు" అన్నాడు.

"చెప్పను. నువ్వు డ్యామేజింగా మాట్లాడ్తున్నావు"

"నసపెట్టక చెప్పు"

"నాకు ఒక వృద్ధాశ్రమం స్టార్ట్ చేయాలనే ఆలోచన వచ్చింది"

శ్రీహరి పెద్దపెట్టున నవ్వాడు.

"ఇప్పుడు నేనేం జోక్ చెప్పలేదు"

"ఇంతకంటే పెద్ద జోకేం వుంటుంది? జోక్ ఆఫ్‌ది డికేడ్... సెంచరీ అన్నా ఆశ్చర్యంలేదు" అని మళ్ళీ నవ్వాడు హరి.

"నాగ్గానీ కోపం వచ్చిందంటే మంగాపురం సంతలోకి విసిరేస్తాను జాగ్రత్త. ఏ రైతుగారో నిన్ను కొనుక్కుని వాళ్ళ పొలంలో పని చేసేందుకు పాలేరుగా పెట్టుకుంటాడు"

"ఛీ... నీచురాలా మరీ గొంగళిపురుగుల్లాంటి మాటలు మాట్లాడ్తావా? "

"మహానుభావా మాటలకి ఆకారంలేదు. వాటిని కనిపించేవాటితో పోల్చరు, వినిపించే శబ్దాలతో పోల్చుతారు"

"అయితే నీ మాటలు ఆంబోతు రంకెలంత ఘోరంగా వున్నాయి"

"ఏం ఫర్లేదుగానీ, నేను చెప్పింది నిజం. ఎప్పట్నుంచో ఏదైనా చేయాలనే అర్జ్ వుంది. కానీ ఏంచేయాలి అనే అవగాహన, క్లారిటీ లేవు. ఇక్కడ మామ్మగారు, తాతయ్య, వాళ్ళ అక్కయ్య, బావగారు, మంగమ్మగారు వీళ్లందర్నీ చూశాక ముఖ్యంగా పెళ్ళిలో పార్వతమ్మగారి మాటలు విన్నాక ఒక హోమ్ పెడ్తే బాగుంటుందని అన్పించింది. ఇప్పటికి గందరగోళపు ఆలోచనలకి ఒక షేప్ వచ్చింది"

"బిందూ, ఈమధ్య సినిమాలు బాగా చూస్తున్నావా? " సీరియస్‌గా అడిగాడు.

"అదేం అలా అడుగుతున్నావు?"
"ముందు అడిగిందానికి చెప్పు"
"నాకు సినిమా పిచ్చిలేదని తెలిసీ అడుగుతావే? నీకు తెలీకుండా నేనేం సినిమాలు చూస్తున్నాను.
"టీవీలో అయినా చూస్తూండి ఉండాలి. లేకుంటే ఇంత సినిమాటిగ్గా ఎలా ఆలోచిస్తావు?"
"నువ్వేమైనా అనుకో. నేనిక నీతో వాదించదలచుకోలేదు. నేనేం సినిమాటిగ్గా ఆలోచించలేదు. ప్రపంచాన్ని జయిస్తాననో కనీసం ఇండియా-పాకిస్తాన్‌లమధ్య సఖ్యత చేకూరుస్తాననో కూడా చెప్పలేదు. మనిషి తల్చుకుంటే పెద్దవాళ్ళకోసం ఒక ఆశ్రమం పెట్టడం అంత కష్టమేంకాదు. ప్రాక్టికల్‌గా చేసి చూపుతాను" అంది బిందూ గంభీరంగా.
"అదంత తేలికనుకుంటున్నావా?" హరి కూడా సీరియస్‌గానే అడిగాడు.
"మంచి పనులేవీ కూడా అంత తేలిక్కాదు హరీ. అంత సునాయాసంగా చేసే మాటైతే ఇంటికొకరైనా ఏవో ఘనకార్యాలు చేసేవాళ్ళు".
"మరి హోమ్ అంటే మాటలా? అది నీవల్లవుతుందా?"
"ఎందుక్కాదు? లోకంలో ఏదీ అసాధ్యం కాదు చేయాలనే దీక్ష వుంటే ఏదైనా చెయ్యగల్గం. మనసుంటే మార్గం అదే కనిపిస్తుంది"
హరి నిట్టూర్చి ఊరుకున్నాడు.
"హరీ, నేనేదో టైంపాస్ కబుర్లు చెప్తే విని ఎంజాయ్ చేయడమేగాక, కొందరికి ఉపయోగపడే పని చేస్తానంటే ఎంకరేజ్ చేయవా?"
హరి తన మౌనం వీడలేదు.
"నువ్వు నా భుజం తట్టి ప్రోత్సహిస్తావనుకున్నాను"
"నువ్విలా అచ్చతెలుగులో మాట్లాడ్తోంటే ఏదోగా వుంది. ఇంత డ్రమెటిగ్గా మాట్లాడ్డం ఎప్పుడు నేర్చుకున్నావు?"
"ఇవాళ నన్ను వెక్కిరించడమే ధ్యేయంగా పెట్టుకున్నావా? ఒక మంచి ఆలోచన రావడమే కష్టం. అలా వచ్చినపుడు వాళ్ళకి సంబంధించినవాళ్ళు 'నువ్వు చేయగలవు, చేస్తావు?' అంటూ ఎంకరేజ్ చేయాలేగానీ, 'నీ ముఖం, నువ్వేం చేస్తావు? నీవల్లేమవుతుంది?' అంటూ డిస్కరేజ్ చేస్తారా? నీదంత మీన్ మెంటాలిటీ అని నేననుకోవడంలేదు" అంది బిందు.
"నాది చాలా బ్రాడ్ మైండే. నువ్వు చేయలేకపోవడం ఏమిటి? తప్పక చేస్తావు బిందూ. కమాన్ బిందూ, స్టార్ట్ చెయ్"
"వ్యంగ్యమా?"
"వ్యంగ్యమూ లేదు వెలక్కాయ పచ్చడీ లేదు. ఏది మాట్లాడినా ప్రమాదమే అయితే ఎలా?"
"ఏమో, నీ మాటతీరు అలానే వుంది"
"నేనేం మాట్లాడినా అలాగే వుంటుందిలే. నిజంగానే అంటున్నాను. ఆ ఆశ్రమం ఏదో త్వరగా మొదలుపెట్టు. ఎందుకంటే 'గుడ్ టు థింక్, బెటర్ టు టాక్, బెస్ట్ టు ఏక్ట్' అన్నారు. ఆలోచించడం, నాతో చెప్పడం ఐపోయింది. కనుక ఇక ఏక్షనే మిగిలింది"
"హరీ, నువ్వు నిజంగా అంటున్నావో, ఎగతాళిగా అంటున్నావో అర్థంకావడంలేదు"
"ఎగతాళేంకాదు, నిజంగానే అంటున్నాను. ఆ వృద్ధాశ్రమానికి ఏం పేరు పెడ్తావు?"
ఒక్కక్షణం ఆలోచించి "ఏమో, నేనింకా పేరు వరకూ వెళ్ళలేదు హరీ. మొత్తానికి రకరకాల కష్టాలతో, అలజడులతో వచ్చే పెద్దవాళ్ళకి నేను స్టార్ట్ చేసే హోమ్ అమ్మ ఒడిలాంటి ఒక భద్రతని, ఒక నిశ్చింతని, సుఖాన్ని, సౌఖ్యాన్ని, ఆనందాన్ని ఇవ్వాలి. అలాంటి వాతావరణం కల్పించాలని గట్టిగా అనుకుంటున్నాను. కేవలం తిండి, బట్ట, నీడ ఇవ్వడంలో అర్థంలేదు. వ్యక్తిగతంగా తమకి ఎలాంటి చీకూ చింతలున్నా అవన్నీ మర్చిపోయి అక్కడ చేరినవాళ్ళంతా ఏకమై




ఒక కుటుంబంలా ఏర్పడాలనేది నా ఉద్దేశం" అంటూ తన మనసంతా విప్పిచెప్పింది బిందూ.

అప్పటికి హరిలో నిజమైన సీరియస్‌నెస్ వచ్చింది. బిందూ మాటలకి ప్రశంసాపూర్వకంగా చూశాడు.

"అయామ్ ప్రౌడాఫ్ యూ బిందూ" అన్నాడు మనస్ఫూర్తిగా.

బిందూ అతని చేతుల్ని అందుకుని ముద్దు పెట్టుకుని ఆ రెండు అరచేతుల్నీ తన రెండు చెంపలకీ ప్రేమగా, మక్కువగా ఆన్చుకుని, వాటితో తనే సవరించుకుని, మరోసారి ఆ చేతులమీద పెదాలు ఆనించి వదిలేసింది.

"ఈ మాటకోసమే ఇంతసేపూ చూశాను" అంది.

"మొదట నువ్వేదో సినిమాల ప్రభావంతో ఇన్‌స్పైర్ అయి ఏదో మాట్లాడ్తున్నావు అనుకున్నాను. కానీ ఇప్పటికి అర్థమైంది" అన్నాడు.

"ఏమర్థమైంది? "

"నువ్వు ఆషామాషీగా చెప్పడంలేదనీ, చేయాలనే తపన, పట్టుదల రెండూ వున్నాయనీ, చేసి తీర్తావనీ"

ఇద్దరికళ్ళూ మాట్లాడుకున్నాయి.

ఒకరిమీద ఒకరికి కొండంత కాంక్ష కలిగింది.

ఒకరి కౌగిలిలో ఒకరు ఇమిడిపోవాలనుకున్నారు.

కానీ ఇద్దరి ఇంగితమూ మేల్కొంది.

వెంటనే తమాయించుకున్నారు.

"మరి ఎప్పుడు మొదలుపెడ్తే బాగుంటుంది? "

"ఆలోచన నీది, ఆశయం నీది, ఆచరణ నీది"

"ఏంటి బాబూ తెగ ప్రాసలు వాడ్తున్నావు? నేనూ ఏం తక్కువ తిన్లేదు. ఆరంభమూ నాదే కానీ అది ఎప్పుడైతే బాగుంటుందో చెప్పు"

"నేనేం చెప్పగలను బిందూ? నాకు చేతనయిందీ, నేను చేయగలిగిందీ ఏమైనా వుంటే చెప్పు చేసిపెడ్తాను. అంతేతప్ప ఎప్పుడు, ఎలా అంటే మాత్రం నాకు తెలీదు"

"థ్యాంక్యూ హరీ, థ్యాంక్స్ ఎ లాట్"

"ఎందుకు? ఇప్పుడు నేనేం చేశానని? "

"ఏమీ చేయనవసరంలేదు. నన్ను అర్థం చేసుకుంటే అంతేచాలు"

"అర్థ ఏంఖర్మ, పూర్తిగానే చేసుకున్నాను"

"జోక్కాదు హరీ. ఆడవాళ్ళని మేగ్జిమమ్ ఎక్స్‌ప్లాయిట్ చేయడానికే చూస్తారు మగవాళ్ళు"

"మగవాళ్ళ గురించి ఇలా మాట్లాడ్డం మాత్రం నాకు నచ్చదు"

"నీకు నచ్చినా నచ్చకపోయినా అది ఉన్న మాటే. పాము కాటేస్తుందని చెప్తే నీకు నచ్చదని, ముద్దు పెట్టుకుంటుందని చెప్తే ఏమైనా బాగుంటుందా? "

"అంటే నేను పామునా? "

"నేనలా అన్నానా? "

"ఇన్‌డైరెక్ట్‌గా అన్నావు"

"బాబూ, ఏదైనా వుంటే తిన్నగా అనడమే తప్ప ఇన్ డైరెక్ట్ స్పీచ్‌లు నాకు రావు. ఎక్కువమంది మగవాళ్ళు ఎలా వున్నారనేది చెప్తున్నాను. నీలాంటివాళ్ళు ఎక్సెప్షన్స్"

"నీకసలు మగవాళ్ళంటే ఎందుకోపం? "

"ఎందుకో నీకు తెలీదా? ఆడవాళ్ళని రకరకాలుగా అణిచేస్తోంది మగవాళ్ళు కాదా? వంటింటికీ, మహా అయితే సంపాదించి పెట్టడానికీ పరిమితం చేస్తోంది మగవాళ్ళు కాదా? "

"ఏమీకాదు. ఎక్కువమంది ఆడవాళ్ళకి చీరలమీదా, నగలమీదా ధ్యాస తప్ప మరే ఆశయాలూ లేక తమంతటతామే వంటిళ్ళకి అంకితమౌతున్నారు"

"ఇదెంతమాత్రం సరికాదు హరీ. మగవాళ్ళలో కొందరు ఆల్కహాలిక్స్ వున్నట్లే ఆడవాళ్ళలో కొందరు చీరలు, నగలు పట్ల

వ్యామోహం వున్నవాళ్ళు వుండొచ్చు కానీ అందరూ అంతేననుకోవడం, అందుకే ఎందులోనూ పైకి రావడంలేదు అనడం మాత్రం శుద్ధ తప్పు"

"పోనీ నీ వెర్షన్ ఏమిటి? "

"మగవాళ్ళకున్నన్ని అవకాశాలే కనుక ఆడవాళ్ళకి వుంటే అన్ని రంగాల్లోనూ మిమ్మల్ని మించిపోయేవాళ్ళం"

"ఏమిటేమిటేమిటి? "

"అంత మహాశ్చర్యం అక్కర్లేదు"

"లేకుంటే ఏమిటి బిందూ, అతిశయాల క్కూడా ఒక హద్దుండాలి"

"ఇందులో అతిశయం రవంత కూడా లేదు. ఫిజికల్‌గా మేం వీక్. పిల్లల్ని కనడం, పెంచడంలాంటి తలనొప్పులు కేవలం మేమే పడాలి. ఆ అడ్డంకులని తప్పించుకోడానికి ఎటూ అవకాశంలేదు. కనీసం మిగతా టైమైనా మా చేతుల్లో వుంటుందా అంటే అదీ వుండదు"

"నీ వాచ్ నీ చేతిలోనే వుంది"

"ఎంతమాత్రం నవ్వురాలేదు. ఎందుకు హరీ, ఆడవాళ్ళ బతుకులు ఇంత హీనంగా ఎందుకున్నాయి? క్లాస్‌రూంలో పిల్లలు టీచర్ని ఫలానాదానికి వెళ్ళొచ్చా అని బతిమాలి అడిగినట్లు ఆడవాళ్ళు అన్నిటికీ మగవాళ్ళ పర్మిషన్లు అడగాల్సిందేనా? "

"ఏంటోయ్, అన్నం తినొచ్చా, బాత్రూంకెళ్ళొచ్చా? అని భర్తని అడిగే భార్య ఎవరైనా కన్పించిందా? "

"టేక్ యువర్ సీట్ అంటే నీ కుర్చీ తీసుకో అని అనువాదం చేశాడట నీలాంటి వాడే. బొత్తిగా బుర్రలేనట్లు మాట్లాడ్తావే? ఎందరు ఆడవాళ్ళకి నిజమైన స్వేచ్ఛ ఉందో కాస్త గుండెమీద చెయ్యేసుకుని చెప్పయ్యా, వింటాను"

"అందరి సంగతీ నాకు తెలీదు. మా అమ్మ అయితే మా నాన్నకి భయపడదు. ఆవిడెంతో ఫ్రీగా వుంటుంది. వాళ్ళిద్దరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్ అన్నట్లుంటారు"

"నువ్వు చెప్పేది నిజమే అయితే సంతోషం. కానీ నాకు అంతగా నమ్మకం లేదు"

"ఎందుకని? "

"మొన్నే చెప్పానుగా. ఆంటీ కనుక అంకుల్‌కి భయపడనిమాట నిజమైతే మామ్మగారిని, తాతయ్యని తన దగ్గర వుంచుకునేది కాదా? "

"ఎప్పుడైనా వచ్చి కొన్నాళ్ళు వుండమంటుంది గానీ, పూర్తిగా వుంచుకోవాలనే ఆలోచన అమ్మకి వచ్చుండదు"

బిందూ రెట్టించలేదు.

"మీ ఆడవాళ్ళు బాగుపడ్తాం, పైకి వస్తాం అంటే మేమేం మోకాళ్ళు అడ్డుపెట్టి ఆపుతున్నామా? "

"మోకాళ్ళేం ఖర్మ, లక్ష్మణరేఖలే గీస్తారు. అవి దాటి వెళ్తే ఒకసారి అరుస్తారు, రెండోసారి గర్జిస్తారు. మూడోసారి గెంటేస్తారు"

"మగవాళ్ళని తిట్టడంలో పరీక్ష పెట్టి, సర్టిఫికెట్ ఇచ్చేమాటుంటే నీకే ఫస్ట్ వచ్చేట్లుంది"

"తిట్టడంలో నాకేం ఆనందంలేదు హరీ. మనసెంతో దుఃఖపడి, ఏమీ చేయలేని నిస్సహాయతతో నా బాధని నీతో పంచుకుంటున్నాను. మగవాళ్ళు తమకి ఇష్టమైన పనులు అంకితమైపోయి చేయగలరు. కేవలం డబ్బు సంపాదించి పడేస్తే చాలు ఇంకే బాధ్యతలూ వుండవు. ఎక్కడికెళ్తావు, ఎందుకెళ్ళావు, ఈ పని ఎందుకు చేస్తున్నావు? ఇలా ఎందుకు చేస్తున్నావు అంటూ పోరుపెట్టి సాధించేవాళ్ళెవరూ వుండరు"

"డెడికేట్ అయి పనిచేస్తోంటే స్త్రీలకి మాత్రం ఎవరు వంక పెడ్తారు? "

"నీకీ విషయంలో లోకజ్ఞానం బాగా తక్కువనుకుంటా. తన బాధ్యతలన్నీ పూర్తి చేసి, ఇష్టమైన పనేదో చేసుకోబోయినా అందుకు సవాలక్ష ఆంక్షలు పెడ్తూ తిట్టే మొగుళ్ళు లేరనుకుంటున్నావా? "




"ఒట్టి పుణ్యానికి ఎందుకు తిడ్తారు? "

"బహుశా కదిల్తే మెదిల్తే తిట్టే రైట్ వుందనుకుంటారు. ఇంటికి మాత్రమే పరిమితమై, తన బాగోగులు చూడ్డం ఒక్కటే ధ్యేయంగా పెట్టుకునే స్త్రీలు పురుషులకి నచ్చుతారు. పనులన్నీ పంచుకుందాం, ఇంటాబయటా ఇద్దరమూ కష్టపడ్డాం. తిని కూచోడమేకాదు మనసుకి తృప్తినిచ్చే మంచి పనులు ఏమైనా చేద్దాం అనే ఆడవాళ్ళు ఎందరు మగవాళ్ళకి నచ్చుతారంటావు? "

"ఇతర్ల సంగతి వదిలెయ్ బిందూ. నా వరకూ నేను హామీ ఇస్తున్నాను. నీ ఇష్టాయిష్టాలమీద నా పెత్తనం ఎన్నటికీ వుండదు. నీ స్వేచ్ఛని నేనెప్పటికీ హరించను. అలాగని నన్ను గుప్పిట్లో పెట్టుకోవాలని నువ్వూ అనుకోవద్దు"

"స్వేచ్ఛ కావాలని మొత్తుకునేవాళ్ళు ఇంకొకళ్ళకి సంకెళ్ళు ఎలా వేస్తారు? "

ఇద్దరూ నవ్వుకున్నారు.

★ ★ ★

వీరయ్య పొగాకు చుట్టుకుంటూ కూర్చున్నాడు.

బిందు వెళ్ళి ఆయనెదురుగా కూర్చుంది.

"ఏమ్మా మా ఊరెలా వుంది? "

"ఊరు అంటే... బస్సులు, రోడ్లులాంటి ఏ సౌకర్యాలూ లేకపోవడం బాగాలేదు. మేమొచ్చింది మీ ఇద్దరి కోసం కదా, మీరైతే నచ్చారు"

వీరయ్య ముసిముసిగా నవ్వాడు.

"తాతగారూ నాకో రెండు కోరికలున్నాయి, తీరుస్తారా? "

"నేను తీర్చగలిగేవైతే తీరుస్తాను, అవేంటో చెప్పమ్మా"

"మీరు తీర్చలేనివి అడగనులెండి. రెండూ మీరు చేయగలిగినవే"

"అయితే ఇకనేం అడుగు"

"తీరా అడిగాక నావల్లకాదు అనకూడదు"

"ముందు చెప్పమ్మాయి. ఈ ఊరొచ్చి మాతో కలిసి నాలుగురోజులున్నావు. మాలో కల్సిపోయి ఎంతో ఆపేక్షగా ఉన్నావు. అలాంటి నువ్వడిగితే నా తాహతుకు మించిందైతే తప్ప మరేమైనా చేస్తాను"

"థాంక్యూ తాతగారూ! మాటిచ్చేశారు. ఇంక మీరు మాట తప్పరని నా నమ్మకం. ఏంలేదు, చాలా చిన్న కోరికలు. ఒకటి- మీరీ నిమిషంనుండీ చుట్ట కాల్చడం మానేయాలి"

వీరయ్య బిత్తరపోయాడు.

"ఇదేమైనా మీ తాహతుకు మించిందా? " కొంటెగా అడిగింది బిందూ.

"ఇరవై ఏళ్ల వయసునుంచీ తాగుతున్నాను. ఇప్పుడు తాగకుండా ఉండడం ఎలా కుదురుతుంది? "

"నేనూ అదే అడుగుతున్నాను. అ...న్ని సంవత్సరాలు కాల్చారు కదా, ఇంకా ఈ పెద్దతనంలో ఏం కాలుస్తారు? "

"అమ్మో! చుట్ట తాగకపోతే ప్రాణం కుతకుతలాడుతుందమ్మాయి"

"అంటే ఎలా ఉంటుంది? "

"మాటల్లో చెప్పలేను. ఎప్పుడో పొగాకు దొరక్కో, బాగా దగ్గొచ్చో చుట్ట కాల్చలేదనుకో, ఇక ఏ పనిమీదా ధ్యాస పోదు. ఏమీ చేయాలన్పించదు"

"ఓస్ అంతేకదా! మీరేపనీ చేయనవసరం లేదు"

"నీకెలా చెప్పనమ్మాయి? ఇన్నేళ్ల అలవాటుని మానుకోవడం అంత సులభంకాదు"

"అంత కష్టం కూడా కాదు"

"నావల్ల కాదమ్మాయి"

"మీవల్ల అవుతుంది"

"పోనీ చుట్ట తాగే మరెవరినైనా అడిగి చూడు, మానగలరేమో"

"నేను మరెవర్నీ అడగను తాతగారూ. ఇతర్ల సంగతి నాకనవసరం. మీరు మానడమే నాక్కావాలి"

"అబ్బో పిచ్చి పట్టినట్లుటుందమ్మాయి"

"పట్టనివ్వండి. దానికి మందులున్నాయి"

అనేసి నాలుక కొరుక్కుంది పెద్దాయనతో ఇలా మాట్లాడకూడదని.

అదృష్టవశాత్తూ వీరయ్యకి ఆమాట విన్పించక "ఏమన్నావు" అన్నాడు.

"ఏంలేదు. మీ పట్టుదల, కార్యదీక్షల గురించి మామ్మగారు నాకు వివరంగా చెప్పార్లే. అనుకుంటే మీరు ఏదైనా చేస్తారనీ, ఇంకెవ్వరూ మీతో సరిరారనీ చెప్పారు"

వీరయ్య సంతోషంగా చూశాడు.

"నేను కేవలం మిమ్మల్ని పొగడాలని అనడంలేదు తాతగారూ. మీరు తల్చుకుంటే ఆ అలవాటు మానడం అంత కష్టమేం కాదు. చుట్ట కాల్చాలన్పించినపుడల్లా ఒక వక్కపలుకు నోట్లో వేసుకోండి. నిజానికి అదీ అంత మంచిది కాదు"

"అసలు చుట్టమానడం అవసరమా?"

"చాలా అవసరం. నాగ్గానీ మీతో ఒక ఇరవయ్యేళ్ల ముందు పరిచయం అయి వుంటే అప్పుడే మాన్పించేదాన్ని"

వీరయ్య తల పంకించి నవ్వుతోంటే "ఏంటీ, ఇప్పటిదాకా పరిచయం కానిది మంచిదైంది అనుకుంటున్నారా?" అంది.

"అబ్బే. నేనేం అనుకోలేదు. ఈ ఒక్క

చుట్ట కాల్చనీ, తర్వాత మానడానికి చూస్తాను"

"ప్లీజ్ తాతగారూ, ఇప్పట్నుంచే మానే యండి. దేన్నయినా ఒకసారి పోస్ట్‌పోన్ చేస్తే ఇక అలా చేస్తూనే వుంటాం"

"తప్పదంటావా? "

"తప్పదు"

వీరయ్య నిర్వికారంగా ఆ పొగాకుని వుండలా నలిపి, దూరంగా విసిరేశాడు.

తనమీద అభిమానంతో ఆ అలవాటుని మానేందుకు ఒప్పుకున్న వీరయ్యగారిమీద బిందూకి గొప్ప గౌరవం కలిగింది.

సంబరంగా "థాంక్యూ తాతగారూ, మరి రెండో కోరిక కూడా చెప్పనా? " అంది.

"నాకున్నదల్లా ఇదొక్కటే బలహీనత. ఇంకేం మానాల్సింది లేదు. తిండి తిన డమో, గాలి పీల్చడమో ఐతే మానమని అడగవుగా"

"ఛ... నేనంత రాక్షసిని కాదు తాత గారూ"

"ఇంత మంచిపిల్లని పట్టుకుని అంత మాటంటానా? "

"థాంక్యూ. ఇక రెండోకోరిక ఏమిటంటే మీరిద్దరూ ఈ ఊరొదిలి మాతో వచ్చే యాలి"

వీరయ్య అంతులేని ఆశ్చర్యంతో ఒక క్షణం కళ్ళు పెద్దవి చేసి చూసి, అంతలోనే తల పంకిస్తూ నవ్వేడు.

"జోక్కాదు తాతగారూ, నిజంగా అంటు న్నాను. ఈ ఊళ్ళో మీరిద్దరూ వుండటం నాకు ఎంతమాత్రం నచ్చలేదు. రానురాను వయసు పెరుగుతుందేగానీ తగ్గదు కదా. ఏ కష్టమూ మనకి చెప్పిరాదు. ఏ అర్ధ రాత్రో అపరాత్రో మీకేమైనా అనారోగ్యం చేస్తే మామ్మగారు గాబరాపడ్డానికి మించి ఏం చేయగలరు? అలాగే మామ్మగారికే మైనా మీరూ ఏంచేయలేరు"

"మాకేం సుస్తీ చేయదమ్మాయి. ఈ కాల ప్పిల్లల్లా నాజూకు తిళ్ళు తినలేదు. ఏదెలా వున్నా సుష్టుగా తిని కాయకష్టం చేసిన వాళ్ళం. అందుకే ఈ వయసులో కూడా ఇంత దృఢంగా వున్నాం"

"అది నిజమే తాతగారూ, కానీ అన్ని కా లాలూ మన చేతిలో వుండవని మీలాంటి పెద్దలే చెప్పారు. ఏమీ జరక్కపోతే మరీ సంతోషమే. కానీ కీడెంచి మేలెంచమం టారు కదా"

"పట్నంలో పుట్టి పెరిగినా నీకు సామె తలు బాగానే తెలుసనుకుంటా"

"మా నాన్నమ్మకి చాలా సామెతలొచ్చు ఆవిడ దగ్గర విని కొన్ని నేనూ వంటపట్టిం చుకున్నాను. ఇంత పెద్ద వయసులో ఎవరూ లేనట్లు మీరీ మారుమూల ఊళ్లో వుండాల్సిన అవసరం ఏమిటి? నేనంటే మీకు ఏమీ కాన నుకోండి కానీ హరిమీద కూడా మీకు ప్రేమ లేదా తాతగారూ? " అంది బాధగా.

"అలా మాట్లాడకమ్మాయి. నువ్వేం కాక పోవడమేంటి? హరి నిన్ను చేసుకుంటే నువ్వూ మా మనవరాలివేగదా. అయినా అభిమానాలు ఏర్పడ్డానికి చుట్టరికాలు వుండాల్సిన అవసరం లేదు"

"బాగా చెప్పారు తాతగారూ. చుట్టరికం కంటే స్నేహం గొప్పది. మనుషుల మధ్య పరస్పరం స్నేహాను బంధం వుండాలి"

"అవునమ్మా. అయినవాళ్ళయినంతలో ఆదరిస్తారని ఏమీ లేదు"

"మీరు మాట దాటేయకండి. మాతో రావడం మీకు ఇష్టమా కాదా చెప్పండి"

"ఇంత పెద్ద విషయం ఇలా నిమిషాల్లో చెప్పమంటే ఎలా అమ్మాయి? "

"ఇదేం అంతర్జాతీయ సమస్య కాదు తాత గారూ. వారాలూ, నెలలూ చర్చించడానికి"

"నీకర్థంకాదులే. పుట్టిపెరిగిన ఊరు వద లడమంటే అంత తేలిక్కాదు"

"ఎందుక్కాదు? ఆడపిల్ల తను పుట్టిపెరి గిన ఊరిని పెళ్లి చేసుకోగానే వదిలేసి రావ డంలేదూ? "

"అది వేరు"





"అది వేరూ కాదు. ఇది కాండమూ కాదు. కోపం తెచ్చుకోకండి. నా తీరే అంత. నేనలాగే మాట్లాడ్తాను అపార్థం చేసుకోకండి. పోనీ ఆడపిల్లల సంగతి అలా వుంచండి. మగపిల్లలు ఎక్కడ మంచి ఉద్యోగం వస్తే అక్కడికి పరిగెట్టడం లేదూ? పుట్టిపెరిగిన ఊరు అనే సెంటిమెంటుతో అంటిపెట్టుక్కూర్చుంటున్నారా? "

"మా తరం వేరమ్మా. ఈ కాలం పిల్లల్లా అన్నీ దులపరించుకుని బతకడం మావల్ల కాదు"

"అలా మాట్లాడకండి తాతగారూ. ఎందులో తప్పులేదో, ఏ పని చేస్తే మనకి సుఖంగా, శాంతంగా వుంటుందో అలా చేయడం, అవసరాన్నిబట్టి మారడం తప్పు కాదు. మీరు ఇక్కడే వుంటానని మొండి పట్టు పట్టడంలో అర్థంలేదు. నేను ఎక్కువగా మాట్లాడ్తున్నానేమో నన్ను క్షమించండి. కానీ మీ మంచికోసమే ఇలా అంటున్నాను. ఈ వయసులో మీరు ఇక్కడ ఒంటరిగా వుండాల్సిన అవసరం ఎంత మాత్రం లేదు"

వీరయ్య విని ఊరుకున్నాడు.

"చెప్పండి తాతగారూ, వస్తారు కదూ"

"ఇంతకీ ఆవిడేమంది? "

"నేనింకా మామ్మగారితో దీని గురించి మాట్లాడలేదు. మామ్మగారికంటే కూడా మీరే పెద్దవాళ్ళు కదా. మొదట మిమ్మల్నే ఒప్పించాలనుకున్నాను"

"అలా కాదులేమ్మా, ముందు ఆవిడతో అనిచూడు. ఆవిడకిష్టమైతే అప్పుడు చూద్దాం"

"ప్లీజ్ తాతగారూ, మీరు ఒప్పుకుంటే మామ్మగారు కూడా ఒప్పుకుంటారు"

"కానీ ఈ ఊళ్ళో పుట్టినవాణ్ణి. ఈ మట్టిలోనే కలిసిపోవాలని వుందమ్మా"

"అలా మాట్లాడకండి తాతగారూ. మనం చనిపోయాక సంగతి ఇప్పుడెందుకు? బతికుండగా వీలైనంత సుఖంగా, శాంతంగా వుండటానికి చూడాలి కానీ"

"ఊరిమీద, ఇక్కడి వాళ్ళమీద మమకారం వుంటుందిగా"

"వుండదని నేననను. మీకు ఈ ఊరిని చూడాలన్పించినపుడల్లా తీసుకొచ్చి చూపిస్తాంగా"

వీరయ్య ఆలోచనలో పడ్డాడు.

బిందూ ఆయనవంకే చూడసాగింది.

"ఇంతకీ మమ్మల్ని తీసికెళ్ళి ఎక్కడ వుంచుదామని? "

బిందూ 'హమ్మయ్య, ఒక దారిలో కొచ్చారు' అని మనసులో అనుకుని చిన్నగా నవ్వింది.

ఆయన చెప్పమన్నట్లు చూశాడు.

"తాతగారూ, దాని గురించి నేనింకా కాంక్రీట్‌గా, అంటే బాగా ఆలోచించలేదు. కానీ ఒక్కమాట మాత్రం చెప్తున్నాను. మీకు ఏ కొద్ది అసౌకర్యమూ కూడా కలక్కుండా చూసుకుంటాను. మిమ్మల్ని ఏ రకంగానూ నొప్పించను. మా ఊరొదిలి ఎందుకొచ్చాంరా అనుకునే పరిస్థితి ఎంత మాత్రం రాకుండా చూస్తాను. నన్ను నమ్మండి తాతగారూ"

"నువ్వింత ప్రాధేయపడాల్సిన, బతిమలాడాల్సిన అవసరం లేదమ్మా. మమ్మల్ని తీసికెళ్ళినందువల్ల లేనిపోని కష్టాలేగానీ, నీకు ఒరిగేదేం వుంటుందని. అంతగా నీకు మమ్మల్ని చూడాలనిపిస్తే నువ్వే వీలున్నపుడల్లా వచ్చి నాలుగురోజులు వుండిపోవచ్చు కదమ్మా"

"మళ్ళీ మొదటికి రాకండి తాతగారూ. మీరు నామాట కాదనకుండా అక్కడికి రండి. వచ్చి కొన్నాళ్ళు వుండి చూసి మీకు ఒకవేళ నచ్చకపోతే వెనక్కివచ్చేద్దురుగాని. అయినా నచ్చకపోవడానికి అవకాశం లేకుండా చేస్తాననుకోండి"

"సర్లే, చూద్దాం"

"ఆ 'లా'వత్తు తీసేయండి"

"ఏంటీ? "

"అవును. సర్లే అని కాకుండా సరే అనండి"

"నువ్వు కాస్త మొండిపిల్లవే"

"కాస్తం ఖర్మ, జగమొండిని. గాంధీజీ అంశ నాలోనూ వుందిలే తాతగారూ. ఆయన తెల్లవాళ్ళని వెళ్ళగొట్టి మన దేశానికి స్వాతంత్ర్యం తేగా లేనిది నేను మిమ్మల్ని ఇక్కణ్ణించి తీసికెళ్ళి ఒంటరితనాన్ని పోగొట్ట లేనా? "

వీరయ్య నవ్వుతూ చూశాడు.

"అయితే మమ్మల్ని తీసికెళ్ళి లేనిపోని లంపటాన్ని తగిలించుకుంటానంటావు"

"నేనలా అనుకోవడంలేదు. ఇలా చేయ డంలో నాకు ఆనందం వుంది. మనిషి ఏంచే సినా తన స్వార్థంతోనే కదా చేస్తాడు. డబ్బు సంపాదించినా, పెళ్ళిచేసుకున్నా, ఇంకేం చేసినా దానివల్ల తనకి ఏదో ఒక లాభం వుంటేనే చేస్తాడు. నేనూ నా స్వార్థంతోనే ఈ పని చేయడానికి పూనుకుంటున్నాను"

"పిచ్చిపిల్లా, నువ్వేదో అపోహలో వున్నట్లు న్నావుగానీ ఇందువల్ల నీకు నయాపైసా లాభం వుండదు"

"ఇప్పుడు పావలాకి తక్కువ పైసలే లేవు"

"పోమ్మాయి, నీకేదో తమాషాగా వున్న ట్లుంది"

"నేనెక్కువ మాట్లాడ్తే మీ మూడ్ మారే ట్లుంది. ఇపుడు కాసేపు మాట్లాడకపోతే మంచిదేమో"

"నీకింకా చిన్నతనం పోలేదు"

"ఈ మాట చాలామంది అంటారు లౌక్యం తెలీదని, మాయలు, మర్మాల గురించి తెలీ దని. ఆ మూడు గుణాలు, లేకపోవడమే చిన్నతనం అయితే నేనలాగే వుండిపోతాను"

"కానీ మమ్మల్ని ఇంతగా ఒప్పించి తీసికె ళ్ళడంవల్ల..."

"బోల్డంత లాభం వుంది. అది డబ్బుల్లో కొలిచేదికాదు. మనసుకి కలిగే ఆనందాన్ని కొలవడానికి పరికరాలేం లేవుగానీ వుంటే అదెంతో మీకు చెప్పగలిగేదాన్ని"

"మాకే రోగమో, రొష్టో వస్తే ఏం చేస్తావు? "

"ముఖ్యంగా నేను భయపడ్తోందే అందుగు రించి. అలా జరిగితే అక్కడ వీధికో డాక్టరుం టారు. వెంటనే చూపడానికీ, వైద్యం చేయిం చడానికీ వీలవుతుంది"

"మమ్మల్ని ఎక్కడ వుంచుదాం అనుకుంటు న్నావో చెప్పనేలేదు"

"ఒక పెద్ద ఇల్లు అద్దెకి తీసుకుని, అందరం కలిసేవుందాం"

"మరి..."

"ప్లీజ్ తాతగారూ, మళ్ళీ వెనక్కి తగ్గకండి. మిమ్మల్ని ఒప్పించేసరికి ఆయాసం వచ్చింది. ఇంకా మామ్మగార్ని ఒప్పించాల్సివుంది. కొంచెం శక్తి పుంజుకోనివ్వండి. ఆ తర్వాత మీకు ఇంకేమైనా సందేహాలుంటే తీరుస్తాను. సరేనా? "

వీరయ్య మనసారా నవ్వాడు.

"మళ్ళీ చుట్ట జోలికిపోరు కదూ..." అని ప్రేమగా తర్జని చూపుతూ అక్కణ్ణించి లేచింది బిందు.



శారదమ్మ, శ్రీహరి, వేపచెట్టుకిందున్న గట్టుమీద కూర్చుని గోంగూర బాగుచేస్తు

న్నారు.

"ఇంత గోంగూర ఎందుకు మామ్మా?" అంది బిందు వాళ్ళదగ్గరకొచ్చి

"పచ్చడి పెడదామని"

"ఇంత కష్టపడి పచ్చడి చేయాలా మామ్మగారూ? పచ్చళ్ళు తయారుచేసి, హాయిగా సీసాల్లో పెట్టి మరీ అమ్ముతున్నారుగా"

"బయట అమ్మేవి మనం చేసుకున్నవాటిలాగా కమ్మగా వుంటాయా?"

"మీరేమైనా అనుకోండి, ఇలాంటివాటినే చాదస్తాలు అంటారు. ప్రియా పికిల్స్ మన ఇంటి పచ్చళ్ళలాగే వుంటాయి"

"కానీ..."

"ఈ కానీ అనే పదం ఎవరు కనిపెట్టారో గానీ దీంతోనే చిక్కంతా వచ్చిపడ్తోంది. దేని గురించి ఎంత చెప్పినా ఒప్పుకున్నట్లే వుంటారు. మళ్ళీ కానీ అంటూ విసిగిస్తారు" అని నాలుక్కరుచుకుని, "సారీ మామ్మా, ఇది ఎక్స్ట్రా అనుకుంటా. అదేంటో నా నాలుక మీంచి మాటలు జారుడుబండకి మల్లే జారి పోతుంటాయి" అంది.

శ్రీహరి తల పట్టుకున్నాడు.

"ఇదిగో హరీ, మీ అమ్మమ్మ అంటూ తేడాలేం లేవదీయకు. ఆవిడ నీకెంతో నాకూ అంతే. నేనేమైనా ఎక్కువ తక్కువ మాట్లాడ్తే మామ్మే నన్ను డైరెక్టుగా తిడ్తుంది. లేదంటే నా చెంపలు నేనే వాయించుకుంటాను. అంతే తప్ప నువ్వేం కల్పించుకోకు"

ఈసారి కణతలు నొక్కుకున్నాడు.

"అన్నట్లు నిన్ను తాతగారు రమ్మంటున్నారు"

"నన్నా... ఎందుకు?"

"ఏమో, వెళ్ళి కనుక్కో"

"నిజంగానే పిల్చాడా తాతయ్య?"

"ఒకవేళ పిలవకపోతే మాత్రం కాసేపు ఆయన దగ్గర కూర్చుని మాట్లాడకూడదా?"

"అంటే ఇప్పుడు నేనిక్కడ వుండడం నీకు ఇష్టంలేదన్నమాట. అంతేగా?"

"నిజం చెప్పాలంటే అంతే. నిన్నెందుకులే హర్ట్ చేయడం అని ఏదోరకంగా పంపిద్దాం అనుకుంటే నువ్వంత తేలిగ్గా ఎందుకెళ్తావు. అదేంటో ప్రజలు చేదుగా వున్నా సరే నిజాలు తెలుసుకోవాలనుకుంటారు"

"ఇప్పుడు నేనుంటే నీకేం?"

"మామ్మగారితో నాక్కాస్త ఏకాంతం కావాలి"

"హూ... మీ ప్రైవసీకి నేనేం భంగం కల్గించనులే వెళ్తున్నాను. కానీ పాపం, అమ్మమ్మ... ఎలక కొరికినట్లు ఆవిడ బ్రెయిన్ని తినకు"

'నేనేం తిననులే, పోవోయ్' అన్నట్లు చూసింది.

శ్రీహరి తాతగారున్న వసారావైపు వెళ్ళగానే ఆ ప్లేసుని బిందూ ఆక్రమించి తను కూడా ఆకు బాగు చేయసాగింది.

"ఏవిటి సంగతి?" శారదమ్మ నవ్వుతూ అడిగింది.

"ఏంలేదు మామ్మా, నిన్నో కోరిక కోరదల్చుకున్నాను. అది నువ్వు తీర్చాలి, అంతే..."

"ఏవిటి? మళ్ళీ కొత్తిమీర పచ్చడిమీదకి మనసు పోయిందా? అలాగే చేసిపెడ్తానులే"

"అదేంకాదు"

"మరింకేంటి?"

"చెప్పాక నువ్వు కాదూ, కూడదు అంటే నా మనసు పాడౌతుంది"

"అనన్లే చెప్పు"

"నిజంగా అనవుగా?"

"హరి నా పంచప్రాణాలూ అని నీకు తెల్సు. వాడిక్కాబోయే పెళ్లానివంటే నీమీద నాకు..."

"అంతేనా మామ్మా? నేనెవరో తెలీక ముందు కేవలం హరినిబట్టి ఇష్టపడడం సహజమే. కానీ నాలుగురోజులు నన్ను చూశాక్కూడా నేనుగా నచ్చలేదా?"

శారదమ్మ అయోమయంగా చూసింది. ఈ ఇండివిడ్యువాలిటీలు పల్లెలో వుండే ఆవిడకి తెలీదు.

"అలా కాదు మామ్మా, నాలుగురోజులు నన్ను చూశారుకదా. మంచిదాన్ననో, చెడ్డదాన్ననో నామీద ఒక అభిప్రాయం ఏమీ ఏర్పడలేదా? "

"ఏర్పడకేం? మంచిపిల్లవి. కల్లాకపటం తెలీదు. మనసులో ఏదీ దాచుకోలేవు. అన్నీ బోళాగా పైకి చెప్పేస్తుంటావు"

"చాలు మామ్మా. ఇంతకంటే కాంప్లిమెంట్ ఇంకేం కావాలి? ఇప్పుడు వినండి, నేను కేవలం మీ హరికి కాబోయే భార్యగా కాక నా అంతట నేనుగా ఒక నిర్ణయం తీసుకున్నాను"

"ఏమిటది? "

"అది చెప్పాలంటేనే భయంగా వుంది"

"నన్ను చూస్తే భయమా? నేనేం కొడ్తానా, తిడ్తానా? "

"అదేంకాదు, తొందరపడి కాదనేస్తావేమోనని భయం. ఇప్పటివరకూ కష్టపడి తాతగార్ని ఒప్పించాను. ఇక నువ్వే మిగిలావు"

"ఈ ఇల్లేమైనా నీ పేరున రాసివ్వమంటావా? "

"ఊరంతా రాసిచ్చినా అక్కర్లేదు"

"చెప్పమ్మాయి, దేని గురించి? "

"ఏంలేదు మామ్మా. మీరు మాతో రావాలి"

"ఓసి నీ దుంపతెగ, ఆ మాత్రానికేనా ఇంతసేపు సాగదీశావు. వస్తాంలే. రేపు మీ పెళ్ళికొచ్చి నాలుగురోజులు వుంటాం"

"పెళ్ళికి చాలామందే వస్తార్లే. అదికాదు"

"మరేంటి? మీ పెళ్లయ్యాక మీ ఇంటికొచ్చి కొన్నాళ్ళు వుండమంటావా? "

"ఏదో చుట్టంచూపుగా రమ్మనడానికి ఇంత బిల్డప్ ఎందుకు మామ్మా? మిమ్మల్ని పూర్తిగా వచ్చేయమంటున్నాను"

"ఏంటీ, పూర్తిగానే!"

"అవును మామ్మా. అంత ఆశ్చర్యం ఎందుకు? ఆటంబాంబు వేసినట్లు"

"ఇందుకు తాతయ్య ఒప్పుకున్నాడా? "

"ఊ... ఒప్పించేసరికి నా తాతలు దిగొచ్చారనుకో. ఇక నిన్ను కన్విన్స్ చేసేసరికి తాతమ్మలు దిగొస్తారేమో"

"మేం అక్కడికి రావడం ఎందుకు? "

"ఇక్కడ వుండడం మాత్రం ఎందుకు? "

"ఇది మరీ బాగుంది. ఇది మా ఊరు, ఇక్కడగాక ఇంకెక్కడుంటాం? "

"మనం ఎక్కడుంటే అదే మన ఊరవుతుంది"

"అదెలా అవుతుంది? "

"వచ్చాక నువ్వే చూస్తావుగా"

"వచ్చి అక్కడ మేమేం చేయాలి? "

"ఏమీ చేయక్కర్లేదు, రావాలంతే"

"నేను కన్నపిల్లలే వచ్చి నాలుగురోజులు వుండమనడం తప్ప పూర్తిగా వుండేందుకు రమ్మనలేదు. ఎవరో కన్నబిడ్డవి నువ్వామాట అంటున్నావు"

"అందులో ఏముందిలే మామ్మా? మీ అమ్మాయిలకంటే ఒక తరం తర్వాతిదాన్ని కదా. అందువల్ల ప్రతి పనీ భర్త అనుమతితోనే చేయాలనుకునేంత చాదస్తంలేదు. దీనికి పొగరు అని పేరు పెట్టకండి. నేనూ హరితో సమానంగా చదువుకున్నాను. హరికి రాని ఆలోచన ఏదైనా నాకు వస్తే అందులో తప్పేం లేకపోతే చేయడానికి అభ్యంతరం ఏముంది? "

"అధ్సరే, మమ్మల్ని తీసుకెళ్ళాలనే ఆలోచన నీకెలా వచ్చింది? "

"అబ్బో అది చెప్పాలంటే పెద్ద కథ. అయినా వీలైనంత క్లుప్తంగా చెప్తాను విను"

అని నాటకీయంగా గొంతు సవరించుకుని మళ్ళీ మొదలుపెట్టింది బిందూ.

"పెళ్ళికాకుండా హరితో కలిసి మరో ఊరికి ప్రయాణం చేయడం నాకు అస్సలు ఇష్టం లేదు. కానీ హరి మీ గురించి చెప్పాక కాదనలేకపోయాను. తర్వాత మా అమ్మని ఎలాగో తంటాలుపడి ఒప్పించాను. అదంతా ముగిసి మొత్తానికి ఇక్కడికొచ్చాను.

తీరా చింతపల్లి గేట్ దగ్గర దిగి ఈ




ఊళ్ళోకి రావడంతో మొదలుపెట్టి, ఇక్కడ టాయ్‌లెట్స్ లేకపోవడం, ఎలక్ట్రిసిటీ కనెక్షన్ లేకపోవడం, ఫోన్ల వసతి లేకపోవడం... ఆఖరికి చుట్టుపక్కల ఓ డాక్టరైనా లేకపోవడం ఇవన్నీ తెల్సిన కొద్దీ నాలో కోపం, విసుగు ప్రవేశించాయి.

ఇట్లాంటి ఊళ్ళో మీ పెద్దవాళ్ళిద్దరూ వుండడం అస్సలు నచ్చలేదు. నచ్చలేదు అనే కంటే మనసు పిండినట్లుంది అంటే సరిగ్గా వుంటుంది.

అందుకే మిమ్మల్ని ఎలాగైనా ఒప్పించి సిటీకి తీసుకెళ్ళాలనీ, ఈ వయసులో మీకు ఎలాంటి ఇబ్బందీ కలక్కుండా చూసుకోవాలనీ అన్పించింది..."

"ఓసి పిచ్చిపిల్లా అదా సంగతి? నువ్వంటే పట్నంలో పుట్టి పెరగడాన నీకు ఈ ఊళ్ళో అసౌకర్యంగా వుండి వుంటుంది. కానీ మాకు అవన్నీ అలవాటైపోయాయమ్మా"

"నేను కూడా అడవిలో ఒక నెల రోజులుంటే వీరప్పన్‌లా ఆ అడవి వాతావరణానికే అలవాటుపడ్తాను. కానీ మామ్మా మేమెవరం లేకపోతే చేయగల్గింది లేదు. ఉండి కూడా మీరింత నిస్సహాయంగా ఎందుకుండాలి?"

"నిస్సహాయం ఏముందిలేమ్మా? ఇది ఊరేగా, అడవికాదుగా. అయినవాళ్ళు కాకపోయినా ఇరుగూపొరుగూ అందరూ లేరూ?"

"మీరెన్నయినా చెప్పండి, నాతో రాక తప్పదు"

"రాకపోతే ఏం చేస్తావేం?"

"అవసరమైతే నిరాహారదీక్ష చేస్తాను"

"బాగుందిలే సంబడం. అయినా తీసుకెళ్ళి మమ్మల్ని ఎక్కడ పెట్టుకుంటావు?"

"అసలు తాతగార్ని, నిన్ను ఒకేసారి కదిలిస్తే బాగుండేదేమో. ఆయన డౌట్లన్నీ నీకూ వస్తున్నాయి మనందరికోసం ఒక ఇల్లు తీసుకుందాం"

"ఏదో నాలుగురోజులుంటే ముచ్చటగా వుంటుందేమోకానీ, తర్వాత ముసలివాసన పనికిరాదే అమ్మాయ్!"

"బతికుంటే నాకు మాత్రం ముసలితనం రాదా?"

"అందరూ అలా అనుకోవడంలేదుగా"

"అందరి సంగతీ నాకు అనవసరం మామ్మా. నామీద కొంచెం నమ్మకం వుంచు. మిమ్మల్ని పనిమాలా తీసుకెళ్ళి అవమానించడమో, మనసుకి కష్టం కల్గించడమో చేస్తానా?"

"చేయవులేగానీ, ఎందుకొచ్చిన తంటా? మాకిక్కడ బాగానే వుంది"

"అక్కడింకా బాగుంటుంది"

"అయినా తాతయ్య మాటవరసకి అనుంటాడు కానీ ఆయన ఈ ఊరొదిలి వస్తాడంటే నేను నమ్మను"

"మీతరంవాళ్ళకి ఊరిమీద భ్రాంతి వుంటుందని నాకు తెలుసు మామ్మా. నాకూ అమ్మమ్మా, నాన్నమ్మా, తాతయ్యలూ వున్నారుగా. అందుకే తాతయ్యని చూడాలనుకున్నప్పుడు తీసుకొచ్చి ఊరు చూపించి తీసుకెళ్తామని మాటిచ్చాను"

"మమ్మల్ని తీసుకెళ్ళాలని స్థిరంగానే నిర్ణయించుకున్నావన్నమాట"

"ఎంత స్థిరంగా అంటే నిరాహారదీక్ష చేయడానిక్కూడా వెనుకాడనంత స్థిరంగా"

శారదమ్మ నవ్వింది.

"నీ నవ్వులు తర్వాత, ముందు సరేనని చెప్పు మామ్మా ఒక పనైపోతుంది"

"మమ్మల్ని ఎలా పోషిస్తావమ్మాయి?"

"నేను ఉద్యోగం చేస్తున్నాను మామ్మా. నన్ను నేను ఎలా పోషించుకుంటానో మీరూ నాతోబాటే"

"అంతేనంటావా?"

"ఇంకా చాలావుంది"

"చాలా వుందా?"

"అవును. ఒకేసారి చెప్తే నాటకీయంగా వుంటుంది. నువ్వు అసలే నమ్మవేమో, అసలు రావడానికే సందేహిస్తావేమో అని

# ఏరిన ముత్యాలు

★ ఎన్నుకోవడానికి హక్కు లేకపోవడం, ఎన్నుకోకపోవడం వల్ల మానవుడు మానవుడు కాదు, కీలుబొమ్మ.

– థామస్ జెఫర్ సన్

★ జీవితంలో కష్టాలు మానవుని సహజ స్వభావాన్ని ప్రకటిస్తాయి.

– ఎడ్విన్

★ గాలిపటం గాలికి ఎదురుగా ఆకాశంలోకి ఎగురుతుంది కానీ గాలితో పాటు ఎగురదు.

– అబ్రహాంలింకన్

★ సంతుష్టిని మించిన సౌభాగ్యం లేదు, ధైర్యాన్ని మించిన సద్గుణం లేదు.

– శారదాదేవి

★ ఎంత గౌరవ మర్యాదలు పొందావన్నది కాదు, ప్రేమ, ఔదార్యాలతో ఎంతసేపు సేవ చేశావన్నదే ముఖ్యం.

– నాథన్ సి.షీఫర్

★ ఆగ్రహావేశుడెప్పుడూ నోరు తెరిచి కళ్లు మూసుకుంటాడు.

– కాటో

★ ప్రలోభానికి లోనై ఏకాగ్రతను కోల్పోతే జీవితపు పరుగుపందెంలో లక్ష్యాన్ని సాధించలేరు.

– చిన్మయానంద

★ పనిలేనివారికే అనవసరపు ఆందోళనలూ, ఆలోచనలు.

– ఎమర్సన్

★ ఆశయంలేని జీవితం రత్నాల గనిలోకి వెళ్లి వట్టి చేతులతో తిరిగి రావడం వంటిది.

– గోల్డ్‌స్మిత్

★ ఒక చైతన్యాత్మకమైన అద్భుతశక్తి జీవితాన్ని ప్రణాళికాబద్ధం చేస్తుంది. ప్రతి ఒంపుకూ ప్రతిరేఖకూ కూడా ఒక అర్థం ఉంటుంది.

– శ్రీ అరబిందో

★ నిజాయితీ గల వ్యక్తి తన న్యాయమైన సందేహాన్ని ఎప్పుడూ ఒదులుకోలేదు.

– బెర్నార్డ్ షా

★ తన పనిని సాధించడానికి ఇతరులు మేథను ఉపయోగించుకునేవాడే అసలైన మేథావి.

– డోన్. పియట్

★ ఒకే విషయాన్ని ఇతరులు చూసినట్టే చూసి, భిన్నంగా ఆలోచించడంలోనే పరిశోధన ఆధారపడి ఉంది.

– సెనెకా

ఎమ్. అండమ్మ

భయంగా వుంది"
"భయంలేదులే చెప్పు"
"వెంటనే చెప్పన్లే. తర్వాత చెప్తాను. ఈ టాపిక్ ఇంతటితో ముగిద్దాం"
"ఏంటో నాకేం అర్థంకాలేదు"
"ఒక్క సంగతి అర్థమైందిగా. తాతగారూ, నువ్వూ మాతోనే వుంటారు. అంటే ఇకమీదట మీ మకాం చింతపల్లిలో కాదు చింతల్లేని హైదరాబాద్‌లో. రెస్టీజ్ నెక్ట్స్"
"ఆ...!"
"ఆ...'
ఇద్దరూ నవ్వుకున్నారు.

★ ★ ★

సాయంత్రప్పూట నలుగురూ కూర్చుని టీ తాగుతున్నారు. శ్రీహరి, తాతగారూ ఏదో మాట్లాడ్తున్నారు గానీ బిందూ అవేం వినడం లేదు. ఆమె ఆలోచనంతా తను స్థాపించాలనుకుంటున్న ఓల్డ్ ఏజ్ హోమ్ చుట్టూనే తిరుగుతోంది.
"దేని గురించమ్మాయి, అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు? " అన్నాడు వీరయ్య.
బిందూకి ఆ మాట విన్పించనేలేదు.
"ఏయ్ బిందూ, తాతయ్య మాట విన్పించలేదా? " అన్నాడు శ్రీహరి.
"ఆ? "
"కళ్ళు తెరుచుకునే కలలు కంటున్నావా? ఏం ఆలోచిస్తున్నావు అనడుగుతున్నాడు తాతయ్య"
"ఏంలేదు" అనేసింది బిందూ నవ్వుతూ.
"మామూలు ఆలోచన కాదులే తాతయ్యా, ఆవిడగారు గొప్ప ప్లాన్‌లో వుంది. ఇల్లు కట్టి చూడు, పెళ్లిచేసి చూడు టైపులో ఆశ్రమం పెట్టి చూడాలనుకుంటోంది"
హరి అలా చెప్తోంటే వాళ్ళిద్దరూ ఏమనుకుంటారోనని తల కిందికి దించేసి కూర్చుంది బిందు.
"ఆశ్రమం ఏంటమ్మా? "
బిందూ చెప్పేందుకు మొహమాట పడ్తోంటే "వృద్ధుల కోసం ఆశ్రమం తాతయ్యా" అన్నాడు హరి.
"ఇలాంటిది నేనెప్పుడు వినలేదే? "
"ఈ పల్లెటూళ్లో కూర్చుంటే నీకెలా వినిపిస్తాయి? కొన్నేళ్ళగా ముసలివాళ్ళకోసం ఆశ్రమాలు ఏర్పాటు చేయడం మొదలైంది"
"నిన్న పెళ్ళిలో పార్వతమ్మ చెప్పింది. ఆశ్రమం గురించి" అంది శారదమ్మ.
"ఎవరు ఏర్పాటు చేస్తున్నారు? "
"ఎవరేంటి? అలాంటి విషయాల్లో శ్రద్ధాసక్తులు వున్నవాళ్ళు. ఇదిగో ఈ బిందూలాంటి వాళ్ళు"
"వ్యంగ్యాలొద్దు హరీ"
"వ్యంగ్యం ఏముంది? అలాంటి పని చేయాలనుకుంటున్నావా లేదా? "
బిందు అలిగినట్లు మూతి ముడుచుకుంది.
"సరే, ఆ ఆశ్రమాల్లో ఏ ముసలివాళ్ళైనా వుండొచ్చా? "
"పిల్లలు చూడకో, అసలు పిల్లలే లేకో ఒంటరితనాన్ని భరించలేనివాళ్ళు వాటిల్లో చేరతారు తాతయ్యా"
"అలాంటి ముసలోళ్ళు మనూళ్లోనే చాలా మంది వున్నారు. వాళ్ళు చేరతామంటే చేర్చుకుంటారా? "
"చేర్చుకుంటారా అంటే అందర్నీ చేర్చుకోలేరుగా. ప్రతి హోమ్‌కీ ఒక లెక్కుంటుందిగా. ఆ ప్రకారం తీసుకుంటారు"
"అందులో వుండేవాళ్ళు డబ్బు కట్టాల్సి వుంటుందా? "
"ఆ వివరాలు నాక్కూడా సరిగా తెలీదు తాతయ్యా. నెలకో వెయ్యో రెండువేలో తీసుకుంటారనీ, ఇవ్వలేనివాళ్ల దగ్గర తీసుకోకుండా చేర్చుకునే హోమ్స్ కూడా వున్నాయని రఫ్‌గా విన్నాను"
"అంటే ఇక వాళ్ళ మంచి చెడ్డలన్నీ చూసుకుంటారా? "
"చూస్తారు"
"మరి చనిపోతే? "
"దహన క్రియలు కూడా వాళ్ళే జరిపిస్తారు. కావాలంటే వాళ్ళ వాళ్ళకి కబురు

చేస్తారు"

వీరయ్య శ్రద్ధగా విన్నాడు.

ఇలాంటివి వున్నాయని మునుపెన్నడూ విని వుండకపోవడాన కొత్తగా వుంది. శారదమ్మక్కూడా పార్వతమ్మ చెప్పేవరకూ తెలీదు.

"ఇదేదో బాగానే వుందే. ఎక్కడెక్కడో ఒంటరితనం అనుభవించే వాళ్ళంతా ఒక చోట చేరితే వాళ్ళే ఒక కుటుంబంలాగా ఏర్పడ్తారుగా" అన్నాడు వీరయ్య.

ఆయన ఒక్క ముక్కలో అంత బాగా చెప్పడం బిందూకి బాగా నచ్చి, ప్రశంసాపూర్వకంగా చూసింది.

"ఇప్పుడర్థమైందిగా. బిందూ కూడా అలాంటి వృద్ధాశ్రమాన్ని ఏర్పాటుచేస్తానంటోంది"

"ఇంత చిన్నవయసులో అంత పెద్ద పని చేయగలవా? ఇంకొన్ని సంవత్సరాలు పోయాక మొదలెడ్దుగాన్లే బిందూ"

"కాదులే మామ్మా. ఒక మంచిపని అనుకున్నది వీలైనంత త్వరగానే ప్రారంభించాలి"

"కానీ నీవల్ల అవుతుందా? "

"కేవలం నావల్ల కాకపోవచ్చు. హరి కూడా హెల్ప్ చేస్తాడు. మిమ్మల్ని కూడా అందులో ఇన్‌వాల్వ్ చేస్తాను"

"ఏంటి? "

"మీరు కూడా అందులో భాగమై నాకు సహకరిద్దురుగాని మామ్మా. ఒకేసారి పెద్ద ఎత్తున పెట్టి అయోమయంలో పడాలనుకోవడంలేదు. ముందు పంచపాండవుల్లా మీ ఐదుగురితో హోమ్‌ని స్టార్ట్ చేయాలని వుంది"

"ఏ ఐదుగురు? "

"ఇంకా అర్థంకాలేదూ? నువ్వు, తాతగారు, మీ అక్కయ్య, బావ, మంగమ్మగారు"

శారదమ్మ, వీరయ్య కూడా చిత్రంగా చూశారు.

"అవును మామ్మా, మొదట మీ ఇద్దరి వరకే అయితే మాతో వుంచుకోవాలి అనుకున్నాను. కానీ వాళ్ళ ముగ్గుర్నీ కూడా చూశాక నాలో అలజడి మొదలైంది. పెళ్ళిలో పార్వతమ్మగారి మాటలు విన్నాక ఈ ఆలోచన వచ్చింది. వాళ్ళ ఒంటరితనం చూశాక నా మనసు కదిలిపోయింది. మంచి వయసులో వున్నపుడు నానా అగచాట్లూ పడి శారీరకంగా, మానసికంగా అలసిపోయి తీరా వయసు మీర్రాక కాళ్ళు బారజాపుకుని కృష్ణా రామా అనుకోకుండా దేవుడెప్పుడు తీసికెళ్తాడా అంటూ చావుకోసం ఎదురుచూట్టం నేనే భరించలేకపోయాను"

బిందూ అలా చెప్పుకుపోతోంటే పెద్దవాళ్ళిద్దరూ కళ్ళూ, చెవులూ అప్పగించి వినసాగారు.

"అందుకే ఇలాంటివాళ్ళకోసం నేనేమైనా చేయాలి అనుకున్నాను. నాకు స్వయంగా దీని గురించి ఏమీ తెలీదు. హైదరాబాదులో ఇలాంటి వృద్ధాశ్రమాలు నాలుగైదు వున్నాయని విన్నాను. నేను అక్కడికి వెళ్ళగానే చేసే మొదటిపని ఆ హోమ్స్‌కి వెళ్ళి వివరాలన్నీ సేకరించడం, అందులో వుండే కష్టనష్టాలన్నీ తెలుసుకోవడం, ఏమేం చేయాల్సుంటుందో వంటపట్టించుకోవడం" అంటూ ప్రశాంతంగా నవ్వుతూ చెప్పింది బిందు.

శారదమ్మ, వీరయ్య ఆశ్చర్యంలో మునిగిపోయారు.

శ్రీహరి ఒక చేతిని మడిచి, రెండో చేతివేళ్ళని లయబద్ధంగా తాకిస్తున్నాడు.

"ఏంహరీ, మాట్లాడవే? " అడిగింది బిందు.

"అమ్మమ్మ, తాతయ్యా అంటే సరే. పెద్దమ్మమ్మ, తాతయ్యా, మంగమ్మగారు నీ ప్రపోజల్‌ని ఒప్పుకుంటారా? ఇష్టపడి వస్తారంటావా? "

"ఖచ్చితంగా వస్తారని నేనెలా చెప్పగలను హరీ? రావాలని మాత్రం కోరుకుంటున్నాను. వాళ్ళ మాటలు విని, వాళ్ళ దుఃఖాన్ని అర్థం చేసుకున్నపుడు మీకోసం నేనున్నానని చెప్పాలన్పించింది. వాళ్ళ ఒంటరితనాన్ని పోగొట్టి, కష్టాన్ని, సుఖాన్ని పంచుకోవాలన్పించింది.





అంతే. ఇంతకుమించి ఇంకేం చెప్పను? "

"అమ్మమ్మా, వాళ్ళు ముగ్గురూ హైదరాబాదు వచ్చేందుకు ఇష్టపడ్తారా? లేక ఏదో మనసులోమాట ప్రేమగా చెప్తే ఇలా అడుగు తొందేమిటి అని అపార్థంచేసుకోరు కదా? " అన్నాడు హరి.

"ఆ అమ్మాయేమైనా వాళ్ళని అవమానిస్తోందా లేక చులకనగా చూస్తోందా? నవనీతంలాంటి మంచి మనసుతో ఏదో చేయాలని ఆశ పడుతోంటే అందులో అపార్థం చేసుకోడానికేం వుందిరా? " అన్నాడు వీరయ్య బిందూపట్ల మరింత అభిమానం పెంచుకుని.

"థాంక్యూ తాతగారూ" అంది బిందూ ఆనందంగా.

"ఇదేదో వర్కవుట్ అయ్యేట్లే వుందే" అన్నాడు హరి కూడా నవ్వుతూ.

"మామ్మా, వాళ్ళ ముగ్గురితో ఈ విషయమై నువ్వు ముందుగా మాట్లాడ్తే బాగుంటుంది అనుకుంటున్నాను. నువ్వంటూ ప్రస్తావిస్తే తర్వాత వివరంగా నేను మాట్లాడ్తాను, ఏమంటావు? " అంది బిందు.

"మంగమ్మ అయితే నామాట కాదనదు. ఒకపక్కన తిండికి జరక్క, మరోపక్కన తిన్నగా పలకరించే దిక్కులేక అల్లాడుతోంది. కనుక మంగమ్మ ఆనందంగా ఒప్పుకుంటుంది. ఇక మా అక్కయ్యావాళ్ళంటావా, నేను చెప్పి చూస్తాను" అంది శారదమ్మ.

"నువ్వయితే ముందు హైదరాబాదు వెళ్ళి అన్నీ తెల్సుకో అమ్మాయి. పక్కాగా చేయగలను, పదిమంది ముసలోళ్ళకి ఆదరవు కల్పించగలను అనుకుంటే అప్పుడు చెప్పు. నేను బీరపాడు వెళ్ళి వాళ్ళిద్దరితో మాట్లాడ్తాను. వాళ్ళు కాకపోతే మరొకరు, ఇంకొకరు. నీకంటూ ఇలాంటి సంకల్పం వుండాలేగానీ దిక్కులేని వృద్ధులు చాలామందే వుంటారమ్మా" అన్నాడు వీరయ్య.

"అంతా బాగానే వుంది గానీ, విటమిన్ ఎమ్. మాట ఏమిటి? " అన్నాడు హరి.

"డబ్బా? దాందేముంది ఏటీఎమ్ సెంటర్ల కెళ్ళి బాక్సులు బద్దలు కొడ్తేసరి కావల్సినంత డబ్బు"

"నువ్వేం చిరంజీవిననుకుంటున్నావా బాక్సులు బద్దలు కొట్టేందుకు? "

"చిరంజీవినీ కాను, విజయశాంతినీ కాను. అయామ్ బిందూ... హిమబిందూ"

"కదా? ! కేవలం బిందూవే కదా, మల్టీమిలియనీర్ కూతురివి కాదుగదా"

"చూడు తాతయ్యా, ఎప్పుడూ వ్యంగ్యాలూ, ఎగతాళులే"

వీరయ్య ముసిముసిగా నవ్వేడు.

"అయ్యో రామ ఇందులో ఎగతాళేంలేదు. మనీ మేటర్ ఏం చేస్తావో అది చెప్పు"

"ఒక జోలె పుచ్చుకుని చందాలకి బయల్దేరతాను"

"ఇదో రకమైన బిజినెస్ కాబోలనుకుంటే? "

"అనుకునేవాళ్ళని ఎవరాపగలరు? విరక్కాసిన చెట్టుకి రాళ్ళెక్కువ తగుల్తాయని మా నాన్నమ్మ అంటుంది. నేను కష్టపడి సంపాదించుకునే డబ్బే నాకు ఎక్కువ తక్కువ. ఇక ఇలా ఏదో వంకన చందాలు వసూలుచేసి డబ్బు సంపాదించాల్సిన అవసరంలేదు. ఇచ్చేవాళ్ళు ఇస్తారు, ఇవ్వని వాళ్ళని తన్ని తీసుకోంగా"

"పోనీ అలా అనుకున్నా ఏదైనా ఒక షేప్‌కి వచ్చాక డొనేషన్లు అడగడంలో అర్థం వుందికానీ అసలేమీ లేకుండా ఏదో చేయబోతున్నామని అడిగితే ఎవర్నికైనా నమ్మశక్యంగా వుండదు బిందూ. ఏమీ ఇవ్వరు కూడా. మరీ మొహమాటస్తులైతే మళ్ళీ వచ్చి కన్పించమంటారు"

"మొదట కేవలం ఐదుగురితోనే మొదలు పెట్టాలని వుందని చెప్పాను కదా. కనుక పెట్టుబడి కూడా మరీ ఎక్కువ అవసరం లేదు. నా సేవింగ్స్ ఒక ముప్ఫయివేలదాకా వున్నట్లుంది. ముందు అది ఖర్చుచేస్తాను"

అంది బిందు.

"ఈ ముక్క ఎప్పుడూ చెప్పలేదే? చెప్తే అప్పు అడిగేవాణ్ణి"

"అప్పుల అప్పారావులకి నా దగ్గర చోటులేదులే"

"ఈ ఇల్లు అమ్మడానికి నా మనసు ఒప్పుకోవడంలేదు గానీ, పొలం అమ్మిన డబ్బు ఆ ఆశ్రమానికే ఇస్తానమ్మా" అన్నాడు వీరయ్య.

బిందు కళ్లలోంచి రెండు బిందువులు రాలాయి.

"తాతగారూ, ముందుకి ముందు అలాంటి పనులేం చేయకండి. మొదట మీరు వస్తానన్నందుకే నాకు సంతోషంగా వుంది. కొన్నాళ్ళు వుండి చూసి, నిజంగా సంతృప్తికరంగా అన్పిస్తే మీబోటి ఇంకో పదిమంది కోసం పొలం డబ్బు ఇస్తే కాదనను. ఇల్లంటారా అది అమ్మాలనే ఆలోచనే వద్దు. మీకు చూడాలన్పించినపుడు ఈ ఊరికొస్తే ఇక్కడే కదా వుండాలి. ఎవరో వేరే వాళ్ళ ఇంట్లో వుండాల్సిన పరిస్థితి ఎందుకు తెచ్చుకోవాలి? "

వీరయ్య అలాగేనన్నట్లు తల పంకించాడు.

"హరీ, నీక్కూడా చాలా థాంక్స్. ముందుగా నా ఆలోచన నీకు చెప్పినపుడు ఎక్కడ తుంచిపడేస్తావోనని భయమేసింది. కాసేపు ఆకతాయిగా మాట్లాడినా తర్వాత అర్థంచేసుకున్నావు. మగవాళ్ళంతా నీలాగా వుంటే ఇక ఫెమినిజం ఎందుకు చెప్పు? " అంది బిందు.

హరి 'మరేమనుకున్నావు నేనంటే? ' అన్నట్లు దర్పంగా కాలరెగరేశాడు.

అతన్ని చూస్తూ ముగ్గురూ నవ్వేశారు.

★ ★ ★

ఉదయం ఆరు గంటల వేళ.

వాతావరణం ఎంతో ఆహ్లాదంగా వుంది.

అప్పటికే శ్రీహరీ, బిందూ స్నానాలు చేసేశారు.

బిందు తన సూట్‌కేస్‌ని లాక్ చేయడమూ మళ్ళీ ఏదో వస్తువు కన్పించి నాలుక కొరుక్కుంటూ తాళం తీసి అందులో పెట్టడమూ జరుగుతోంది. ఇక ఏమీ మిగిలుండే అవకాశంలేదు, అన్నీ సర్దేశాను అనుకున్న క్షణాన "నీ తుండు మర్చిపోయావమ్మాయి" అంటూ టవల్ని తెచ్చిచ్చింది శారదమ్మ.

"థాంక్యూ మామ్మా" అంటూ మరోసారి సూట్ కేస్ తెరిచి దాన్ని పెట్టింది.

"బిందూ, నీ సర్దుడు కార్యక్రమం ఈ జన్మకి ముగిసేట్లులేదే. అవతల బస్సెళ్ళిపోయిందంటే తూర్పు తిరిగి దణ్ణంపెట్టాల్సిందే" అంటూ విసుక్కున్నాడు హరి.

"అయిపోయింది" అంటూ సూట్ కేస్ చేతిలోకి తీసుకుంది.

"తాతగారూ వెళ్ళొస్తాను. మామ్మా వెళ్ళొస్తాను. నేను వీలైనంత త్వరలో వచ్చి మిమ్మల్ని తీసికెళ్తాను. ఈలోపు అక్కడన్నీ ఏర్పాట్లు చేయాలి కదా" అంది బిందూ.

పెద్దవాళ్ళిద్దరూ వాళ్ళనే చూడసాగారు.

"నేనొచ్చేలోపు మీ మనసులు మార్చుకోకండి, ప్లీజ్" వీరయ్య, శారదమ్మ ఏమీ మాట్లాడలేదు.

"తెలిసో, తెలీకో నేనేమైనా ఎక్స్ట్రాలు మాట్లాడి మిమ్మల్నేమైనా నొప్పించివుంటే అదేం మనసులో పెట్టుకోవద్దు మామ్మా"

శారదమ్మ కళ్లలో నీళ్ళు తిరిగాయి.

"ఇదేంటి మామ్మా, ఈ కన్నీళ్లేంటి? " బిత్తరపోయింది బిందూ.

"మీరొచ్చిందగ్గర్నుంచీ ఇల్లెంతో సందడిగా వుండి కళకళలాడింది. మీరెళ్ళిపోతున్నారు, మళ్ళీ బోసిపోతుంది" అంది శారదమ్మ గద్గదంగా.

అంత ప్రేమకి బిందు కళ్ళు చెమర్చాయి.

"ఇంకొన్ని రోజులేగా మామ్మా. మిమ్మల్ని నాతో తీసికెళ్ళిపోతానుగా. ఇక అప్పుడు మనమంతా కలిసేవుంటాం" అంది.

శ్రీహరి చేతిల్లో ఒక సంచిని చూసి "అదేంటి? " అంది బిందు.

"అమ్మమ్మ, తాతయ్యల ప్రేమ"

"ఆ? "




"అవును. వాళ్ళ ప్రేమని కూరగాయలు, ఊరగాయల రూపంలో సర్ది ఈ సంచిలో పెట్టిచ్చారు"

"వాళ్ళిస్తే నువ్వు పుచ్చుకోవడమేనా? "

"అదేంటమ్మాయి అలా అంటావు? "

"చిన్నవాళ్ళం, మీకు ఏమైనా తెచ్చివ్వా ల్సింది పోయి ఇక్కడివన్నీ మూట కట్టుకె ళ్ళడం న్యాయమా? "

"అలా అనకు. అవన్నీ ఇక్కడ కాసిన వేగా"

బిందుకి వాళ్ళని కష్టపెట్టాలని లేదు. కానీ అసలే అన్నీ దొరకని ఆ ఊళ్ళో అవి తీసికె ళ్ళకపోతే వాళ్ళకి ఉపయోగపడ్తాయి కదా అన్పించింది.

అయినా అంతకంటే రెట్టిస్తే బాగుండదని వూరుకుంది.

"నీ భుజానికి ఒక సంచీ వుందిగా, ఆ రెండో సంచి నాకు ఇవ్వరా అబ్బాయి, నేను పట్టుకుంటాను" అన్నాడు వీరయ్య.

"అక్కర్లేదు తాతయ్యా, నేను పట్టుకోగ లను"

"తాతగారూ, మామ్మా వెళ్ళొస్తాం" మళ్ళీ అంది బిందు.

"చింతపల్లి గేట్ దాకా వస్తామమ్మా" అన్నారు వాళ్ళిద్దరూ.

"ఇంకా నయంలే, వుండండిక్కడ. మమ్మల్ని అక్కడివరకూ వచ్చి సాగనంపాలా ఏమిటి విడ్డూరం కాకపోతే"

"కాదులేమ్మా, వస్తాం. మీకూ తృప్తిగా వుంటుంది"

"కానీ మీరొస్తే, నాకు అసంతృప్తిగా వుంటుంది. పెద్దవాళ్లని ఇంతదూరం నడిపిం చామే అని. ప్లీజ్ మామ్మా మీరిక్కడ వుండి పోండి. తాతగారూ, తొందర్లో వచ్చి తీసికె ళ్తాను"

వీరయ్య ఎంతో అభిమానంగా ఇద్దరి భుజాలమీదా చెయ్యేసి తడిమాడు.

అలా వాళ్ళిద్దరూ వీడ్కోలు తీసుకున్నారు. కనిపించినంత మేరా వెనక్కి తిరిగి చూస్తూ చేతులూపుతూ వెళ్ళారు.

"త్వరగా నడువు బిందూ"

"కళ్ళు కన్పించడంలేదా? ఇంతకంటే వేగంగా పీటీ ఉష తాత కూడా నడవలేడు"

"పీటీ ఉష తాత వేగంగా నడుస్తాడని ఎవరు చెప్పారు? నువ్వయితే ఫాస్ట్‌గా నడువు. లేకుంటే బస్సెళ్ళిపోతుంది, తర్వాత నీ ఇష్టం"

ఆ ఊరికి వచ్చేటప్పుడు ఎంతగానో పేచీ పెట్టిన బిందు ఇపుడు బస్సెక్కడ వెళ్ళిపోతుం దోనన్న భయంతో నడక కుదరకపోయినా, కాళ్ళు నొప్పిపుడ్తోన్నా కిమ్మనకుండా పరుగులు పెడ్తూ నడిచింది.

అన్నిటికంటే ముఖ్యంగా ఆమె సూట్‌కేస్ కూడా ఆమె చేతిలోనే వుంది.

శ్రీహరి చేతుల్లో మోయలేనంత బరువుంది మరి. సూట్‌కేస్‌ని అతని నెత్తిమీద పెడ్తే ఘోరంగా పోర్టర్‌లా వుంటాడని అలా చేయ లేకపోయింది.

వాళ్ళు మెయిన్‌రోడ్ మీదికి వస్తోంటే హార్న్ కొట్టుకుంటూ వాళ్ళు ఎక్కాల్సిన బస్సొస్తూ కన్పించింది.

స్పీడుని సూపర్ స్పీడుగా మార్చి ఆ బస్సు ఎక్కేశారు.

★ ★ ★

చింతపల్లి గేట్ దగ్గర ఎక్కిన బస్సులో విజయవాడవరకూ వెళ్ళి, అక్కణ్ణించీ హైదరా బాదు వెళ్ళే బస్ అందుకునేవరకూ ఇద్దరూ పెద్దగా మాట్లాడుకోలేదు.

ఆ బస్సెక్కి స్థిరంగా కూర్చున్నాక "ఈ ప్రయాణం ఎలా అన్పించింది బిందూ? " అనడిగాడు హరి.

"నిజం చెప్తే డ్రమెటిగ్గా మాట్లాడానంటా వేమో" అంది బిందూ నవ్వుతూ.

"అనన్లే చెప్పు"

"నా జీవితంలో ఒక కొత్త మజిలీ చేరడా నికి ఈ ప్రయాణమే కారణం అన్పిస్తోంది" అని ఒక్కక్షణం కళ్ళుమూసుకుని "అవును, నేనిక్కడికి రానట్లయితే వాళ్ళని కలవడం జర

క్కపోతే ఒక హోమ్ పెట్టాలనే ఆలోచన బహుశా వచ్చేది కాదేమో" అంది.

"అలా ఎందుకనుకోవాలి? మేఘాల్లో నీళ్ళుంటేనే చల్లగాలి తగిలినపుడు వర్షిస్తాయి. నీ మనసులో ఎక్కడో నలుగురికీ పనికొచ్చే పనేదయినా చేయాలనే తపన వుందని చెప్పావుగా. అది ఈ సందర్భంలో బయట పడింది. ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా చేసేందుకు పూనుకునేదానివేలే"

"ఏదేమైనా, రానన్నా నన్నిక్కడికి తీసుకొచ్చినందుకు నీకు ఎన్ని థాంక్స్ చెప్పినా తక్కువే"

"కానీ ఒక్కమాట..."

"ఏంటి? "

"ఇక ముసలివాళ్ళ ధ్యాసలో పడి నన్ను మాత్రం మర్చిపోకు"

"నిన్ను మర్చిపోతే నన్ను నేను మర్చిపోయినట్లే"

"ఇది ఏ సినిమాలో డైలాగ్? "

"ఒక్కటిస్తా జాగ్రత్త"

"ఒక్కటేనా? రెండో బుగ్గ ఏం పాపం చేసుకుంది? " అని చాలా మెల్లగా గుసగుసగా అన్నాడు.

"ఛీ, ఫో, ఇడియట్. నీకస్సలు బుద్ధిలేదు"

"ఎగ్జాక్ట్‌లీ. బుద్ధిలేదు కనుకనే ఇలా తిట్టే పిల్ల వెంటపడ్తున్నాను"

"నేనెక్కడ తిట్టాను? "

"చెట్టంత మగవాణ్ణి పట్టుకుని, చెట్టుక్కట్టేసి తంతాను అన్నావు. అంతకంటే ఇంకేం తిడ్తావు? "

"అదా, ఏదో సరదాకి అనుంటాను"

"ఏం మంత్రం పెట్టావోగానీ, అమ్మమ్మ, తాతయ్యలకి తెగ నచ్చేశావు"

"నాకు నిజంగా మంత్రాలేమైనా వస్తే మనుషులకి అసలు వృద్ధాప్యం అనేది లేకుండా చేస్తాను"

"హూ..."

"ఎందుకంత పొడవు నిట్టూర్పు పనామా కెనాల్లా? "

"నువ్వెక్కడికో వెళ్ళిపోతేను"

"నేనెక్కడికీ వెళ్ళలేదు"

"ఇక అస్తమానం వృద్ధులు, వృద్ధాప్యం అంటూ మొదలుపెడ్తావేంటి బిందూ? "

"ఎప్పుడూ ఎందుకు చెప్తాన్లే హరీ, కొత్త బిచ్చగాడు పొద్దెరగడు అన్నట్లు ఇప్పుడిప్పుడే ఆ ఆలోచన వచ్చింది కనుక ఆ ఊపులో వున్నాను. ఏదో ఎగ్జయిటింగా మాట్లాడ్తున్నానేమో"

"ప్చ్... నిన్ను చూస్తే ఈర్ష్యగా వుంది. నీకంటూ ఒక ఏవగేషన్ పెట్టుకున్నావు. నేనదేం లేకుండా బేకార్‌గా వున్నట్లనిస్తోంది"

"నువ్వు కూడా ఏమైనా చేయొచ్చుగా హరీ? "

"ఏం చేయను? "

"అది ఇతర్లు చెప్పాలా? "

"నువ్వు ఇతర్లు ఎలా అవుతావు? మనిద్దరం ఒకరేలే, చెప్పు"

"చింతపల్లి, ఇంకా ఆ పక్కన అనేక ఊళ్లు బాగా వెనకబడి వున్నాయి కదా. వాటికోసం ఏమైనా చేసే వీల్లేదా? "

"అక్కడున్నవాళ్ళే మెదలకుండా వూరుకుంటే మనం ఏం చేస్తాం? కందకు లేని దురద కత్తిపీటకు పట్టిందా? "

"ఇలా ఆలోచించేవాళ్ళు ఎవరికీ ఏమీ చేయరు"

"నా మాటల్లో ఏమైనా తప్పుందా? బస్సుల్లేవు. నీళ్ళురావు; ఆఖరికి రోడ్డయినా లేదే? ఏ ఎమ్మెల్యేనో కలిసి వాటి కోసం ప్రయత్నాలు చేసుకోలేరూ? పోనీ పనిమాలా వెళ్ళకపోయినా ఓట్లు దండుకోడానికొచ్చినపుడైనా ఆ వసతులు కల్పిస్తేనే ఓటేస్తామని ఖచ్చితంగా చెప్పలేరూ? అంత పప్పుసుద్దల్లా కూర్చుంటే మరెవరో వచ్చి ఉద్ధరించాలా? "

"నువ్వు నిందిస్తోన్న వాళ్ళలో తాతగారు కూడా వున్నారు గుర్తుంచుకో"

"తాతయ్య సంగతి వేరు, పెద్దవాడు. వెనకటి కాలంలో ఇవన్నీ తెలీవు. ఇప్పుడంటే





ఆయనే పెద్దవాడైపోయాడు"

బిందూకి మాట్లాడబుద్ధిగాక కిటికీలోంచి బయటికి చూడసాగింది.

"కోపమా, నేనన్నదాంట్లో లాజిక్ లేదా?"

"ఇదేం కోర్టుకేస్ కాదు, లాజికల్‌గా మాట్లాడ్డానికి. పిల్లల్లేని వాళ్ళని తీసేస్తే తక్కిన పెద్దవాళ్ళందరినీ వాళ్ళవాళ్ళ పిల్లలు చూసుకుంటే ఇక వాళ్ళు అనాథ వృద్ధులెందుకౌతారు? అలా అవబట్టేగా వాళ్ళకోసం వృద్ధాశ్రమాలు అవసరం అవుతున్నాయి. ఆ పిల్లలకే పట్టనిది మనకెందుకు తద్దినం అనుకుంటే ఇక మనలోనూ మానవత్వం లేనట్లేగా..."

హరికి ఆ మాట నిజమేనన్పించింది.

"లోకంలో అనేక అవకతవకలుండబట్టే దాన్ని సంస్కరించే వ్యక్తులు అవసరమౌతుంటారు. మదర్ థెరిసా, కందుకూరి వీరేశలింగం లాంటి వాళ్ళతో పోల్చుకుంటే మనమెంత హరీ? ఆఫ్టరాల్ కదా. అవునా, కాదా?"

"నిజమే వాళ్ళెక్కడ, మనమెక్కడ?"

"వాళ్ళు స్వర్గంలో, మనం బస్సులో" అంది బిందూ నవ్వుతూ.

ఒక నిమిషం ఆగి "జీల్ అనేది రక్తంలో వుండాలి తప్ప, తెచ్చిపెట్టుకుంటే రాదు. హిమాలయాలంత ఎదిగిన ఆ గొప్పగొప్ప వాళ్ళ పక్కన మనకో సెంటీమీటర్ స్థానమైనా వుండదు. వాళ్ళు అలా అంకితమైపోయి చేస్తే మనం తీరికవేళల్లో అయినా ఇతర్లకోసం పనిచేయలేమా?" అంది.

"ఏమో బిందూ; ఇప్పటివరకూ నాకు అలాంటి ఆలోచన్లు లేవు. దర్జాగా సంపాదిస్తూ, జలసాగా ఖర్చుపెట్టుకోవడం ఒక్కటే నాకు తెల్సింది. నేను, నా ఫామిలీ మెంబర్లు ఎంత సుఖంగా వుండేందుకు వీలవుతుంది అనేది తప్ప, సోషల్ సర్వీస్ లాంటి థాట్ నాకెప్పుడూ రాలేదు. ఒకవేళ నిన్ను బట్టి నేనూ ఏమైనా ఇన్‌స్పైర్ అయితే అప్పుడు చూస్తాను" అన్నాడు హరి దాపరికం లేకుండా.

"ఫోర్స్‌డ్‌గా ఎవరూ ఏదీ చేయలేరు, చేయకూడదు. నిజంగా చేయాలన్పిస్తే చేద్దుగాని, లేకుంటే లేదు. నీ పద్ధతిలో నువ్వుండు, నా పద్ధతిలో నేనుంటాను. కానీ హరీ..."

"ఇప్పుడంతా పావలాలు, అర్ధరూపాయలే గానీ కానీల్లేవమ్మా"

"ఇక్ష్వాకులనాటి జోకులేయకు"

"ఇంతకీ విషయమేంటి?"

"నాకోసం... అంటే హోమ్‌కోసం కేటాయించుకున్న సమయాన్ని, డబ్బుని లాక్కోవాలనో, నసపెట్టాలనో మాత్రం చూడకు. మరీ ఒక నాటుమొగుడిలా లేదా బిలో ఏవరేజ్ పర్సన్‌లా బిహేవ్ చేస్తూ హింసపెట్టకు"

"ఇదెక్కడి గోల?"

"కొన్ని కాపురాలు చూసిన భయంతో అంటున్నాలే. నన్ను నన్నుగా బతకనిచ్చావనుకో ఇద్దరమూ సుఖంగా, సంతోషంగా వుండొచ్చు ఏమంటావు?"

"నానేటంతను, నువ్వేటంతే అదే అంతను"

"ఏయ్ దొంగా" అంటూ హరి చెవిని సుకుమారంగా మెలిపెట్టింది బిందు.

"ఇప్పుడుగానీ నేనరిచానంటే, అందరూ నీ అఘాయిత్యాన్ని చూస్తారమ్మాయి" అన్నాడు హరి.

అంతపనీ చేయగలడని, గబుక్కున చేయి వదిలేసి కిటికీలోంచి బయటికి చూస్తూ నవ్వసాగింది బిందు.



**అంకితం**

ఎన్నో సామెతలు చెప్తూ హాస్య స్ఫోరకంగా మాట్లాడే నాన్నమ్మ వర్ధూ రంగమ్మ గారికి ప్రేమతో....

వి.నాగరత్న

## సచిత్ర విచిత్రం




## తెలివైన దొంగ

వాషింగ్టన్‌లోని ఓ బ్యాంక్ పక్కనే వున్న పార్క్‌లో జేమ్స్‌మేక్ కేండ్లిష్ అనే వ్యక్తి పబ్లిక్ సర్వీసు కోసం రెండు టాయ్‌లెట్లను ఏర్పాటుచేశాడు. ప్రజాసేవకి అతనికి సెనేటర్ నుంచి మెచ్చుకోలు ఉత్తరం కూడా వచ్చింది.

ఓ రోజు ఆ బ్యాంక్‌లోకి సొరంగం ద్వారా దొంగ జొరబడి మొత్తం దోచుకున్నాడు. పోలీసులు రంగ ప్రవేశం చేస్తే శుక్రవారం రాత్రి ఈ టాయ్‌లెట్ లోంచి సొరంగం తవ్వి ఆదివారం మధ్యాహ్నానికల్లా బ్యాంక్‌లోకి దొంగ చేరుకున్నాడన్న విషయం తేలింది. అంతేకాదు. ఆ దొంగ టాయ్‌లెట్స్‌ని కట్టించిన జేమ్స్‌మేక్ కాండ్లిష్ అని కూడా పోలీసులు కనుక్కున్నారు.

# 'మాస్టారు' పై సమీక్షలు

ఏప్రిల్ చతుర లో ప్రచురితమైన ఆదిమూలం రామబ్రహ్మం నవల 'మాస్టారు' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## సంపూర్ణ మానవజీవన దృశ్యం

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

వేల సంవత్సరాల చరిత్ర కలిగిన గురుశిష్య అనుబంధానికి నిర్వచనం, విభిన్న మానవ మనస్తత్వాలలోని ఒక వికృత పార్శ్వానికి నిలువుటద్దం, కష్టసుఖాలతో నిండిన సంపూర్ణ మానవ జీవన దృశ్యం ఆది మూలం రామబ్రహ్మం 'మాస్టారు'.

తల్లి, తండ్రి, గురువు, దైవం అనే ప్రాధాన్యతా క్రమంలో గురువుకు తల్లిదండ్రుల తరువాత అంతటి స్థానాన్నిచ్చి గౌరవించింది భారతీయ సాంప్రదాయం. 'నేను బతికి ఉన్నందుకు, నా తల్లిదండ్రులు బాగా బతుకుతున్నందుకు నా గురువుకు సర్వదా ఋణపడి ఉంటాను' అనే ఒక ప్రముఖ రష్యన్ రచయిత సూక్తి ఇక్కడ సందర్భోచితం. ఉద్యోగం చేస్తున్న ఊరిలోనే ఉండి, అందరికీ గురుతుల్యుడై, సర్వజన హితాన్ని కోరుతూ, నేటి కార్పొరేట్ చదువుల యుగంలో, భూతద్దంలో చూసినా కనిపించని వ్యక్తిత్వంతో నశించిపోతున్న ప్రాచీన గురుసంప్రదాయానికి ప్రతినిధిగా శేషగిరి మాస్టారి పాత్రను మలిచిన తీరు శ్లాఘనీయం. రాఘవయ్యను, భూదేవమ్మను దశరథుడు, కైకేయిలతో పోల్చలేకపోయినా నవల ఆద్యంతం రామాయణేతిహాసాన్ని తలపింపచేస్తుందనటం అతిశయోక్తి కాదు. ఏరుదాటి తెప్ప తగులబెట్టే చక్రవర్తి వంటి స్వార్థపరులూ, తామూ ఒక ఇంటి కోడళ్ళమని మరిచి లక్ష్మివంటి అమాయకురాళ్ళను హింసించే భూదేవమ్మ, పార్వతి వంటి శాడిస్టులు మనకు కొత్త కాదు. రామకృష్ణ, అతని కుటుంబం అనుభవించిన పేదరికం కళ్లు చెమ్మగిల్లేలా చేసింది. కానీ కష్టాలను తలచుకుంటూ, దురదృష్టాన్ని నిందించుకుంటూ కూర్చోక నిరాశావాదం, విధి అనే అసురులను ఆశ, అవకాశం అనే అస్త్రాలతో సంహరించి అజేయుడై జీవితంలో అందనంత ఎత్తుకు ఎదిగిపోయిన రామకృష్ణ పాత్ర నేటి నిరుద్యోగ యువతకు మార్గదర్శకం.

కానీ పెద్ద గీతను చిన్నగీత చేసినట్లుగా గురుస్థానాన్ని ఉన్నతంగా చిత్రీకరించడానికి సృష్టిలో అత్యంత గౌరవనీయులైన తల్లిదండ్రులను కించపరచి చూపటం లోక విరుద్ధం. ఈ ఒక్కలోటు తప్పించి శైలిలో గాని, కథనంలోగాని మంచి పట్టును ప్రదర్శించి ఎంసెట్ రాంకుల యుగంలో మరిచిపోయిన పవిత్ర గురుశిష్య అనుబంధాన్ని హృద్యంగా మలిచి ఒక మంచి నవల చదివిన తృప్తిని మిగిల్చారు రచయిత.

– పి.వి.యల్. నరసింహప్రసాద్
విశాఖపట్నం

## మూలస్తంభం

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

భారతీయ సంస్కృతికి మూలస్తంభం కుటుంబ వ్యవస్థ. ఆ కుటుంబ వ్యవస్థను కథాంశంగా తీసుకొని నవల రాయడం ఒక సాహసమే. ఎందుకంటే అలాంటి నవలలు



కోకొల్లలుగా వచ్చాయి... వస్తున్నాయి. కానీ గ్రామీణ ఇతివృత్తం తీసుకొని రాసి మెప్పించటం తక్కువ. అలాంటి ఒక మంచి నవల 'మాస్టారు'. ఉపాధ్యాయుడు బడికే పరిమితం కాకుండా విద్యార్థి వ్యక్తిత్వ జీవితానికి మార్గదర్శకుడు కావడం నవలకు ప్రాణం పోసింది.

ఈ నవలలో రాఘవయ్య, భూదేవమ్మ పాత్రలు రామకృష్ణ మీద కక్ష పెంచుకోవడానికి కారణమేమిటో నవల ప్రారంభంలో తెలియకుండా రచయిత సస్పెన్స్ కొనసాగించాడు. చివరకు సస్పెన్స్ విడిపోవడానికి రచయిత చూపించిన కారణాలు అంత బలంగా లేవు. అయితే ఒక్క విషయం మాత్రం చెప్పక తప్పదు. ఇది నా జీవితానికి అచ్చు గుద్దినట్లు సరిపోతుంది.

నేను నా జీవితంలో ఎదుర్కొన్న కష్టాలే రామకృష్ణ ఎదుర్కొన్నాడు. రాఘవయ్య, భూదేవమ్మ పాత్రలు నా తల్లిదండ్రులకు ప్రతిరూపాలు. చివర్లో రాఘవయ్య అనారోగ్యం రామకృష్ణను దగ్గర చేస్తుంది. ఇవన్నీ నా జీవితానికి నిలువుటద్దం వంటివి. ఈ కథాగమనం నా గుండెలోతుల్ని స్పృశించింది. నా పాతికేళ్ళ వైవాహిక జీవితం... ఎదుర్కొన్న కష్టాలు... కన్నీళ్లు ఒక సినిమా రీలులా నా మనోఫలకంపై ఆవిష్కరించబడ్డాయి. "హాట్సాఫ్ టు రామబ్రహ్మంగారు!"

నవల చదవడం ప్రారంభిస్తే అయిపోయేంతవరకు ఆగకుండా చదివించింది. కథాగమనంలో బిగువు సడలనివ్వకుండా ఒంగోలు మాండలికం ఛాయలు పుణికి పుచ్చుకున్నట్లుగా కథను నడిపించిన తీరు బాగుంది. నా చిన్ననాటి రోజులు నాకు గుర్తుకు వచ్చాయి. నేను ప్రస్తుతం చేస్తున్న అధ్యాపక వృత్తిని మరచి నా చిన్ననాటి గ్రామీణ వాతావరణంలోకి వెళ్లి తాదాత్మ్యం చెందాను.

సున్నిత మనస్కుడైన రామకృష్ణలో ఆత్మస్థైర్యాన్ని నింపి మనిషిగా నిలిపిన 'శేషగిరి మాస్టారు' పాత్ర ఉదాత్తమైనది. బడికే పరిమితం కాకుండా విద్యార్థి మానసికస్థితిని గమనించే ఒక ఉత్తమ వ్యవస్థకు మార్గదర్శి 'శేషగిరి మాస్టారు' పాత్ర ఈనాటి ఉపాధ్యాయులకు ఆదర్శం. 'క్షమయా ధరిత్రి' అని స్త్రీకి పర్యాయపదంగా చెప్పడానికి కారణం "లక్ష్మి" పాత్రేమో అనిపిస్తుంది. తనను వేధించిన వారినే లాలించిన ఆమె ఆదర్శ స్త్రీమూర్తి.

నాకు నచ్చిన నవల "మాస్టారు"ను గురించి ఎంత చెప్పినా అది తక్కువే అవుతుంది. అందుకే రామబ్రహ్మంగారికి శుభాభినందనలు. ఇలాంటి మంచి నవలలెన్నో వారి కలంనుండి జాలువారాలని ఆశిస్తున్నాను.

–సి. హెచ్. శేషయ్య
ఒంగోలు-523 001

## విలువైన సందేశం

**(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)**

సాధారణంగా ప్రతి అత్తగార్కి కోడలిమీద కంటే కూతురిమీదనే ఎక్కువ ప్రేమ ఉండటం సహజం. ఈ ప్రేమ పరాకాష్టకు చేరిన నేపథ్యంలో కోడలి (లక్ష్మి) కుటుంబాన్ని బయటికి గెంటేసి, కూతురి (పార్వతి) కుటుంబాన్ని ఇంట్లోకి తెచ్చిపెట్టుకోవడం జరిగింది 'మాస్టారు' నవలలో. తద్వారా తలెత్తిన పరిస్థితుల్ని, వాటి పర్యవసానాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రించడంలోను, ఒక విలువైన సందేశాన్ని అందించడంలోను రచయిత కృతకృత్యులయ్యారు. లక్ష్మి భర్త రామకృష్ణ- తనని భార్యాపిల్లలతోసహా ఇంట్లోంచి గెంటేసిన తల్లిదండ్రుల్ని తన హృదయంలోంచే బహిష్కరించాడు (మానవసహజంగానే). తనకి విద్యాబుద్ధులతో బాటు మంచి నడవడిని నేర్పి తన జీవ





తాన్నే చక్కదిద్దిన మాస్టారే (శేషగిరి) పూనుకోకపోతే రామకృష్ణ ఆపత్సమయంలో వున్న తల్లిదండ్రుల్ని నిర్దాక్షిణ్యంగా వదిలేసే వాడే! (టిట్ ఫర్ టాట్).

విద్యాబోధనలో ఏకాగ్రత, అంకితభావం కొరవడి, విద్యార్థులను గాలికొదిలేసే టీచ ర్లున్న నేటి సమాజంలో శేషగిరి మాస్టా ర్లాంటి 'అయ్యవార్లు' అరుదుగానైనా వుండడం మన అదృష్టం! నకిలీ వికలాంగ సర్టిఫికెట్లతో 'టీచరుద్యోగం'లో చేరి విద్యారం గాన్ని కలుషితం చేసిన సకలాంగులు, విద్యా ర్థినులను మభ్యపెట్టి, భయపెట్టి వారితో లైంగిక వాంఛల్ని తీర్చుకున్న కాముకోపాధ్యా యులు ఇటీవలనే బహిర్గతమయ్యారు.

'రౌడీ టీచరు', 'గూండా మాస్టరు'లాంటి పదాలు వార్తలకెక్కి సభ్యసమాజానికి తల వంపులు తెస్తున్న ఈ రోజులలో శేషగిరి లాంటి మానవతామూర్తులైన టీచర్లు అక్క డక్కడా కనిపిస్తారు. విద్యార్థులను మేధావు లుగా, లోకోద్ధారకులుగా తీర్చిదిద్ది, పగ, ప్రతీ కారాలకు తావు లేకుండా దుర్మార్గుడిలో సైతం మానవత్వాన్ని తట్టిలేపి మంచి మని షిగా తీర్చిదిద్దే టీచర్లు వర్తమాన సమా జంలో ఇంకా మిగిలే ఉన్నారని చాటిచె ప్పింది 'మాస్టారు' నవల. కష్టాల కడలిలో కృంగుతూ ఆత్మహత్యే శరణ్యమనుకునే మనిషికి మనోధైర్యాన్నిచ్చి, కొత్త జీవితాన్ని చ్చిన అమృతమూర్తి శేషగిరి మాస్టారు. సాటిమనిషి యొక్క శ్రేయస్సును కాంక్షించి సమాజాన్ని సన్మార్గంలో నడిపించే వ్యక్తులు నేటి 'ప్రపంచీకరణ యుగం'లో ఎంతో అవ సరం. ఎదుటి మనిషి మనకు అపకారం తలపెట్టినా, అతనికి ఉపకరించి, మనసు మార్చి, మంచి మనిషిగా చేయాలన్న తత్వం శేషగిరి మాస్టారిది! మహోన్నతమైన వ్యక్తి త్వంతో మాస్టారి పాత్ర ఆద్యంతం ఆకట్టు కుంది. కొండొకచో కథనంలో బిగువు సడలి, వార్తలు చదువుతున్నట్టుగా రచయిత కథ చెప్పుకుపోవడం కథాగమనాన్ని పేల వంగా మార్చింది. జరుగనిది జరిగినట్టు చూపించిన 'డ్రీమ్' సన్నివేశాలు నాలుగైదు ఈ నవలలో వున్నాయి. ఈ సన్నివేశాలలో చివరి రెండూ సస్పెన్స్ లోపించి చప్పబడి పోయాయి. డ్రీమ్ సన్నివేశం సృష్టించేం దుకు రచయిత ప్రయత్నిస్తున్నట్టు ఈ రెండు సీన్ల ప్రారంభంలోనూ ముందుగానే పాఠకులకు తెలిసిపోతోంది. అయినా సరళ మైన శైలితో నవల ఆద్యంతమూ ఆసక్తిక రంగా సాగింది.

**-పాట్నీడి చక్రరావు,**
విశాఖపట్నం-530 007

## నిజమైన అవార్డు

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'గు' అంటే అంధకారామనీ 'రు' అంటే పోగొ ట్టేవాడనీ అర్థం. కాలక్రమేణా ఈ 'గురు' శబ్దం భ్రష్టమై తాగుబోతులు సైతం వాడుకొ నేదిగా తయారైంది. కేవలం తాము తీసు కునే జీతాలకి పాఠాలు చెప్పేసి చేతులు దులిపేసుకొనే మాస్టార్లే ఎక్కువమంది వున్నారు ఈనాటి సమాజంలో. విద్యార్థికి పాఠాలు చెప్పటమేకాక, ఆత్మహత్యే శర ణ్యంగా భావించిన అతన్ని చక్కదిద్ది, ముళ్ళ కంపలా ఉన్న అతని జీవితాన్ని పూలబా టలా మార్చిన శేషగిరి మాస్టారి కథను, అతని పట్ల అనన్య సామాన్యమైన కృతజ్ఞత చూపి, అతణ్ణే సర్వస్వంగా భావించిన శిష్యుడు రామకృష్ణ కథను కలిపి 'మాస్టారు' పేరుతో నవలగా అందించిన 'చతుర'కు అభి నందనలు. నవల శైలి, నడక అద్వితీయం. పాత్రలన్నీ ఎక్కడా రాజీపడకుండా తమ తమ పరిధిలో వర్తించడం, సమతూకంలో ఉన్న సంభాషణ, రచయిత అనుభవాన్ని (రచనలో) చెప్పటమే కాకుండా, నవలని ఆగ కుండా చదివింపజేశాయి. తన ఇంటికి మాస్టారి పేరు పెట్టడం రామకృష్ణ గుండెలో

మాస్టారి పట్ల కృతజ్ఞతకు నిదర్శనం. నిజమైన మాస్టారికి అంతకంటే వచ్చే అవార్డులేమీ ఉండవంటే అతిశయోక్తి కాదు.

అయితే కేవలం తన తల్లిదండ్రులూ, అక్కా తనపట్లా, తన భార్య లక్ష్మి పట్లా చూపిన కర్కశత్వానికి వారిపై పుట్టుకొచ్చిన ద్వేషంలోంచి మాత్రమే పుట్టుకొచ్చిన రామకృష్ణ గురుభక్తి, గురువుపట్ల అభిమానం మరింత బలోపేతం చేయటానికి దోహదపడే అంశాలను మరికొన్నింటిని జోడిస్తే మరింత బావుండేది. అది రామకృష్ణ వ్యక్తిత్వాన్నీ, కథానాయకత్వాన్నీ బలపరచి ఉండేది. నవల పేరు 'మాస్టారు' అయినప్పటికీ కథంతా రామకృష్ణ చుట్టూ తిరగడం వలన పైవాక్యం రాయవలసివచ్చింది. ఏదేమైనా మాస్టారిగా శేషగిరి పాత్ర నేటి మాస్టార్లకు ఆదర్శనీయం. రచయిత రామబ్రహ్మంగారికీ, చతురకూ అభినందనలు.

–కె. హేమలతాదేవి,
పలాస-532 221

# పగకన్నా క్షమయే మిన్న

***(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)***

'ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు'. ధర్మం ఒంటికాలుమీద కుంటినడక నడుస్తున్నా పయనం సాగిస్తూనే ఉంది. ఇది వాస్తవం. శేషగిరి మాస్టారులాంటి మూర్తీభవించిన మానవత్వ స్వరూపాలు నేటి సమాజంలో బహు అరుదు. పవిత్రమైన ఉపాధ్యాయ వృత్తిని చేపట్టేవారు తమ శిష్యుల మనోగతాలను తెలుసుకుని వారిని చదువు విషయంలోనే కాక జీవితపథ నిర్దేశం చేయడంలో కూడా తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాలి.

జీవిత పరమార్థాన్ని, మానవజీవిత విలువలోని అంతరార్థాన్ని, 'పగకన్నా క్షమయే మిన్న' అన్న గొప్ప సత్యాన్ని బోధించిందీ నవల. అతిశయోక్తి ఏమిటంటే రామకృష్ణ విషయంలో అతని తల్లిదండ్రులనే చెడ్డవాళ్ళుగా చూపించి, మిగతావాళ్ళని చాలా మంచివాళ్ళుగా చిత్రీకరించడం. ఈ ఒక్క విషయాన్ని మినహాయిస్తే కథనం, శైలి చాలా అద్భుతం. నవల చదువుతున్నంతసేపూ ఎన్నిసార్లు నయనాలు చెమర్చాయో తెలియదు. చిత్రీకరణ హృదయాన్ని ద్రవింపచేస్తుంది. 'బావమరుదులు బతక కోరతారని' అన్నదానికి కుమారయ్య పాత్ర అద్దం పట్టింది. పశ్చాత్తాపాన్ని మించిన శిక్ష మరొకటి లేదని, పగకన్నా క్షమయే మిన్న అని చెప్పిన తీరు అత్యద్భుతం. అవకాశవాదిగా చక్రవర్తి పాత్ర ఎదుటివాడి బలహీనతలను క్యాష్ చేసుకోవడంపై ఆధారపడింది. క్షమాగుణంలో ఆడవారు భూదేవికి వారసులని లక్ష్మిపాత్ర చాటింది.

ఆద్యంతం ఉత్కంఠభరితంగా, పాఠకుని ఊహలకు అందకుండా మలుపులు తిరుగుతూ సాగింది. కలలు ఆలోచనలకి ప్రతిరూపాలని, కలలను సస్పెన్స్‌గా చిత్రీకరించిన విధానం బావుంది. కమ్మిన మబ్బులు తొలిగి చంద్రుడు వెలుతురుని వెదజల్లినట్లు, రామకృష్ణలో గూడుకట్టుకొన్న అజ్ఞానపు, ప్రతీకారపు మబ్బులను పిల్ల తెమ్మెరలాంటి తన హితబోధలచే తొలగించి, అతనికీ, అతని కుటుంబానికి వెన్నెల పంచిన శేషగిరి మాస్టారు ఉపాధ్యాయులందరికీ ఆదర్శప్రాయుడు.

– యమ్. చినవెంకటరావు
మహాదేవపురం-507 203

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్ళు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతో కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కేజీ, 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










**Pickles**

ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసిద్ధ

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.